# చతుర

మార్చి 2009
రూ.10/-

యర్రమిల్లి
విజయలక్ష్మి
కౌముది

సొగసు
చిరునామా
చార్మి...
6లో

కాలాతీతం
మార్క్‌ట్వేన్
ది అడ్వెంచర్స్
ఆఫ్ హాకల్‌బెరీఫిన్
118లో



# చతుర ప్రవేశిక



## మార్చి - 09

మార్చి 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1 పనిమనిషి గంగమ్మ పెద్దకొడుకు పేరేమిటి?

2. అరవింద స్నేహితురాలు తార కొడుకు?

3. సుహాస్ కొత్త అసైన్‌మెంట్ మీద ఎక్కడికి వెళ్లాడు?

4. కౌముది తల్లిపేరు?

5. సుహాస్ చెల్లెలి పేరు?

6. గుడ్డులో ఏ సొనను చార్మి తీసుకుంటుంది?

7. శ్రీను పాకెట్ మనీ ఎంత అడిగాడు?

8. తారాశంకర్‌కు జ్ఞానపీఠం వచ్చిన సంవత్సరం?

9. లహరి ఎవర్ని ప్రేమిస్తోంది?

10. కౌముది రచయిత్రి?

---

పంపినవారి పేరు: ------------------------------ వయసు (   )

చిరునామా: ------------------------------------------

------------------------------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

ప్రవేశికలకు చివరి తేదీ 16

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవచ్చు.




# రచయితలకు సూచనలు

**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టి పెట్టాలి. హాస్య, వ్యంగ్య తదితర ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. ఏ మాండలికమైనా రాయొచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర' నవల అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ నవలల్ని అచ్చులో 85 పేజీలు మించకుండా రాసి పంపాలి.

★ ఒక పాత 'చతుర' సంచిక తీసుకుని అందులో ఉన్న నవలలో ఒకటి లేదా రెండు పూర్తి పేజీలను తమ దస్తూరితో రాసి చూసుకుని ఆ మేరకు తమ నవల రాతప్రతి ఎన్ని పేజీలలో రాయవచ్చో అంచనాకు రావడం సులభం. ఏదేమైనా అచ్చులో 80-85 పేజీలకు మించకుండా లేదా తక్కువ కాకుండా ప్లాన్ చేసుకుని పంపడం మంచి పద్ధతి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు/రచనలు తిప్పిపంపేందుకు వీలుగా స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరు జతపరచడం మరువకండి. రాతప్రతులు పోస్ట్‌లో పోతే 'చతుర' బాధ్యత వహించబోదు.

★ స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవర్లు జతపరచని వారి రచనలు తిరస్కారానికి గురైతే ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి. వాటి గురించి ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు.

★ సాధారణంగా నవలలు కార్యాలయానికి అందిన 4 - 8 వారాలలోగా పరిశీలించి ప్రచురణార్హమైతే ఆ విషయం తెలియపరుస్తాం. కాకుంటే తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రచురితమైన ప్రతి నవలకు రూ. 6000/- పారితోషికం ఉంటుంది. నవల ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటి వారంలోనే పై మొత్తానికి రచయితకు చెక్కు అందుతుంది.

★ 'కొత్తగాలి' శీర్షికకు చిరుకవితలు పంపేవారు నాలుగు/ఐదు పంక్తులు మించకుండా పంపాలి. స్పార్క్‌కే మార్కు అన్న విషయం గుర్తించాలి.

**చతుర**

**చిరునామా :**

**ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082**

# చతుర

సంపుటి -32
సంచిక - 02
మార్చి 2009
374వ సంచిక



సేకరణ : ఎం.కావ్య

ముఖచిత్రం : చార్మి

ముఖపత్రాలంకరణ : రాజుయాట



ఆరోజు డ్యూటీకి వెలుతున్న భర్త సుహాస్‌కు అరవింద గుమ్మంలోనే వీడ్కోలు చెప్పింది.

"నే వచ్చేసరికి నన్నిద్దరు ఆహ్వానిస్తారులాగుంది" అన్నాడు సహజమైన చిలిపి నవ్వుతో. అతడి కళ్లలో ఆశారేఖతోపాటు చిన్న దిగులులాంటిదేదో కదిలింది.

"బీ హేపీ అరూ.. ఎవ్విరి థింగ్ విల్ బి ఆల్‌రైట్.." అని భార్యకు ధైర్యం చెప్పాడు.

ఆ తర్వాత ఏం జరిగింది?

**యర్రమిల్లి విజయలక్ష్మి**

నవల

## కౌముది

చదవాల్సిందే!

14 వ పేజీలో

బొమ్మలు: భాస్కర్



"నటిగా సినీ పరిశ్రమలో నా పెట్టుబడి కేవలం నా అందం, నా నటనా తీరు మాత్రమే. అందుకే అందం గురించి ఎప్పుడూ ఆలోచిస్తుంటాను. పంజాబీ అమ్మాయిని కాబట్టి మామూలుగానే కాస్త నాజూగ్గా కనిపిస్తా. మిగిలిన అందం మాత్రం మా అమ్మ నాకు పెట్టిన భిక్ష. పుట్టుకతోనే అంతో ఇంతో అందంగా ఉన్నాం కదా అని నేనెప్పుడూ ఊరుకోలేదు. దాన్ని పెంచుకోవడానికి, కాపాడుకోవడానికి ఎప్పుడూ ప్రయత్నిస్తూనే ఉంటాను. నా ప్రయత్నాలేంటో వినండి.. వీలైతే మీరూ ప్రయత్నించి చూడండి.." -చార్మి

# అందాల భామ.. సొగసు చిరునామా.. చార్మి!

★ నేను ప్రతిరోజూ ఉదయం ఆరు గంటలకు ముందే నిద్రలేచేస్తాను. లేవగానే గోరువెచ్చని నీటిలో నిమ్మరసం, తేనె కలుపుకుని తాగుతాను. ఆరు నుంచి ఏడుగంటల వరకు యోగా చేస్తాను. దాదాపు ప్రతిరోజూ ఓ గంటసేపు యోగాభ్యాసం తప్పనిసరి. శ్వాసకు సంబంధించినవి, సూర్య నమస్కారాలకు సంబంధించినవి.. మరికొన్ని ఆసనాలు ఈ యోగాలో భాగంగా ఉంటాయి.

★ తర్వాత అల్పాహారం. కడుపు నిండుగా తినే అలవాటు లేదు. ఈ అల్పాహారంలో ఎక్కువగా బొప్పాయి ముక్కలుండేలా చూసుకుంటాను. తర్వాత లైట్‌గా ఏదో ఒక టిఫిన్ చేస్తాను. అనంతరం- ఉంటే షూటింగ్‌కు వెళ్తాను. షూటింగ్ మధ్య విరామాల్లో ఏవంటే అవి తినే అలవాటు లేదు.

★ మధ్యాహ్నం మామూలుగా భోజనం. ఇందులో ఆకుకూరలు ఎక్కువగా ఉంటాయి. ముఖ్యంగా పాలకూరంటే మరీ ప్రాణం. మధ్యాహ్న భోజనానంతరం ఇరవై నిమిషాలు తప్పకుండా నిద్రపోతాను. ఆ చిన్ని కునుకు వల్ల నిజంగా చాలా ఫ్రెష్‌గా అవుతాను. మధ్యాహ్నం నుంచి మళ్లీ కొత్తరోజు ప్రారంభమైనట్టుంటుంది.

★ నాకు మాంసాహారం అలవాటులేదు. అంతా శాకాహారమే. కానీ గుడ్డులో తెల్లసొన మాత్రం తప్పక తీసుకుంటాను. కాకరకాయలు, తాజా కూరగాయలు తప్పనిసరి. ఆదివారం మాత్రం ఆహారానికి ఏ నియమాలూ పెట్టుకోను. నచ్చినవన్నీ లాగించేస్తాను.

★ సాయంత్రం ఇంటికెళ్లిన తర్వాత ఏవో పళ్ల రసాలు తీసుకుంటాను. తర్వాత 15-20 నిమిషాలు తప్పకుండా ట్రెడ్‌మిల్ చేస్తాను. ఆ

వాకింగ్ చాలా మంచిది. పైగా దేహం చాలా తేలిగ్గా అనిపిస్తుంది.

★ ఎట్టిపరిస్థితుల్లోనూ సాయంత్రం ఏడు గంటలలోపే భోజనం పూర్తిచేస్తాను. కాసేపు టీవీ వగైరాలతో కాలక్షేపం.. రాత్రి 9-9.30 మధ్య ఎట్టి పరిస్థితుల్లోనూ పడకగదిలోకి దూరిపోతాను. ఆ సమయానికి నా సెల్ఫోన్లు స్విచ్ఛాఫ్ అయిపోతాయి. పడుకుంటే చాలు వెంటనే నిద్ర పట్టేస్తుంది. కలలు పెద్దగా రావు. నా నిద్ర చాలా కమ్మగా ఉంటుంది తెలుసా? ఎందుకంటే నా ఒత్తిళ్లు, టెన్షన్లన్నింటికీ బెడ్రూమ్ బయటే గుడ్నైట్ చెప్పేస్తాను.

★ విచిత్రం ఏమంటే- నాకు అర్ధరాత్రి బాగా ఆకలవుతుంది. 1-2 గంటల మధ్యలో తప్పకుండా లేస్తాను. ఎంత నీళ్లు తాగినా ఆకలి తీరదు. అందుకే బెడ్రూమ్లో ఎప్పుడూ బొప్పాయి, యాపిల్, జామకాయలు.. ఒకటేమిటి? రకరకాల తాజాపండ్లు ఉంటాయి. ఆకలేస్తే లేచి ఓపిగ్గా కూర్చుని తింటాను. ఆ వేళప్పుడు నూనె పదార్థాలను మాత్రం ఎట్టిపరిస్థితుల్లోనూ ముట్టుకోను.

★ నేను పబ్లకు, పార్టీలకు దూరం. అర్ధరాత్రి వరకు బయటతిరగడం నాకు నచ్చదు. ఆ సమయంలో నిద్రపోతే రేపటి నా షూటింగ్కు మరింత గ్లామరస్గా తయారవ్వచ్చు కదా అనేది నా సిద్ధాంతం.

★ చర్మసౌందర్యంపైన కూడా ఎక్కువగా దృష్టిసారిస్తా. ఎందుకంటే రాత్రింబవళ్లు షూటింగ్ చేయాలి. ఎండనకా, దుమ్మనకా ఆరుబయట షూటింగ్లలో పాల్గొనాలి. ఒకవేళ సెట్లో ఉంటే లైట్ల కాంతిలో బాగా వేడి చేస్తుంది. దానికి తగ్గట్టు ఆహారం విషయంలోనూ మార్పులు చేసుకుంటాను. త్వరగా జీర్ణమయ్యే ఆహార పదార్థాలను తీసుకుంటాను. నీళ్లు ఎక్కువ తాగుతాను. ఎంత నీరు తాగితే అంత మంచిది. ఆ సిద్ధాంతాన్ని ఎవరైనా కళ్లుమూసుకుని నమ్మాల్సిందే.

★ మాటిమాటికి నేను చేతులను ముఖంపై పెట్టను. ముఖాన్ని చేతితో తాకేముందు ఎట్టి పరిస్థితుల్లోనూ చేతుల్ని కడుగుతాను. చాలాశుభ్రంగా ఉంటాను. నా రూమ్లో బెడ్ షీట్ల నుంచి, టవళ్లు, ప్రతిరోజూ మార్చాల్సిందే. నేలను శుభ్రంగా తుడిపిస్తాను. కిటికీలను ప్రతిరోజూ తుడిపిస్తాను.

★ నా దగ్గర పనిచేసేవాళ్లకు నేను పెట్టే తొలి కండిషన్ ఇదే. వాళ్లు ప్రతి పది నిమిషాలకు ఒకసారి డెటాల్తో చేతుల్ని శుభ్రం చేసుకోవాలి.



నాకు షూటింగ్ మధ్యలో వాళ్లందించే నేప్కీన్లు కూడా శుభ్రంగా ఉండాలి. నీళ్ల బాటిల్ నుంచి ప్రతిదీ అంతే.

★ కేశాలకు సంబంధించి కూడా చాలా శ్రద్ధ తీసుకుంటాను. తలకట్టు అందంగా ఉంటే ముఖానికి మరింత అందం వస్తుందనేది నా అభిప్రాయం. బాగా వేడి లేదా బాగా చల్లని నీళ్లను తలస్నానానికి వాడను. తరచూ తలకు పెరుగు పెట్టుకుంటాను. దాని వల్ల జుట్టు మెత్తగా, పట్టులా అవుతుంది. రోజు మార్చి రోజైనా తలస్నానం చేస్తాను. కాస్త వేడి నూనెతో తలకు మసాజ్ చేసి, అరగంట ఉండి షాంపూతో కడిగేస్తాను.

★ అనవసరమైన టెన్షన్లకు నేను దూరం. నన్ను గురించి ఎవరో ఏమో అనుకుంటున్నారన్న విషయాన్ని నేనసలు పట్టించుకోను. నా ముందు మాట్లాడితే మాత్రం ఊరుకోను.

★ మనసులో ప్రతికూల భావాలను దగ్గరికి రానివ్వను. చేతనైతే నలుగురికి సాయం చేయాలి తప్ప ఎవరికీ హాని చేయకూడదన్నదే నా సిద్ధాంతం. ప్రతి మనిషిలోనూ ఏదో ప్లస్ పాయింట్స్ ఉంటాయి. వాటిని చూసి ముచ్చటపడతాను. వీలైతే అనుసరించడానికి ప్రయత్నిస్తాను. కార్టూన్లు బాగా చూస్తాను.

★ ఫ్రెండ్స్తో ఎక్కువసేపు గడుపుతాను. ఫోనుల్లో గంటల తరబడి మాట్లాడటం చేతకాదు. సూటిగా, స్పష్టంగా, నిజాయతీగా ఉండటం అలవాటు. ఎదుటివారిలో తప్పులు కనిపెట్టడం నాకు చేతకాని విషయం.

**– చల్లా భాగ్యలక్ష్మి**

అపార్ట్‌మెంటాలజీ-14

# ఓర్నాయనో! గృహ హింస!



యర్రంశెట్టి సాయి

**హ**మీద్ భాయ్ గడ్డానికి సోప్ రాసుకుని షేవింగ్ చేసుకోబోతూండగా బయటనుంచి కేక- వెనుకే డోర్‌బెల్ వినిపించింది.

"ప్రెసిడెంట్‌గారూ! ప్రెసిడెంట్ గారూ-"

"ఆరై భయ్ ఆరై-" అంటూ గడ్డానికి సోప్‌తోనే బయటికొచ్చాడతను.

అతని అవతారం చూసి డోర్‌బెల్ మోగించిన శాస్త్రి కొంచెం చమకాయించి సర్దుకున్నాడు.

"ఇదేంటి సార్- నేను పరేషానయినా-"

"నిమిషానికొకడు దర్వాజా బాదుతూంటే ఇంకెలా వస్తయ్?" చిరాగ్గా అన్నాడు హమీద్‌మియా.

రోజూ గడ్డం చేసుకునేప్పుడే అందరూ ఇంటిమీదపడి డిస్టర్బ్ చేయటం అతనికి చిరాగ్గా ఉంది.

"ఇంతకూ బాత్ క్యాహై శాస్త్రీ సాబ్! పొద్దుటేల్ పొద్దుటేల్ ఎందుకు వచ్చినయ్ నువ్వు?" అడిగాడతను.

"వచ్చినయ్ అనగూడదు సార్- ఎందుకు వచ్చారు అనాలి-"

"గ్రామర్ క్లాసు తర్వాత భయ్- బాత్ క్యాహై బోలో-"

"ఇంకేముంది? మా 'డి' బ్లాక్‌లో మంచి నీళ్ళు రావటంలే! పదిపదిహేను రోజులకోసారి ఇదే లొల్లి! మీ కమిటీ వాళ్ళకు ఎన్నిసార్లు చెప్పినా యాక్షన్ తీసుకోలేదు"

హమీద్‌మియా చిరాగ్గా సెల్‌తీసి వైస్ ప్రెసిడెంట్ మొహిందర్‌కి ఫోన్ చేశాడు.

"మొహిందర్ భాయ్- ఆ 'డి'బ్లాక్‌లో ఫిర్‌సే పానీ బంద్ హో గయాహై! దాని రిపేర్ల సంగతి ఏం చేసినయ్?"

"ఆ రిపేర్లు చేయించమని ఆర్గనైజింగ్ శెక్రటరీకి చెప్పాను కదా" అన్నాడతను.

వెంటనే ఆర్గనైజింగ్ శెక్రటరీకి ఫోన్ చేశాడు హమీద్‌మియా.

"అదా! వాటర్ వ్యవహారాలన్నీ విజయ్ యాదవ్ చూస్తున్నాడు" చెప్పాడతను.

విజయ్‌యాదవ్‌కి ఫోన్ చేస్తే-

"శంకరమూర్తికి చెప్పాను సార్-" అని జవాబు రావడంతో హమిద్‌మియాకి విసుగొచ్చింది.

అప్పుడే వాచ్‌మెన్ అక్కడికొచ్చాడు.

"సార్ 'డి' బ్లాక్‌లో నీళ్ళు రావటం లేదంట! దాని రిపేర్ల సంగతి మీతో మాట్లాడమని శంకర్‌మూర్తి సార్ చెప్పిండు-" అన్నాడు.

"అంటే నేను చెప్పిన పని తిరిగి తిరిగి నాకే చేయమని చెప్తున్నయ్! సరే శాస్త్రీ సాబ్- నేను ఇయాళ మీటింగ్ పెట్టి డిసైడ్ జేస్తుంది-"

శాస్త్రి వెళ్ళిపోగానే మళ్ళీ గడ్డం చేసుకోబో తూంటే మళ్ళీ డోర్‌బెల్..

"ఛా! ఇస్కి..." అనుకుంటూ వెళ్ళి తలుపు తీశాడు. ఎదురుగా విశ్వనాథం-

"ఇదిగో ప్రెసిడెంట్ సాబ్! మళ్ళీ ఇవాళ ఎవడో నా మిల్క్‌పాకెట్‌లోని పాలు సగం కాజేశాడు- కిందటిసారి కూడా నీకీవిషయం చెప్పా! ఎవరో కావాలని కుట్రపన్ని ఈ పని చేస్తున్నారు! నువ్వేం యాక్షన్ తీసుకోవా!"

హమీద్‌మియాకి మండిపోయింది.

"అంటే? ఏంది నువ్ జెప్పేది? మై పోలీస్ కా నౌఖరీ కరూ? మై మిల్క్ పాకెట్స్ కా చౌకీదార్ హూ? క్యా బాత్ కర్‌రహే హై మియా? "

అదే సమయంలో- ఆ పక్క ఫ్లాట్లో ఉన్న హనుమంతరావ్ తన కొడుకు శ్రీనుతో హోమ్‌వర్క్ చేయిస్తున్నాడు.

"సిక్స్ ఎయిటీ జార్ ఎంత? "

శీను తన కాలిక్యులేటర్ తీసి లెక్క కట్టబోయాడు గానీ హనుమంతరావ్ ఠక్కున లాగేసుకున్నాడు.

"ఏంట్రా! సిక్స్ ఎయిటీ జార్ చెప్పడానికి నీకు కాలిక్యులేటర్ కావాలా? ఏడో క్లాసు చదువుతున్నావ్- టేబుల్స్ అన్నీ బైహార్ట్ రావాలె నీకు? "

శ్రీను చిరాగ్గా చూశాడు.

"అట్లాగా! అయితే మీ ఆఫీసర్ సెల్ నెంబరెంతో చెప్పు చూద్దాం-"

"నీకెందుకది? "

"అసలు చెప్పు చూద్దాం-"

హనుమంతరావ్ తన సెల్‌ఫోన్‌లో ఆ నెంబర్ వెతకబోయాడు.

"నీకేమయినా తెలివుందా డాడీ! తెల్లారి లేస్తే పాతికసార్లు మీ బాస్‌తో మాట్లాడు తుంటావ్- అయినా నెంబర్ ఇంతవరకూ బైహార్ట్ చేయలేకపోయావ్-"

"ఒరేయ్" అంటూ తండ్రి చెవి మెలిపె డుతూంటే "అబ్బా" అంటూ గావుకేక పెట్టాడు.

"ఏంట్రా! నొప్పా? మా తాత మా నాన్న చెవి మెలేస్తేనే మా నాన్నకు చదువొ చ్చింది. మా నాన్న నా చెవి మెలిపెడితేనే నాకు చదువొచ్చింది. అందుకని నేను నీ చెవి మెలిపెడితేనే నీకు చదువొస్తుంది- అవునా, కాదా? "

"ఓకే డాడీ- నీకోమాట చెప్పనా? "

"ఏంటది? "

"వంశపారంపర్యంగా వస్తోన్న ఈ గూండాయిజాన్ని మన తరంతో ఫుల్‌స్టాప్ పెట్టాలి. ప్లీజ్ బిహేవ్ లైక్ ఏ డాడ్" అనేసి చెవి వదిలించుకుని వెళ్ళిపోయాడు వాడు.

హనుమంతరావ్ షాకింగ్ ఎక్స్‌ప్రెషన్ చూసి అతనిభార్య కనకం నవ్వింది.

"ఏడో క్లాస్‌కే నాకిలా వార్నింగిచ్చాడంటే టెన్త్‌కొచ్చేసరికి ఎలా ఉంటాడంటావ్? "

"వీర ఉతుకుడే.. డౌటెందుకు? " అన్నాడు శంకరమూర్తి ఇంట్లోకొస్తూ.

"నోనో! వీడినిలా వదిలేస్తే లాభం లేదు. డిసిప్లిన్‌లో పెట్టితీర్తా-"

"ట్రై చెయ్" అన్నాడు విజయ్‌యాదవ్ హమీద్‌తోపాటు లోపలికొస్తూ.

అప్పుడే స్కూల్ బ్యాగ్ భుజానేసుకుని బయటికొచ్చాడు శ్రీను.

"మమ్మీ ఫిఫ్టీరుపీస్ పాకెట్‌మనీ ఇవ్వు!"

"ఫిఫ్టీ రుపీసా? " అదిరిపడ్డాడు హను మంతు.

"మనమేం లక్షాధికారులమా? రోజూ నువ్వో యాభై, నేనో యాభై ఖర్చు చేస్తే డబ్బెలా సరిపోద్ది? "

"నీ యాభై ఖర్చు మానుకో- సరిపోద్ది"

హమీద్‌మియా శీనుకి నచ్చజెప్పబో



యాడు.

"ఇగో ఈ తెలివంతా ఎడ్యుకేషన్‌లో ఉండాలె! నీ వయసులో ఉన్నప్పుడు నాకు పూరోంకా పూరా ఫస్ట్‌రాంక్ వచ్చింది! సమజా! మీరి నీ సంగతేంటి? "

"ఇగో- నీ వయసులో రాజశేఖర్ రెడ్డి చీఫ్ మినిష్టరయ్యాడు. మరి నీ సంగతేంటి? "

హమీద్‌మియా షాకయ్యాడు.

"మమ్మీ.. వీళ్ళ లెవల్ ఇంతేగానీ ఫిఫ్టీ ఇవ్వు త్వరగా- లేకపోతే స్కూల్ మానెయ్యాల్సి వస్తుంది"

కనకం సైలెంట్‌గా డబ్బిచ్చేసింది.

ఆ తరువాత మేమంతా మీటింగ్ పెట్టి పిల్లల విపరీత ప్రవర్తన గురించి డిస్కస్ చేస్తోంటే హనుమంతరావ్ మిసెస్ కనకం హడావుడిగా ఓ కాగితం పట్టుకొచ్చింది.

"ఇదిగో! మనాడి నోట్‌బుక్‌లో ఏం దొరికిందో చూశారా? లవ్‌లెటర్" అంటూ ఓ కాగితం మాకిచ్చింది.

అందరం ఆత్రుతగా తీసుకుని చూశాం.

"హాయ్ నిషీ! మనిద్దరం ఇవాళ స్కూల్ ఎగ్గొట్టి సినిమాకెళ్ళి కిస్ చేసుకుందాం! ఓకేనా? నీ లవర్- శీను"

అందరం అదిరిపడ్డాం.

"ఇది టూమచ్ ఉన్నయ్- ఈ సినిమాలు, టీవీ చానెల్స్ మొత్తం పిల్లలందరినీ నాశనం చేస్తున్నయ్-" అన్నాడు హమీద్‌మియా ఆవేశంగా.

"పిల్లలు ఇంత దారుణంగా చెడిపోతుంటే- మనం చూస్తూ కూర్చోడానికి వీల్లేదు- పదండి స్కూల్‌వాళ్లని నిలదీద్దాం" అన్నాడు విజయ్‌యాదవ్.

వెంటనే అందరం మా వాచ్‌మెన్ ఈ మధ్యే కొన్న సెకండ్‌హాండ్ కారెక్కి శ్రీను స్కూలుకి చేరుకున్నాం.

ప్రిన్సిపాల్ తనెదురుగ్గా ఉన్న లాప్‌టాప్‌లో శిల్పాశెట్టిడాన్స్ తన్మయత్వంతో చూస్తూండటం మా కంటపడింది.

ఆ డాన్స్ ఎట్రాక్టివ్‌గా ఉండడంతో మేమూ చూస్తూండిపోయాం- కొద్దిసేపు.

అదయ్యాక ఆ ప్రిన్సిపాలూ, మేమూ ఒకేసారి స్పృహలో కొచ్చాం.

"ఆ! మీరెవరు? ఎప్పుడొచ్చారు, ఎందుకొచ్చారు? " అనడిగాడతను కంగారుగా.

"అయామ్ శీనూస్ ఫాదర్! సెవెంత్ క్లాస్ చదువుతున్నాడు-" అన్నాడు హనుమంతరావు.

"అలాగా! శీనూ బ్రైట్ స్టూడెంట్! డిసిప్లిన్డ్ బాయ్. అసలు మా స్కూల్లో మేము పిల్లలకి నేర్పే డిసిప్లిన్ ఆంధ్రప్రదేశ్ అంతా వెతికినా మీక్కనిపించదు"

"అవునవును- ఇదిగో వాడి క్లాస్‌మేట్‌కి వాడు రాసిన లవ్‌లెటర్ చదువుతేనే మాకా విషయం అర్థమయింది-" అంటూ లెటర్ అతనికిచ్చాడు హనుమంతరావు.

ఆ లెటర్ చదివి ప్రిన్సిపాల్ షాకవుతాడని మేమంతా ఉత్కంఠతో ఎదురుచూశాం గానీ పూర్తిగా డిజపాయింట్ చేశాడు.

"ఒండర్‌ఫుల్! నేను చెప్పలా మీ వాడి స్టాండర్డ్ చూడండి! ఒక్క స్పెల్లింగ్ మిస్టేక్ లేదు. నేను చెప్తూందదే! హైస్టాండర్డ్! మా స్కూల్ ఎడ్యుకేషన్-"

మాకు మతిపోయినట్లయింది.

హమీద్‌మియాకి వళ్ళు మండింది. "ఏయ్ ప్రిన్సిపాల్! నీకేమయినా తెలివీ ఉన్నయ్? సాత్ క్లాస్ పడనేవాలా బచ్చా- లవ్‌లెటర్ రాస్తున్నయ్- కిస్సింగ్ చేస్తాం అంటున్నయ్- ఇదీ హైస్టాండర్డ్ ఉన్నయ్? నీకు దమాక్ ఉన్నయ్? " అంటూ అరిచేసరికి ప్రిన్సిపాల్ షాకయ్యాడు.

"అదేంటి సార్! అలా అంటారు- మా స్కూల్ బ్రోచర్‌లో ఏముందో ఒక్కసారి చూడండి! స్కూల్ విత్ అమెరికన్ స్టాండర్డ్స్! అంటే ఏంటి? అమెరికా టైప్ ఎడ్యుకేషన్‌ని అట్లా అచ్చు గుద్దేస్తామన్న మాట! అమెరికా స్టాండర్డ్ అన్నప్పుడు




అంతో, ఇంతో సెక్సూ, డ్రగ్సూ, గన్‌ఫైట్సూ ఉంటయ్ కదా-"

మళ్ళీ షాకయ్యాం అందరం.

"ఇదేంటి వీడిట్లా రివర్స్ వస్తున్నాడు? " అనీజీగా అడిగాడు హనుమంతరావ్.

"మనం సైలెంట్‌గా ఉంటే వీడు రెచ్చిపో తాడు- మళ్ళీ దులిపేయండి-" సలహా ఇచ్చాడు శంకరమూర్తి

"సిగ్గు లేకపోతేసరి! అమెరికా టైప్ ఎడ్యుకేషన్ అనుకున్నాం గానీ ఇలా పిచ్చిపిచ్చి వేషాలేయించే వెధవస్టాండర్డ్ అని మాకేం తెలుసు? " తిరగబడ్డాడు విజయ్‌యాదవ్.

"అమెరికా స్టాండర్డ్ అంటే సపరేట్‌గా ఎడ్యుకేషన్ ఒక్కటే రాదండీ! అది పాకేజ్ డీల్! మొత్తం చదువూ, సెక్సూ, డ్రగ్సూ, గన్స్- అన్నీ కలిపి వస్తాయన్నమాట-"

మాకేం మాట్లాడాలో తెలీలేదు.

"మన భారత సంస్కృతి మాటేంటి? అది మట్టికొట్టుకు పోవలసిందేనా? " ఆవేశంగా అడిగాడు శంకరమూర్తి.

ప్రిన్సిపాల్ కొంచెం కంగారుపడ్డాడు. 'భారత్ సంస్కృతి' అన్న సబ్జెక్ట్ డిస్కషన్‌కొచ్చిందంటే చాలు.. టోటల్‌గా వణికి పోతాడు. ఒకసారి ఏబీవీపీ వాళ్ళతో ఆ విషయంలోనే గొడవ పడ్డప్పుడు ఇంచు మించుగా రెండుచోట్ల బాడీలో ఫ్రాక్చర్ అయింది.

"అహహ! భారత సంస్కృతి చాలా గ్రేటండీ! ఆ మాటెలా కాదంటాను? కాపోతే అమెరికా సంస్కృతి కూడా చాలా వరకూ మంచిదే! సంస్కృతి అన్నాక ఎక్కడో, ఏదో లోపం ఉండకపోదు కదా!" అన్నాడు ప్రిన్సిపాల్.

"ఏంటి అమెరికా సంస్కృతి మంచిదా? బుద్ధుందటయ్యా? భారత సంస్కృతెక్కడ? అమెరికా సంస్కృతి ఎక్కడ? నక్కకీ, నాగలోకానికీ ఉన్న తేడా ఉంది తెలుసా? " అరిచాడు హనుమంతరావ్.

"అమెరికా సంస్కృతి అంత పనికి రానిదయితే పిల్లల్ని పుట్టిన దగ్గర్నుంచీ అమెరికా పంపాలి, అమెరికాలో చదివించాలి. అమెరికాలోనే ఉద్యోగం చేయించాలి అని ఎందుకు కక్కుర్తి పడుతున్నారండీ? "

ప్రిన్సిపాల్ కొట్టిన దెబ్బకి అందరికీ కళ్ళు బైర్లుకమ్మాయ్-



"వీడినిలా గెలవటం కష్టం! ఇంకో రూట్లో వద్దాం" అన్నాడు విజయ్‌యాదవ్ గుసగుసలాడుతూ-

"ఏ రూట్లో వద్దాం? "

"అదే.. ఇప్పుడు ఇది జరిగింది గనుక సెట్ రైట్ చేయడానికి తనేం యాక్షన్ తీసుకుంటాడో అడుగుదాం-"

అదే మాటడిగాడు హనుమంతరావ్.

"అవునయ్యా! ఇప్పుడీ లవ్ లెటర్ గొడవ నీ దృష్టికి తెచ్చాం కదా! నువ్వేం యాక్షన్ తీసుకుంటావ్? " అడిగాడతను.

"నేనేం యాక్షన్ తీసుకుంటానండీ? యాక్షన్ తీసుకోడానికి నాకేం పవర్స్ ఏడ్చాయ్ గనుక! పిల్లలు ఎన్ని వెధవ పనులు చేసినా సైలెంట్‌గా ఊరుకోవాలి కదా! నెత్తిమీద ఓ మొట్టికాయ వేశానని ఓ పిల్లగాడి తల్లిదండ్రులు గూండాలతో వచ్చి మా స్కూలు తగలబెట్టారు. అసలు ఇలాంటి సిట్యుయేషన్‌లో మీరయితే ఏం చేస్తారు చెప్పండి? " అంటూ మళ్ళీ మా మీదకే గూగ్లీ విసిరాడు.

ఆ ప్రశ్నకేం జవాబు చెప్పాలో మాకు అర్థం కాలేదు- "మేమయితే ఆ కుర్రాడిని నాలుగు తగిలిస్తాం! నాలుగు తన్నయినా పిల్లల్ని మంచిదారిలో పెట్టాలనేది మా పాలసీ!" చెప్పాడు శంకరమూర్తి.

"ఇప్పుడిలాగే అంటారు- తర్వాత పిల్లాడి మీద ఈగ వాలితే చాలు- నా మీదకు దండెత్తి బండబూతులు తిడతారు! ఇవన్నీ నాకెందుగ్గానీ మీ పిల్లలకి మీరే ఇంటి దగ్గర డిసిప్లిన్ నేర్పించండి!"

మేమింక మాట్లాడలేక వెనక్కు తిరిగాం.

"ప్రిన్సిపాల్ అన్నది నిజమే! మన పిల్లల్ని మనమే డిసిప్లిన్డ్‌గా పెంచాలి" అన్నాడు హనుమంతరావ్.

మేము ఇల్లు చేరుకునేసరికే శీనుగాడు ఇంటి దగ్గరున్నాడు.

"వీడిని నేను చాలా జాగ్రత్తగా, తెలివిగా టాకిల్ చేస్తా" అంటూ విజయ్ యాదవ్-

"ఏరా శ్రీనూ! ఎలా వుంది స్కూల్? "

"చాలా బోర్ అంకుల్! అందుకే నెక్ట్స్ ఇయర్ నెహ్రూ గ్రామర్ స్కూల్లో చేర్తా-"

అందరం షాకయ్యాం.

"ఎందుకు? "

"అక్కడయితే రికార్డ్ డాన్స్ పోటీలుంటాయ్-"

"వాట్ నీకు రికార్డ్ డాన్స్ పోటీలు కావాల్సి వచ్చినయ్యా! ఇదంతా ఆ టీవీ చానెల్స్ తాలూకు ప్రోగ్రామ్స్ ఎఫెక్ట్- ఒరేయ్! ఇక నుంచీ నేను సెలక్ట్ చేసిన చానెల్సే నువ్ చూడాలి! తెల్సిందా!" అన్నాడు హనుమంతరావ్.

శీను నిర్లక్ష్యంగా చూశాడతని వేపు.

"మీకు నాకు కుదిరేట్లు లేదుగాని- మీరు సపరేట్ టీవీ కొనుక్కోండి-"

"ఆ! అంటే.. ఆ టీవీ నీకిచ్చి మేము ఇంకో టీవీ కొనాలా! అసలు నువ్వు టీవీ చూడ్డానికే వీల్లేదు -" ఆవేశంగా అరిచాడతను.

"ఏంటంకుల్? డాడీ కేమయిందివాళ! ఓవర్‌యాక్టింగ్ జేస్తున్నాడు? "

"నీ బిహేవియర్ నచ్చక!"

"మా మమ్మీ, డాడీ బిహేవియర్ నాకూ చిన్నప్పటి నుంచీ నచ్చటం లేదు- అయినా నేను అడ్జస్ట్ అవటం లేదూ? "

"అసలు నువ్ స్కూల్లో చదువూ సంధ్యా లేకుండా చేస్తున్న పనులేంట్రా?

"చాలా వుంటయ్. చెప్తే మమ్మీకీ నీకూ హార్ట్‌ఎటాక్ వస్తుంది! ఒకటి రెండుసార్లు సిగరెట్ తాగా!"

"ఆ! సిగరెట్లా? "

"ఆ షాకింగ్ ఎక్స్‌ప్రెషన్సే వద్దన్నా! సినిమాల్లో హీరోలు హీరోయిన్లు సిగరెట్లు తాగుతూంటే అద్భుతంగా నటించాడంటారు. అదే నేను చేస్తే కొంపలు మునిగినట్లు ఫీలింగ్‌లు! ఎలాంటి జెనరేషన్ దొరి

కా(్రా బాబూ"

"ఒరేయ్! ఇంక నిన్ను టాలరేట్ చేస్తే నాదీ తప్పు! చూ(్డా! ఈ క్షణం నుంచీ ఒక్క చిల్లరపని చేసినా- చావగొడతా!"

"వాట్? సెవెంత్ క్లాస్ చదివే వాడిని కొడతావా? అయిపోతావ్ డాడీ!"

హనుమంతరావ్‌కి కోపం ఆగలేదు.

"ఏం(్రా! నేనయిపోయేది?" అంటూ ఎడాపెడా వాయించాడు వాడిని.

"ఆల్ రైట్! కొట్టావ్ కదా! ఇంక నా రియాక్షన్ చూస్కో-" అనేసి కోపంగా ఇంట్లో నుంచి బయటకు పరుగెత్తాడు.

"వాడెక్కడికయినా పారిపోతాడేమో! అనవసరంగా కొట్టారు-" అంటూ హనుమంతరావ్ భార్య వర్రీ అవుతుంటే-

"నువ్వేం వర్రీ అవకు సిస్టర్! వాడెక్కడి కెళ్ళినా వెతికి తీసుకొస్తాం" అని అందరం సర్దిచెప్తున్నాం-

అంతలోనే శీను ఒక ఎస్సై, ఒక కానిస్టేబుల్‌తో లోపలికొచ్చాడు.

పోలీసుల్ని చూసి మేము ఉలిక్కిపడ్డాం.

"ఇదుగో- ఈయనే మా డాడీ!" హనుమంతరావ్‌ని పోలీస్‌కి చూపించాడు శీను.

"ఏంటండీ? ఏం జరిగింది?" ఆదుర్దాగా అడిగాడు హనుమంతరావ్.

అతనివేపు ఒక ఎన్‌కౌంటర్ చూపు విసిరాడు ఎస్.ఐ. "ఏం జరిగిందో చెప్పాల్సింది నువ్వు! నేను కాదు-"

మేమంతా షాకయ్యాం.

"నేనా? నాకేం అర్థం కావటంలే-"

"ఎందుకర్థమవుతుంది? లాకప్‌లో వేసి నాలుగు తోమితే అర్థమవుతుంది-"

"లాకప్‌లో తోస్తారా? ఎందుకు?"

"ఎందుకేంటి? నువ్వేం నేరం చేశావో నీకే తెలీదా?" అడిగాడు ఎస్సై.

"నేను నేరం చేయటమేంటండీ? ఏం నేరం చేశాను?"

"గృహహింస!"

"గృహహింసా? ఆ పేరే వినలేదే ఇంత వరకూ? దానర్థం ఏమిటి?"

"మూడు సంవత్సరాలు జైల్లో ఉంటే అప్పుడు మొత్తం అర్థం అవుతుంది-"

"అసలు మావాడు చేసిన తప్పేంటో చెప్పకుండా బెదిరిస్తారేంటండీ?" అడిగాడు శంకరమూర్తి జోక్యం చేసుకుంటూ.

"నీ పేరేంటి?" కోపంగా అడిగాడు ఎస్.ఐ.

"శంకరమూర్తి-"

"నేను అతనిని ఇంటరాగేట్ చేస్తూంటే నువ్వెందుకు మాట్లాడుతున్నావ్?"

"ఎందుకేంటండీ? నేనీ అపార్ట్‌మెంట్స్ సొసైటీకి కల్చరల్ శె(్కటరీని-"

"కల్చరల్ శె(్కటరీవయితే స్టేజిమీద డ్రామాలేసుకో- ఇక్కడ డ్రామాలాడకు-"

"దిసీజ్ టూమచ్ ఉన్నయ్- మా కల్చరల్ శె(్కటరీతో అలా మాట్లాడటం- నేను అబ్జెక్ట్ చేస్తున్నయ్" అన్నాడు హమీద్‌మియా-

ఎస్.ఐ.కి చిరాకేసుకొచ్చింది.

"వీళ్ళిద్దర్నీ జీపెక్కించి లాకప్‌లో పడెయ్ రాజూ" అన్నాడు కానిస్టేబుల్‌తో.

"ఏంటి వాళ్ళను లాకప్‌లో పడేస్తారా? ఆయనెవరనుకుంటున్నారు? మా ప్రెసిడెంట్! మొత్తం మూడొందల ఫ్లాట్ ఓనర్స్ అందరం నీ స్టేషన్‌కొచ్చి ధర్నా చేస్తాం" అన్నాడు విజయ్‌యాదవ్.

ఎస్.ఐ. కొంచెం తగ్గాడు.

"ఈ గొడవంతా ఎందుకు సార్- నేను చేసిన తప్పేంటో చెప్పండి" అడిగాడు హనుమంతరావ్.

"అదేనయ్యా! గృహహింస! ఈ చిన్నపిల్లాడిని కొట్టి, నానా హింసలూ పెట్టినందుకు గృహహింస చట్టం కింద కేస్ రిజిష్టర్ చేశా! ఇప్పుడర్థమయిందా?"

అప్పుడర్థమయింది విషయం అందరికీ.

(ఏమర్థమైందో వచ్చేనెల..) ©



# కౌముది

- యర్రమిల్లి విజయలక్ష్మి



అందమైన కలలతో వైవాహిక జీవితంలోకి
అడుగుపెట్టిన నవ దంపతులు సుహాస్,
అరవిందల జీవననౌక వారికి జన్మించిన కూతురు
కౌముదివల్ల సుడిగుండంలో చిక్కుకుంది.
జీవితమంటే పూలపాన్పు కాదని, అనివార్యమైన
నిరంతర దుఃఖభారాన్ని మనుషులు మోయక
తప్పదని తెలుసుకునేలా చేసింది.
కష్టాలు కన్నకూతురి రూపంలో ఎదురైతే సున్నిత
మనస్కులైన ఆ దంపతులు ఎలా ఎదుర్కొన్నారు?
అసలేమిటా కష్టాలు? అద్భుతమైన వాస్తవికతతో
ఆర్ద్రభరితంగా సాగిన యర్రమిల్లి విజయలక్ష్మి
**కౌముది** ఈ నెల చతుర కానుక!

ఆరేళ్ల వైవాహిక జీవితాన్ని ఆనందంగా గడిపి, సంతోషకరమైన మార్పును మేం కోరుకుంటున్న సమయంలో నెలపొడుపులా మా జీవితంలోకి ప్రవేశించింది చిన్ని. ఇంతకాలం నేను, సుహాస్ మా మధ్య మూడో జీవికి అప్పుడే ప్రవేశం కల్పించకూడదనుకున్నాం. రెండు మూడేళ్లు అటు ఇటు మా పెద్దవాళ్ళెవరూ ఈ విషయాన్ని పట్టించుకోలేదు. ఆ తరువాత్తరువాత పెద్దవాళ్ళు, దగ్గరవాళ్ళూ ముఖ్యంగా ఆడవాళ్లు మావంక, సాధారణంగా నావంకేననుకోండి.. అదోలా చూట్టం ప్రారంభించారు. 'ఏమే... అరూ... ఏమన్నా విశేషమా ఏవిటి... చిక్కినట్టున్నావు..?' అనేవారు. మెల్లమెల్లగా ఆ విశేషపదం అర్థం నాకు అర్థమైపోయింది. కొత్తలో సిగ్గనిపించేది 'మరీ ఇలా అడిగేస్తారేమిటి సంకోచం లేకుండా' అని. పోను పోను అలవాటుపడి పోయాను. సమాధానంగా చిన్న చిరునవ్వు విసిరి తప్పుకోవటం నేర్చుకున్నాను. మరీ రెండు మూడేళ్లయినా కాకముందే కంగారు పడి పోతే ఎలా? నాకు సరే.. సుహాస్‌కి కూడా ఏమీ తొందర వున్నట్లు కనపడ లేదు. అదంతా నా ఇష్టానికే వదిలేసినట్టూ నిశ్చింతగా వున్నాడు.

"అరూ.. అదంతా నీ ఇష్టం.. నీకంతగా ఇప్పుడే పిల్లలు కావాలనుకుంటే నీ ఇష్టం.. నేను కాదనను. అసలదంతా ఆడవాళ్ళ వ్యవహారం.. నాదేముంది.. నిమిత్త మాత్రుడ్ని" అని చిలిపిగా నవ్వేవాడు.

అదీ నిజమే.. సుహాస్ మాటల్లో ఎంతో అర్థం, వాస్తవం వుంది. అది అప్పుడు కాక పోయినా ముందుముందు నా జీవితం ఎన్నో మలుపులు తిరిగినప్పుడు పూర్తిగా తెలిసింది. కానీ ఈ సమయంలో మాత్రం పిల్లలకోసం అంత ఆరాటపడవలసిన వయసు, సందర్భం మాకు లేదనుకున్నాం.

నాకు పసిపిల్లలంటే చాలా ఇష్టమే! ఎనిమిదేళ్ళ వయస్సులో మా ఎదురింట్లో ఒక అంకుల్, ఆంటీ వుండేవారు. ఇప్పుడు నేను, సుహాస్ వున్న వయస్సులోనే వాళ్ళు వుండేవారు. ఆయన ఏదో ఉద్యోగం చేసేవారు. ఆమె ఇంట్లోనే వుండేది. అక్కడ వాళ్ళు వున్న కొద్దికాలంలోనే మాకెంతో స్నేహితులయ్యారు. నేను, నా ఈడు పిల్లలు ఎప్పుడూ సాయంత్రాలు వాళ్ళ డాబామీదే ఆడుకుంటుండేవాళ్ళం. ఆంటీ... పేరు సునీత. ఎంతో అందంగా, సరదాగా, మేమంటే ఎంతో ఇష్టంగా వుండేది. వాళ్లు అక్కడ వుండగానే అమ్మాయి పుట్టింది. అప్పుడు మా అమ్మ సునీత ఆంటీ దగ్గరికి వెళ్ళి సాయం చేస్తుండేది. ఆ చిన్నపాప ఎంతో అందంగా, బొద్దుగా వుండేది. ఆంటీ, అంకుల్ తమ ప్రాణాలన్నీ ఆ అమ్మాయి మీదనే ఉన్నట్లు అపురూపంగా చూసుకునేవారు. ప్రతి చిన్న విషయానికి పాప దగ్గిందనో, తుమ్మిందనో, ఏడ్చిందనో, ఏడవటం లేదనో, నిద్ర ఎక్కువ పోయిందనో, తక్కువ నిద్రపోయిందనో, పాలు తాగటం లేదనో అమ్మ దగ్గరికి ఆంటీ గాభరాగా పరుగెత్తుకు వచ్చేది. 'ఏం ఫరవాలేద'ని అమ్మ ధైర్యం చెప్పి, వివరంగా ఎన్నో విషయాలు పిల్లలకు సంబంధించినవి చెప్పేది. పిల్లలపట్ల తల్లిదండ్రులు చూపే శ్రద్ధాసక్తులను గురించి అప్పుడే నాకు కొద్దిగా తెలిసింది. రోజూ ఉదయంవేళ పనిమనిషి సాయంతో సునీత ఆంటీ పాపాయికి స్నానం చేయించేది. ఆ సమయానికి తప్పకుండా నేనక్కడ హాజరయ్యేదాన్ని. వాళ్ళు పాపకు నీళ్ళు పొయ్యటం నాకు అద్భుతమైన పనిలా కనిపించేది. ఒంటినిండా నూనె పూసిన పాపని ఆంటీ కాళ్ళమీద ఒక పద్ధతిలో పడుకోపెట్టుకునేది. చుట్టూ చిన్న చిన్న గిన్నెల్లో సున్ని

పిండి, షీకాయపొడి, పిల్లల సబ్బు. ఏవేవో వుండేవి. రెండు బక్కెట్లలో ఒకదానిలో వేడి నీళ్ళు, మరోదాంట్లో చన్నీళ్ళు వుండేవి. నీళ్లు సమపాళ్లలో వేడి చూసుకుంటూ తొలుపుకోవడానికి ఇంకో బకెట్ ఉండేది. ఆంటీ ఎంతో సున్నితంగా నూనెను మెత్తగా పాప వంటికి, తలకి పూసి, పాప శరీరానికి వత్తిడి తగలనివిధంగా జాగ్రత్తగా నూనెంతా చర్మంలోకి ఇంకిపోయేలా మర్దనచేసి, మెత్తగా వున్న సున్ని పిండితో రుద్దేది. పాప వళ్ళు మెత్తగా దూదిలా వుండేది. తలమీద ఒక వెంట్రుకైనా లేకుండా బోడిగుండు తెల్లగా ముద్దొస్తూ వుండేది. పనిమనిషి పక్కనే నిలబడి ఆంటీకి ఇదీ అదీ అందిస్తూ సాయం చేస్తుండేది. ఆంటీ చాచిన కాళ్ళ మీద పాప అసహనంగా సన్నగా కేర్ కేర్ మంటూ చిన్న చిన్న చేతులు, కాళ్ళు విరుచుకుంటూ కదులుతూవుండేది. పెదాలు చప్పరిస్తూ చిన్న చిన్న కళ్ళు చికిలిస్తూ పాపముఖం చూట్టానికి ఎంతో వింతగా వుండేది. కళ్ళలోకి, నోట్లోకి నీళ్ళు పోకుండా జాగ్రత్తగా చేతులడ్డుపెడుతూ పాపకు స్నానం చేయించటం చూట్టానికి ఎంతో బాగుండేది. చివర్లో మూడుసార్లు పాపాయి చుట్టూ నీళ్ళు దిగదుడ్చి పోసి స్నానం ముగించి పాపాయిని భుజంమీదికి చేర్చుకోగానే పనిపిల్ల మెత్తని తుండు అందించేది. వెచ్చని పొడి తుండుగుడ్డలో పాపాయిని పదిలంగా చుట్టి లోపలి గదిలోకి తీసుకొచ్చేది ఆంటీ. అక్కడ ఒక పళ్ళెంలో నిప్పులు వుంచి సాంబ్రాణి పొడి వేసి పాపాయిని రెండు చేతుల్తోను ఎత్తి పట్టుకుని జాగ్రత్తగా వంటికంతా పొగ వేసేవారు. అప్పటికే పాపాయికి నిద్రముంచుకు వచ్చేసేది. చిట్టిచేతులతో కళ్ళు మూసుకుంటూ ఆంటీ చేతుల్లో అటు ఇటు కదిలిపోతుండేది.

'నిద్రొస్తోందామ్మా? అయిపోయిందిరా.. బజ్జుందుగాని' అంటూ కబుర్లు చెప్తూ వంటినిండా పౌడరు పూసి నుదుట చిన్న చాదు చుక్క బొట్టుపెట్టి బుగ్గమీద కూడా దిష్టి చుక్క వుంచేది. అంతసేపు పాపను ఆపటమే కష్టమైపోయేది. వదులొదులుగా పల్చగా తెల్లగా వున్న చొక్కాతొడిగి ఆంటీ పాపాయిని ఉయ్యాలలో పడుకోపెట్టేది. బిగించిన పిడికిళ్లు ముఖానికి ఆన్చుకుని పాపాయి అప్పటికే మంచి నిద్రలో వుండేది. పాపాయి నిద్రపోయేసరికి నాకు నిరుత్సాహం వచ్చేసేది. చిన్న చిన్న కేరింతలు, అర్థంకాని ముద్దు ముద్దు అరుపులు మాయమై ఇల్లంతా నిశ్శబ్దంగా వుండేది. పాపాయికి ఎక్కడ నిద్రాభంగమవుతుందోనని భయపడుతున్నట్లు సునీత ఆంటీ మెల్లగా ఉయ్యాల ఊపటం ఆపి, సన్నని పల్చని బట్ట మెడలవరకూ కప్పేది. పాపాయి బట్టలు, వస్తువులు, ఆటబొమ్మలు ఎంతో అందంగా వుండేవి. కొంత కాలం పోయాక ఎప్పుడన్నా వాళ్ళ పనిపిల్ల రాకపోతే పాపాయికి నీళ్ళు పోసేటప్పుడు చెంబుతో నీళ్ళు అందించటం, తుండు గుడ్డ ఇవ్వటం, మెల్లిగా ఉయ్యాల కదలించటంలాంటి పనులు నన్ను చెయ్యనిచ్చేది ఆంటీ. ఆ పనులు చేస్తున్నప్పుడు నేను పొందే ఆనందం గొప్పగా వుండేది. మురిసిపోయేదాన్ని. అప్పుడప్పుడు స్నానానంతరం పాపాయిని కొద్దిసేపు ఎత్తుకునే అవకాశం కూడా చిక్కేది. అవసరమైనప్పుడు

**కొత్తగాలి...**

**చిన్నారుల**
**మెదళ్లపై**
**కార్పొరేట్ దుండగుల**
**దండయాత్ర!**

–జి. సనారా, సికింద్రాబాద్

సునీత ఆంటీ కూడా "అరవిందా... దీన్ని కాసేపు పట్టుకోమ్మా... జాగ్రత్త సుమా" అంటూ నా చేతుల్లో పాపని వుంచేది. మెత్తని పొత్తిళ్ళలో చిగురాకుల మధ్య నుంచి తొంగిచూసే తెల్లని గులాబి పూల గుత్తిలా వుండే పాపనే చూస్తూ .. కదిలితే పాప ఎక్కడ జారిపడిపోతుందోనని ఊపిరి బిగపట్టి కూర్చునేదాన్ని. అతిమెత్తగా తాకితే కందిపోయే బుగ్గలు, దూది బొమ్మలా వున్న చిన్ని ఒళ్ళు, మొగ్గల్లా ముడుచుకుని వుండే అందమైన బుల్లి వేళ్లు... మొత్తం ఆ పాప రూపం ఒక అపురూపమైన ఆనందాన్ని కలిగించేది. మహదానందంతో నా మనసు పరవశించి పోయేది. రోజుమొత్తంమీద కనపడిన వాళ్ళందరికీ నేను పాపను ఎత్తుకున్నానని గొప్పగా చెప్పుకునేదాన్ని. అమ్మ నవ్వి 'పిచ్చితల్లీ...' అని నా తల ప్రేమగా నిమిరేది. 'అమ్మా... నేనూ చిన్నప్పుడు అలాగే వుండేదాన్నా.. ఆంటీవాళ్ళ బేబీలాగ..' అని బిడియపడుతూ అడిగేదాన్ని.

"అంతకన్నా బొద్దుగా ముద్దుగా వుండే దానివే నువ్వు.. కావాలంటే చూడు, నిన్ను ఉయ్యాలలో వేసిన ఫొటో ఇదిగో.. ఇది నీకు అన్నప్రాశన చేసినప్పటిది.. ఇది అక్షరాభ్యాసం చేసేటప్పుడు.." అంటూ బీరువాలోంచి ఫొటో ఆల్బం తీసి చూపించేది.

'ఈ పిల్ల తనేనా' అని ఆశ్చర్యంగా చూసుకునేది తను.

తన ముందు వెనకా ఎవరూ పిల్లలు లేకపోవటం, తను అమ్మకు చాలా ఆలస్యంగా కలిగిన ఏకైక సంతానం కావటం వల్ల అమ్మ, నాన్న తనను చాలా ముద్దుగా అపురూపంగా చూసుకునేవారు. కాస్త కాస్త ఎదుగుతుంటే తనకు ఒంటరితనం తెలుస్తుండేది. ఎంతసేపూ అమ్మ పక్కనో, నాన్న దగ్గరో ఆటబొమ్మలు ముందేసుకుని ఒక్కతే ఆడుకుంటూ వుండటం నచ్చేది కాదు. అమ్మ ముద్దు, నాన్న ప్రేమ తనకు చాలా కనిపించేది. ఇరుగుపొరుగు ఇళ్ళలో వుండే పిల్లలు అన్నదమ్ములతోనో, అక్కచెళ్ళెల్లతోనే సరదాగా ఆడుకుంటూ తిరుగుతుండటం చూట్టానికి తనకెంతో బాగుండేది. తనూ వాళ్ళతో స్నేహం చెయ్యాలనీ, కలిసి ఆడుకోవాలని కోరుకునేది. ఇంట్లో ఎప్పుడూ అమ్మ, తను ఇద్దరే వుండేవారు. నాన్న ఉదయమే వెళ్ళి సాయంత్రానికి తిరిగి వచ్చేవారు. ఆయనతో బయటకు వెడతానని తను పేచీ పెట్టేది. ఎవరన్నా చిన్న పిల్లలు తన ఈడు వాళ్లు కనిపిస్తే ఇక వదిలిపెట్టాలనిపించేది కాదు. మూడు నాలుగేళ్ళు వచ్చేవరకూ అమ్మ తనకు కథలు, కబుర్లు చెప్తూ, కూడా కూడా వుంటుండేది. అమ్మ పక్కన లేకుండా తను క్షణం వుండలేకపోయేది. కాసేపు ఆవిడ కనపడకపోతే ఏడ్చి గోలచేసేది. అమ్మ కనపడితే చాలు అంత దుఃఖం మంత్రం వేసినట్లు మాయమైపోయేది.

స్త్రీ మాతృత్వాన్ని తన జీవిత పరమ లక్ష్యంగా ఎందుకు కోరుకుంటుందో నాకు తెలియదు. ఆమె కోరుకున్నా, వద్దనుకున్నా బిడ్డల్ని కనిపెంచటమనేది అనివార్య బాధ్యతగా ప్రకృతి స్త్రీకే అప్పగించింది. ఇది వరమని కొందరు మురిసిపోతే- శాపమని మరికొందరు కుంగిపోతారు. ఏమైనా మానవ సమాజాన్ని మోసి, కని, పెంచే అతి క్లిష్టమైన కార్యభారాన్ని స్త్రీ ఎదురు ప్రశ్నించకుండా నిర్వహిస్తూనే వుంది.

మూడు నాలుగేళ్లు వచ్చేవరకు- నేను మా అమ్మ ఒడిలో- ఆవిడ నేత చీర కొంగును చిన్న చేతుల్తో గట్టిగా పట్టుకుని వెంట వెంటే అంటుమొలకలా వుండేదాన్ని. నాలుగో ఏడు ప్రవేశించగానే మా ఇంటికి దగ్గర్లో వున్న మంచి స్కూల్లో నన్ను చేర్చారు. ఒక చిన్న బయటి ప్రపం

# పరిశ్రమలా.. మజాకా?



అమెరికాలో ఫోర్డ్ కార్ల కంపెనీని స్థాపించిన హెన్రీఫోర్డ్ మోడల్ టి పేరున చవక కార్లను 1925లో తయారుచేసి ప్రపంచ ప్రఖ్యాతి గడించాడు. ఆ రోజుల్లో నేటి బిల్‌గేట్స్‌లా ఆయన పపంచ కుబేరుడయ్యాడు. అయితే హెన్రీఫోర్డ్ సృష్టించిన



'అసెంబ్లీ లైన్ టెక్నిక్' గురించి ప్రచారం తక్కువగా ఉంది.

అంతకు పూర్వం 17 మంది టెక్నీషియన్లు కలిసి, వారానికి కారు చొప్పున తయారు చేసేవారు. కార్ల ఉత్పత్తిని పెంచాలనుకున్న హెన్రీఫోర్డ్ 1937లో పది క్షణాలకు ఓ కారు చొప్పున అసెంబ్లీ లైన్ టెక్నిక్‌తో తయారుచేశాడు. అదెలాగంటే కార్ల ఉత్పత్తిని చిన్న చిన్న పనులుగా విభజించి, ఆ ఒక్కో పనిని ఒక్కో పనివాడు చేయడమే అసెంబ్లీ లైన్ టెక్నిక్‌లోని విశేషం. కారు దగ్గరకు మనిషి వెళ్లే బదులు, ఉత్పత్తి అవుతున్న కారే మనిషి దగ్గరకు నెమ్మదిగా ప్రయాణించడం కూడా ఈ టెక్నిక్‌లో ఓ భాగం. రంధ్రంలో బోల్ట్ పెట్టడం, దాన్ని బిగించడం, దానికి నట్టువేయడం.. ఇలా కారు నిర్మాణ పనిని అతిచిన్న, నిర్దిష్టమైన పనులుగా విభజించి, ఎక్కువ మంది పనివాళ్లను వాటిని చేయడానికి నియమించడం ద్వారా కారు నిర్మాణం అతి వేగంగా సాగుతుంది. ఒకే మనిషి ఒకే పెద్ద పనిని ఎక్కువ సమయం తీసుకుని చేయడంకన్నా ఆ పనిని పదిమంది పంచుకోవడంవల్ల సమయం కలిసి వస్తుంది. 1925లో ఒక్కరోజులో ఇలా 27 కార్లను అసెంబ్లీ లైన్ టెక్నిక్ ద్వారా ఉత్పత్తి చేశారు. 1937కల్లా అసెంబ్లీలైన్‌లోని 58 వేల యంత్రాలతో 75వేలమంది పనివాళ్లు పనిచేస్తూ సగటున పదిక్షణాలకు ఓ కారు చొప్పున ఉత్పత్తి చేశారు. అందువల్ల పనివారిలో నైపుణ్యం అవసరం ఉండదు. యాంత్రికంగా పనిచేయడమే అక్కడ ముఖ్యం. అసెంబ్లీ లైన్ మొదట్లో ముడి ఇనుమును కరిగించి కారు భాగాలు చేయడంతో మొదలై, చివర్లో రంగువేయడంతో పూర్తవుతుంది. ఇలా ఓ ఏడాదిలో మూడు కోట్ల కార్ల చొప్పున ఫోర్డ్ ఉత్పత్తి చేశాడు.

ఇంతలో వచ్చిన రెండో ప్రపంచ యుద్ధ సమయంలో ఫోర్డ్ కార్ల స్థానంలో ఇదే టెక్నిక్‌తో రెండున్నర లక్షల యుద్ధ ట్యాంకులను, 84వేల విమానం ఇంజన్లను చవకగా ఐదేళ్లలో ఉత్పత్తి చేశాడు. నేడు ప్రపంచంలోని అన్ని పెద్ద ఫ్యాక్టరీలలో ఏ ఉత్పత్తయినా సరే.. అసెంబ్లీ లైన్ టెక్నిక్‌తోనే అధిక సంఖ్యలో కారుచవకగా జరుగుతోంది.



చంతో నాకు పరిచయమేర్పడింది. చిన్న సంచిలో నా బొమ్మల పుస్తకాలు, రంగు పెన్సిళ్ళు, బిస్కట్లు వుంచి అమ్మ నన్ను రోజూ ఉదయం ఎత్తుకుని స్కూలుకి తీసుకెళ్ళి- తరగతిలో కూర్చోపెట్టి వచ్చేది. అప్పట్లో మాకు ఉదయం రెండు, మూడు గంటలే బడి వుండేది. బొమ్మలు చూపిస్తూ వస్తువులు గుర్తించటం- చిన్న చిన్న మాటలు, పాటలు- ఒకటి, రెండు అంకెలు... కాసేపు పిల్లలతో అలసట కలిగించని ఆటలు.. అంతే! బడి ముగిసే సమయానికి అమ్మ వచ్చి స్కూలు గేటు దగ్గర వుండేది. నన్ను చూస్తూనే గల గల వచ్చి చంకన వేసుకుని, కొంగుతో చెమట తుడిచి, ప్రేమగా కబుర్లు చెప్తూ తీసుకెళ్లిపోయేది. దాదాపు పిల్లలందరి అమ్మలూ ఇంతే. నేను బొద్దుగా, ముద్దుగా, బరువుగా వుండేదాన్ని. అమ్మ పూలతీగలా సన్నగా నాజూగ్గా వుండేది. నన్ను చంకన వేసుకుని నడుస్తుంటే ఒక పక్కకు ఒరిగిపోతుండేది. ఆవిడ పూలగుత్తిని ఎత్తినట్టే నన్ను సుతారంగా ఎత్తుకుని సన్నని ఊపుతో నడుస్తుంటే ఉయ్యాలలో ఊపుతున్నట్టు నాకు నిద్ర ముంచుకు వచ్చేది. అమ్మ భుజం మీద తల ఆన్చి క్షణంలో నిద్రపోయేదాన్ని.

"దాన్నెందుకల్లా మోసుకువస్తావు.. నడవటం అలవాటు చెయ్యి" అనేవారు నాన్న.

"చిన్న పిల్ల. అప్పుడే, అంతంత దూరం ఎలా నడవగలదు? "

"ఎంత దూరం... పక్క వీధిలోనే కదా స్కూలు? !"

"మనకి పక్కవీధి దగ్గరే... పసిది. దాని ప్రాణానికి దూరమే. పాదాలు చూడండి. మెత్తగా ఎంత సున్నితంగా ఉన్నాయో.." అమ్మ ప్రేమగా నా పాదాలు బుగ్గలకాన్చుకుని, పెదాలకాన్చుకుని ముద్దు పెట్టుకుని మురిపెంగా అనేది. నేను తన చేతుల్లోంచి జారి తడబాటులేని పరుగులు తీసేవరకూ అమ్మ ఆరాటం అలాగే వుండేది. మానవసమాజం యావత్తూ ప్రేమించటమనే అద్భుత భావనను అమ్మ నుంచే నేర్చుకుని వుంటుంది.

చిన్న స్కూల్ బ్యాగ్ భుజానికి తగిలించుకుని నా చిన్న చెలికత్తెలతో స్కూల్‌కి నిబ్బరంగా నడిచిపోవటం నాకు అలవాటైంది. చిరుమొలకను నీరుపోసి, ఎరువు వేసి పెంచినట్లే అమ్మ నిరంతరం నన్ను పరిరక్షిస్తుండేది. నా పనులన్నీ స్వయంగా చేసేది. రకరకాలుగా జడలల్లేది. ఎప్పుడూ మంచి బట్టలు వేసేది. నా కొత్త బట్టల విషయంలో ఒక్కోసారి అమ్మ నాన్నతో పోట్లాడుతుండేది.

"ఎందుకు చిన్న పిల్లకు అన్ని కొత్త గౌన్లు...? దీపావళికి కొత్త గౌను కొన్నావు. సంక్రాంతికి బిగుతై ఎందుకూ పనికిరాకుండా పోయింది. అనవసరంగా ఖర్చు చెయ్యకుండా డబ్బు జాగ్రత్త పెట్టుకోవటం మంచిది. అరూ ఆడపిల్ల.." అనేవారు నాన్న దూరం ఆలోచించి.

ఆ మాట అనేసరికి అమ్మకెందుకో కోపం వచ్చేది... "ఆడపిల్ల..! అయితే ఇప్పట్నించీ దానికవన్నీ తెలియాలా..!" అని ఉద్రేకపడేది.

నాన్న భయపడేవారు. అమ్మను చిరునవ్వుతో శాంతింపచేస్తూ... "సరే... సరే... ఏదో అది నీ కూతురే అయినట్టూ... నీకొక్కదానికే దాని మీద ప్రేమ వున్నట్టు మాట్లాడకు... అది నాకూ కూతురే... నాకూ దాని మీద ప్రేమ వుంది..." అనేవారు.

నిజమే నాన్నకూ నా మీద ఎంతో ప్రేమ వుండేది. అయితే ఆ ప్రేమను ప్రకటించే తీరు వేరుగా వుండేది. ప్రతి చిన్న విషయం స్పష్టంగా మాటలతో, చేతలతో వివరిస్తే కాని ఎదుటి వారి మనసు అర్థం

చేసుకోలేని బాల్యావస్థలోనే నాన్నగారంటే .. అందువల్లే కావచ్చు. నాకంత చనువు ఏర్పడలేదు. అంతేకాక అమ్మలా రోజంతా నన్నంటిపెట్టుకుని వుండే అవకాశం ఆయనకుండేదికాదు. నిరంతర సాన్నిధ్యంవల్ల అమ్మను నేను అర్థం చేసుకున్నంతగా నాన్నగారిని తెలుసుకోలేకపోయాను. పెరిగి పెద్దవుతున్న కొద్దీ బిడియం, భయం తగ్గి వాత్సల్యభావం పెరిగినా మా ఇద్దరి నడుమ కొంత ఎడం వుంటూనే వుంది. అమ్మ నాకు భయం నేర్పలేదు. కానీ అది ఎలా నా మనసులో చోటుచేసుకుందో ఏమో. మా కుటుంబంలోవారైనా, బయటివారైనా మగవారిపట్ల నాకెందుకో వెరపు ఏర్పడింది. ఇది స్వభావ సిద్ధంగా చాలామంది ఆడపిల్లలకు వాళ్ళకే తెలియకుండా లోలోపల అవ్యక్తంగా పెరిగే భావం కాబోలు. అందువల్ల చాలా సందర్భాలలో నాకూ నాన్నగారికి మధ్య అమ్మ సంధానకర్తగా వ్యవహరించి నా తరఫున మాట్లాడి నాకు కావాలసినవి సమకూర్చేది.

మెల్లమెల్లగా మనసుకు దగ్గరైన స్నేహితులతోకలిసి చదువుకోవటం, ఆడుకోవటం మొదలైంది. అప్పుడప్పుడు నా చిన్నారి మిత్రులను మా ఇంటికి తీసుకురావటం, నేను వాళ్ళ ఇళ్ళకు వెళ్ళటం, అమ్మను విడిచి స్వతంత్రంగా దిగులులేకుండా గడపటం అలవాటైంది.

అటువంటి సందర్భాలలో అమ్మ "అరూ.. పెద్దదయింది.. చూశారా.. దాని ఫ్రెండ్స్.. షికార్లు.. ఆటలు.. అబ్బో..!" అనేది నాన్నగారితో మురిపెంగా. అలా అనేటప్పుడు అమ్మ నన్ను దగ్గరగా లాక్కుని గుండెలకాన్చుకోవాలని ప్రయత్నించేది. నేను బిడియపడుతూ దూరంగా జరిగేదాన్ని. అంతవరకూ అమ్మ గుండెల్లో దూరి క్షణం ఒడి వదిలితే ఏదో పెన్నిధి పోయినట్లు అమ్మే ప్రాణంగా వుండే దాన్ని.. స్వర్గతుల్యమైన అమ్మ కౌగిలి నుంచి నేను క్రమంగా దూరమయ్యాను. అందుకే అనేదేమో అమ్మ నేను పెద్దదాన్నవుతున్నానని.

ఆ మాటలకు నాన్న నన్ను వాత్సల్యంగా చూచి, "ఊс... ఎదగక... పిల్లలెప్పుడూ నీ ఒళ్ళోనే కూర్చుంటారా...? " అనేవారు.

ఇక అప్పట్నించీ నాకు సంబంధించి నేను స్వయంగా చేసుకోలేని పనులు మాత్రమే అమ్మ చెయ్యటానికి ఒప్పుకునే దాన్ని. ఉదాహరణకు జడ వేసుకోవటం. చెయ్యి వెనక్కు తిప్పి, జుట్టంతా పిడికిట్లో ఒడుపుగా పట్టి ఒక పద్ధతి ప్రకారం మూడు పాయలుగా చేసి జడ అల్లటం నాకు తెలిసేది కాదు. అంచేత నేను పెద్దదాన్నయ్యాక కూడా ఆ పని అమ్మే చేసేది. ఇక అమ్మ సాయం లేకుండా తలంటుపోసుకునే సమస్యలేదు. గడివాములా వుండే జుట్టుకు నూనెపూసి చిక్కులు పడకుండా జాగ్రత్తపడుతూ కుంకుడు రసంలో మందార ఆకులు కలిపి గంటసేపు తల స్నానం చేయించేది. కుంకుడు రసం కంట్లోకి పోయి కళ్ళు మండుతుంటే తడి గుడ్డతో వత్తి "కళ్ళు నులమకు... అదే పోతుంది.. కుంకుడురసం కంట్లోపడితే మంచిది. మలినాలన్నీ పోతాయి.." అంటూ ఉప్పుకల్లు నోట్లోవేసి.. తలారే వరకూ ఎండపొడలో కూర్చోబెట్టేది. వారానికోసారి సాధారణంగా ఆదివారం నాకు

## కొత్తగాలి... 

**నల్లజాతి**
**గర్విస్తారు ఒబామా!**
**మానవజాతి**
**విచారిస్తారు ఒసామా!!**

—శ్రావణి, జట్నీ, ఒరిస్సా





# కొత్తగాలి...



## పువ్వు పిలుస్తోంది! దేవుని పాదాలకు చేర్చమని!

-డా. వాసా ప్రభావతి, హైదరాబాద్

స్కూలు సెలవురోజున ఈ బృహత్కార్యం చేపట్టేది అమ్మ. నేను పెద్దదాన్నవుతున్న కొద్దీ ఈ పనికూడా నేను చేసుకోవాలనుకునేదాన్ని. కాని కుదిరేది కాదు.

ముఖం కదపకుండా గడ్డం ఎత్తి చేత్తో పట్టుకుని నా చిన్న ముఖానికి తగ్గట్టు చిన్న తిలకం బొట్టు దిద్దేది అమ్మ. సన్నగా కళ్ళకు కాటుక పెట్టేది. 'ఈ చిన్న పనులు నేను చేసుకోలేనా. పెద్దదాన్నవుతున్నాను. రెండో తరగతిలోకి వచ్చాన'నుకున్నాను. కాని ఎంత జాగ్రత్తగా అద్దం ఎదురుగా వుంచుకున్నా, బొట్టెప్పుడూ కుడి కంటి మీదకో- ఎడమ కంటిమీదకో వచ్చేది. ఒకసారి స్వయంగా కంటికి కాటుక పెట్టుకోవాలని ప్రయత్నించి, వేలితో కంట్లో పొడుచుకున్నా. గోరు గుచ్చుకుని కనుగుడ్డు ఎర్రపడి కంటి వైద్యుడి దగ్గరకెళ్ళవలసి వచ్చింది. నా గురించి నాకు తెలిసి అమ్మను మొదటి సారి నాన్న కేకలేశారు-

"నువ్వేం పాటుపడుతున్నావు? అది కాటుక పెట్టుకోగలదా... కాస్తుంటే కన్ను పోయేది" అన్నారు.

అమ్మ నా మీద నెపం వెయ్యలేదు. నా కన్ను ఎరుపులు, మంట తగ్గేవరకూ అమ్మ చాలా బాధపడింది. బాగా నయమయ్యాక వెండికళ్ళు చేయించి పార్వతీ అమ్మవారి గుడిలో ఇచ్చి పూజ చేయించింది.

అమ్మకు ఇలాంటి నమ్మకాలు ఎక్కువ అన్న విషయం కూడా నేను అప్పుడప్పుడే అర్థం చేసుకోవటం ప్రారంభించాను. పూజలు, పునస్కారాలు, జపతపాలు, గుళ్ళో అర్చనలు.. వీటిపట్ల ఆమెకు శ్రద్ధ ఎక్కువ. పర్వదినాలలో ప్రత్యేక పూజలు చేసేది. నోములు, వ్రతాలు చేసేది. ప్రతి పండుగకు నన్ను తనతో గుళ్లకు, మందిరాలకు తీసికెళుతుండేది. నాకవన్నీ ఎందుకో తెలియకపోయినా ఆనందంగా అమ్మను అనుసరించేదాన్ని. అవన్నీ నాకెంతో సరదాగా వుండేవి. నాన్నగారు మాత్రం వాటికి దూరంగా ఉండేవారు. అమ్మ ఇష్టాన్ని మాత్రం వ్యతిరేకించేవారు కాదు. నాకు తెలియకుండానే అమ్మ ప్రభావం నాపైన బలంగా పడసాగింది.

కాలం గడుస్తుంటే మెల్లగా పసితనపు ముద్దుమురిపాలు వెనకపడసాగాయి. ఒక్కో తరగతి దాటిపోతుంటే బాల్య చాపల్యం, అల్లరి వదిలి చదువుమీద దృష్టి కేంద్రీకరించవలసి వచ్చేది. అప్పటికే నేను చురుకైనదాన్ననీ, తెలివైనదాన్ననీ అనుకునేవారు. అమ్మ నన్ను బాగా చదివించి ఏ కలెక్టర్నో, డాక్టర్నో చెయ్యాలన్నంత ఆత్రుత పడిపోయేది.

"నువ్వు బాగా చదువుకోవాలి. ఈ రోజుల్లో ఆడపిల్లలు చక్కగా చదువుకుని మగపిల్లలతో సమానంగా మంచి మంచి ఉద్యోగాలు చేసుకుంటున్నారు" అంటుండేది. నేనూ ఆ మాటలకు ఉత్సాహంగానే స్పందించేదాన్ని. మంచి మార్కులు సంపాదించుకుని అమ్మని సంతోషపెట్టాలనేదే అప్పట్లో నా ఆశయం. నా చదువు సంధ్యల గురించి నాన్నగారూ ఆసక్తి చూపేవారు. కానీ అమ్మలో వుండే తపన ఆయనలో కనపడేది కాదు.

ఆ రోజుల్లోనే సునీత ఆంటీవాళ్ళు మా పొరుగున వచ్చి చేరారు. వాళ్ళ పాప నన్ను అమితంగా ఆకర్షించేది. ఖాళీ దొరికితే చాలు.. పోయి ఆ పాపాయి

# జాన్ కెన్నడీ హంతకులు ఎవరు?



కమ్యూనిజం కూలిపోయినాక రష్యా గూఢచారి సంస్థ కె. జి. బి. లో పని చేసిన జనరల్ నికోలోయ్ లియోనోవ్, అమెరికా అధ్యక్షుడు కెన్నడీని హత్యచేసిన లీహార్వే ఆస్వాల్డ్ గురించి ఓ కొత్త సత్యాన్ని ప్రపంచానికి వెల్లడించాడు.

కెన్నడీని చంపడానికి ఎనిమిది వారాల ముందే సెప్టెంబర్ 29, 1963న లీహార్వే మెక్సికోలోని రష్యన్ దౌత్య కార్యాలయంలోకి వెళ్లి, తన ప్రాణరక్షణకోసం రష్యాలోకి అనుమతించాల్సిందని, తనని ఎవరో చంపాలనుకుంటున్నారని, ఆశ్రయం కావాలని కోరాడు. ఆత్మరక్షణకి సదా తన దగ్గర వుంచుకునే రివాల్వర్‌ని కూడా వారికి అతను తన ఆందోళనకు సాక్ష్యంగా చూపించాడు.




అతను మానసికంగా స్థిరంగా లేడని, కెన్నడీ హత్యని అతనొక్కడే స్వయంగా చేయగలిగే స్థిమితం అతనిలో లేదని, అతని వెనుక మరెవరో ఉండి, అందుకు ప్రోద్బలం చేసి ఉంటారని జనరల్ నికోలోయ్ లియోనోవ్ 'నేషనల్ ఎన్‌క్వైరర్' అనే అమెరికన్ వారపత్రికకి ఇచ్చిన ఇంటర్వ్యూలో పేర్కొన్నాడు.

తనని ఎవరు చంపదలచుకుంటున్నారో హార్వే స్పష్టంగా చెప్పలేకపోయాడు.

"అతనికి ఆశ్రయం ఇచ్చే విషయం గురించి తను మాస్కోకి ఉత్తరం రాస్తానని, జవాబు రావడానికి కనీసం నాలుగునెలలు పడుతుంది" అని హార్వేకి లియోనోవ్ చెప్తే, 'అంతకాలం నేను బ్రతికి ఉండటం అసాధ్యం' అని హార్వే జవాబు చెప్పాడు. అతనితో కరచాలనం చేసిన లియోనోవ్ అతని చేతులు వణుకుతుండటంతోపాటు చెమటకి తడిసి ఉండటం గమనించాడు.

రష్యాకు వెళ్లడం కుదరకపోతే క్యూబాకు వెళ్ళాలని నిర్ణయించుకున్నానని, క్యూబన్ ఎంబసీకి ఎలా వెళ్లాలని అడిగాడు. లియోనోవ్ అతడికి అక్కడికి దారి చెప్పాడు. వెంటనే లియోనోవ్ ఈ విషయాన్ని మాస్కోలోని కె. జి. బి. ప్రధాన కార్యాలయానికి రిపోర్ట్ రాసి పంపాడు. నవంబరు 22, 1963న కెన్నడీ హత్యకు గురయిన తర్వాత లీహార్వేను అరెస్టు చేశారు. హార్వేను కె. జి. బి. అధికారి లియోనోవ్ గుర్తించారు. కెన్నడీని హత్య చేసేందుకు పెద్దకుట్ర జరిగి ఉంటుందని, అందులో హార్వే కేవలం ఓ పావు మాత్రమే అని కె. జి. బి. నిర్ధారణకు వచ్చింది. అయితే ఈ విషయం కె. జి. బి. అమెరికాతో ఆ సమయంలో పంచుకోదలచుకోలేదు.

ఈ కథనమే నిజమైతే అమెరికన్ పోలీసులు తమ అధ్యక్షుడి హత్యకు కారణమైన అసలైన వారిని కనుక్కోవడంలో విఫలం చెందినట్లే!



ఉయ్యాల తొట్టి దగ్గర కూర్చునేదాన్ని. ఆ పిల్లని ఎంత చూసినా తనివి తీరేది కాదు.

"అరవిందకు మా బేబీ అంటే చాలా ఇష్టం" అంటుండేది సునీత ఆంటీ అమ్మతో తరచూ.

"చిన్న పిల్లలు పసిపిల్లలను ఇష్టపడ తారు. అందులో ఆడపిల్లలకు పిల్లలంటే మరీ ఎక్కువగా వుంటుంది ప్రేమ" అనేది అమ్మ నవ్వుతూ.

ఆ నవ్వులో ఎందుకో ఏదో దిగులు తోచేది. కానీ అదేమిటో నాకు తెలిసేది కాదు. ఆలోచించి అర్థం చేసుకునే వయసు, శక్తి కూడా లేవు. చాలాకాలం తరువాత నేను పెద్దయ్యాక ఆ నవ్వులోని వెలితి నాకర్థమైంది. కానీ అది నాలో నేను తలచుకుని దిగులుపడటానికే!

అసలీ కథను నేను 22-23 సంవత్సరాల నా యవ్వన ప్రాయంతో ప్రారంభించాలి. కానీ అసలు కథకు నాందిగా అంతకంటే ముందు విషయాలు చెప్పటం అవసరం. సహజంగా ఈ ప్రపంచంలోని అందరు ఆడపిల్లలకు మాదిరిగానే ఏడెనిమిదేళ్ల వయసులోనే నాలోని ఆలోచన మేల్కొంది. నా సమయమంతా అమ్మ తోనే గడిచేది. స్కూల్లో నాకు స్నేహితులు కూడా చాలా కొద్దిమందే ఉండేవారు. నాది ఎక్కువ కలుపుగోలు తత్వం కాకపో వడం వల్ల నా స్వభావానికి దగ్గరైన కొద్ది మంది తప్ప నా స్నేహితుల సంఖ్య పెద్దదిగా వుండేది కాదు. ఖాళీ సమ యమంతా సునీత ఆంటీ వాళ్ళింట్లో కూర్చుని పాపను చూస్తూ, దాని కేరింతలు వింటూ గడపటం నాకు ఇష్టంగా ఉండేది. పసిపిల్లల పట్ల తల్లిదండ్రులు చూపే శ్రద్ధాసక్తుల గురించి అప్పుడే నా మన సులో ఒక అపురూపమైన భావం ఏర్పడి వుంటుంది. కొంతకాలం తరువాత సునీత ఆంటీ వాళ్ళు వేరే ఊరు వెళ్ళిపోయారు. సునీత ఆంటీ పాపను ఎత్తుకుని దిగులుగా మాకు వీడ్కోలు చెప్పినప్పుడు నేను ఏడుపు ఆపుకోలేకపోయాను.

"తప్పు... అలా ఏడవకూడదు... ఆంటీకి టాటా చెప్పు" అని అమ్మ మంద లించినా కానీ దుఃఖం నిగ్రహించుకోలేకపో యాను. అమితమైన ప్రేమ, నా చిన్న గుండె తట్టుకోలేని విచారం నాకు జీవి తంలో అప్పుడే తొలిసారిగా అనుభవమ య్యాయి. తిండి, నిద్ర లేక ఆ పాప కోసం అలమటించాను. ఏదో పోగొట్టుకున్నట్టు పరితపించాను. అమ్మ నన్ను మరిపించ టానికెంతో ప్రయత్నించేది. రాత్రుళ్లు నా పక్కనే పడుకుని నన్ను తన గుండెల్లోకి తీసుకుని ఊరడించేది.

"పిచ్చిపిల్లా! పాపతో నువ్వు ఆనందంగా గడిపిన రోజులు తలచుకోవాలి కానీ ఏడ వకూడదు. వాళ్ళు ఉద్యోగస్థులు. ఒకచోటే స్థిరంగా ఉండిపోతారా? " అనేది.

నా తొలిప్రేమ, తొలి వియోగం, తొలి ఆనందం, తొలి విషాదంగా ఆ పాప నా హృదయంలో నిలిచిపోయింది.

ప్రస్తుతం జవాబులేని రెండు ప్రశ్నలు నిరంతరం నన్ను వేధించసాగాయి. నా కూతురికి నేనేం చెయ్యాలి అనేది మొదటి ప్రశ్న. పెద్దలు, ఇటువంటి పిల్లల సమస్యతో కొంత అనుభవమున్న తల్లిదం డ్రులు, డాక్టర్లు కౌముదికి నేను చెయ్యావ లసినది చెప్పేవారు. అవన్నీ కేవలం నేను నా మానసిక సంతృప్తి కోసం దానికి చేసే ఉపచర్యలు మాత్రమే! అందువల్ల నా కూతురి మానసిక రుగ్మత తగ్గిపోయి మామూలు ఆరోగ్యకరమైన అమ్మాయిగా మారిపోతుందన్నది అసత్యం. కానీ అసత్యం కూడా ఒక్కోసారి మనిషికి ధైర్యా న్నిచ్చి ఉత్సాహపరుస్తుంది.

"భయపడకండి.. ఇలా చేస్తూ ఉండండి.. మార్పు రావచ్చు నిరుత్సాహ

పడకండి" అనేవారు.

అందులో సానుభూతితో కూడిన ధైర్యం తోచేది కానీ భరోసా వుండేది కాదు. ఈ సత్యం అర్ధం కావడానికి నాకు చాలా కాలం పట్టింది. అర్ధమైన తరువాత నేను కానీ డాక్టర్లు కానీ, సాక్షాత్తూ ఆ భగవం తుడే కానీ.. నా పాపకు చేయగల సాయం ఏమీ లేదన్న భయంకర వాస్తవం నన్ను అమితమైన వేదనకు గురిచేసేది. 'ఈ మందుల వల్ల, ఈ చికిత్స వల్ల మీ అమ్మాయికి పూర్తిగా నయమై అందరి పిల్లలలాగే ఆరోగ్యంగా, ఆనందంగా పెరు గుతుంద'ని మా అమ్మాయిని పరీక్షించిన డాక్టర్లెవరూ నన్ను మభ్యపెట్టలేదు. కానీ ఉన్న స్థితి మరింత చెడిపోకుండా జాగ్ర త్తలు తీసుకోవచ్చని మాత్రం చెప్పేవారు.

అనివార్యమైన, తప్పించుకోలేని ఈ విచారాన్ని ఎలా భరించాలో నాకు నేను గానే నేర్చుకోవలసి వచ్చేది. దుఃఖాన్ని భరించి సహించి ఉండడంవల్ల నాలో లోపల తీరని వ్యథ వేళ్లూని నా జీవితాన్ని, దాన్ని అనుసరించి వుండేవాళ్లను అతలాకు తలం చేసేది. ఒక కష్టాన్ని సహనంతో లోలోపల ఇముడ్చుకుని భరించడం మొదటి స్థితి మాత్రమే! నా కూతురి ఆరోగ్యం తప్పక కుదుటపడుతుందన్న వెర్రి ఆశే నాకలాంటి దుఃఖసహి ష్ణుతనిచ్చేది. ఏదో ఆశ.. పరిస్థితి ఎప్పుడూ ఇల్లాగే వుండిపోదన్న అమాయక ధైర్యం నాకా శక్తిని, ఎదురుచూపుని ఇచ్చేది. కానీ క్రమంగా ఈ దుఃఖం తాత్కాలికం కాదనీ నా పాప జీవించి ఉన్నంతకాలం ఈ వేదన ఆరేది కాదని తెలిసిపోయింది. చివరివరకూ ఈ విషాదాన్ని నేను మోయక తప్పదని తెలిశాక నిబ్బరంగా, నిర్లిప్తంగా, వివేకంగా దాన్ని ఎదుర్కోవా లని నిర్ణయించుకున్నాను. ఈ నిర్ణయానికి రావటానికి ముందు ఎంతోకాలం నేను ఓదార్పులేని అనిర్వచనీయమైన దారుణ

## కొత్తగాలి...

**ఇంతే అనుకుంటే నరకం**
**ఎంతో అనుకుంటే స్వర్గం**
**నా అనుభవ సత్యం**
**జీవితం**

– పెరుక రాజు, నర్సింగాపూర్, కరీంనగర్

మానసిక క్షోభననుభవించాను. నేను చెయ్యని నేరానికి జీవితకాల శిక్ష అనుభవి స్తున్న నేరస్థురాలిలా నా అంతరంగం కృంగిపోయేది.

పసి కౌముదిని గుండెల్లో దాచుకుని బాహ్య ప్రపంచపు వింతచూపులు- అవహే ళనతో కూడిన సానుభూతి వాక్యాలు విన పడకుండా కాపాడుకోవాలని ఆరాటపడే దాన్ని. ఆ చూపులు, ఆ మాటలు, వ్యర్థ సానుభూతి వచనాలు ఎక్కడ అర్ధమై నా బిడ్డ మనస్సును గాయపరుస్తాయోనని భయపడేదాన్ని. నిజానికి మా బేబీ అవేవీ అర్ధం చేసుకోలేని అవ్యక్త మానసికావస్థలో వుండేది. కానీ దాని తరపున కూడా ఆ బాధ నేనే అనుభవించేదాన్ని. కానీ మాన వుల్లో మంచితనం కూడా నన్ను కదిలించి వేస్తూ వుండేది. సహజంగా మానవులం దరూ చాలా మంచిగా ఇతరుల ఇక్కట్ల పట్ల సానుభూతితో వ్యవహరించేవారయ్యే వుంటారు. ఆ మంచితనాన్ని అన్ని రకాల మనుష్యుల్లోనూ నేను గమనించాను. అయితే మా వ్యవహారంలో అనవసరంగా జోక్యం చేసుకునేవారు, నోటితో 'అయ్యో' అంటూ నొసటితో హేళన చేసేవాళ్ళు, మమ్మల్ని చూసి అదోరకంగా శాడిస్టిక్‌గా ఆనందించేవాళ్ళు కూడా కొద్దిమంది లేకపో లేదు. వాళ్ళకి నేనన్నా, సుహాసన్నా ఎందుకో కోపంవుండి వుండాలనుకునే దాన్ని. అలాంటి దుష్టులనుండి, వాళ్ళ



వక్రహాసాల నుండి, గుండెలో మండించే పెదవి విరుపుల నుండి మా చిన్నారిని తప్పించాలని అనుకునేదాన్ని. క్రమంగా అలాంటి వారి గురించి ఆలోచించి ఇంకా నా మనస్సు పాడుచేసుకోవటం మానేశాను.

ఒకసారి స్నేహితులెవరో మా ఇంటికి వచ్చారు. అప్పటికి నేను, సుహాస్ పాపను గురించిన గొప్ప దిగ్భ్రాంతిలో ఉన్నాం. ఒక పక్క పిల్ల స్థితిని గురించిన విపరీతమైన భయం, మరోపక్క వైద్యశాస్త్రం ఈ రుగ్మతని బాగుచేస్తుందన్న వెర్రి ఆశ మా మనసుల్ని పట్టి కుదిపేసేవి. ఎన్నో రాత్రులు నిద్రాహారాలు మాని మేమిద్దరం అమ్మాయిని చూస్తూ కూర్చునేవాళ్ళం. నిస్పృహతో నా గుండె లోలోపలకు కృంగిపోయేది. ఆహారం సయించేది కాదు. కంటిమీద కునుకు వుండేది కాదు. తీవ్రమైన అశాంతి, క్లేశం నిండి ఉండేది. దేశంలో ఉన్న పెద్ద పెద్ద ఆసుపత్రులన్నింటికీ కొండంత ఆశతో పాపను తీసుకుని వెళ్ళటం, అంతులేని నిరాశతో తిరిగి రావటం...

"నువ్వు బాధ పడతావని చెప్పలేదు. నాకు ముందే తెలుసు" అనేవాడు సుహాస్. అతనికి తెలిసిందేమిటి అని నేను తిరిగి ప్రశ్నించలేకపోయేదాన్ని. దాన్ని అతని మాటల్లో వినాలంటే భయమనిపించేది. అదేమిటో నాకు అర్ధమవుతోంది. అయితే దాన్ని అంగీకరించటానికి నా మనసు సిద్ధంగా లేదు.

"నువ్వు బెంగపడి ఆరోగ్యం పాడుచేసుకుంటే ఎలా అరూ? వాస్తవాన్ని ధైర్యంగా ఎదుర్కొనే శక్తిని తెచ్చుకోవాలి. మన దురదృష్టం.." అనేవాడు గద్గద స్వరంతో సుహాస్.

ఆ మాటలు నన్ను ఈటెల్లా బాధించేవి. అతనన్నది నిజమే కావచ్చు. పాపకీరోగం రావటం నిజంగా మా దురదృష్టమే. కాని నేను సహించలేక పోయేదాన్ని. ఏదో నిస్సహాయ వేదనతో నా గుండె విలవిల్లాడేది. 'నువ్వు నిర్ణయించేస్తున్నావా..?' అని ఆవేశ పడేదాన్ని. కౌముది అనారోగ్యానికి డాక్టరు పెట్టిన పేరు తలచుకోవటానికి కూడా నా గుండె వణికిపోయేది. సుహాస్ నన్ను ప్రేమగా దగ్గరకు తీసుకుని అనునయించేవాడు. అనివార్యమైన దుఃఖాన్ని గుండె దిటవుతో ఎదుర్కోగల మానసిక స్థైర్యాన్ని సుహాస్ నాకన్నా చాలా ముందే సంపాదించుకున్నాడనిపిస్తుంది. పురుషులకు సహజసిద్ధమైన దిటవుతనం అతనికి వుండి వుండ వచ్చు.

స్నేహితులు పాపను చూస్తామన్నారు. నేను తడబడ్డాను. పాపను వాళ్లకి చూపటం నాకెందుకో ఇష్టంలేదు. కాని సుహాస్ ఫరవాలేదన్నట్లు నాకు సైగ చేసి ఉయ్యాల గదిలోకి తీసుకువెళ్లాడు. అప్పుడు కౌముది మేలుకునే



వుంది. పెద్దవిగా కనిపిస్తున్న కనుగుడ్లు అటు ఇటు తిప్పుతూ కాళ్లూ చేతులు కొట్టుకుంటోంది. వాళ్లు ఉయ్యాలలోకి చూసి జంకుతున్నట్టు ఒకడుగు వెనక్కివేసి బరువుగా నిట్టూర్చి జాలిగా చూపులు మరల్చుకున్నారు. నిశ్శబ్దంగానే వాళ్ళు ప్రకటించిన హావభావాలను గమనించి నా గుండె నీరైపోయింది.

"కాస్త కాఫీ తీసుకురా అరూ.." నా మూడ్ మార్చాలని నన్ను లోపలికి పిలిచి, వాళ్లతో సంభాషణకి దిగాడు సుహాస్. ఎలాగో కాఫీ చేసి తెచ్చానుకాని నా మనసంతా తీవ్రమైన అశాంతికి లోనైంది. వాళ్ళు వెళ్లిపోయాక కోపంతో సుహాస్ మీద విరుచుకు పడ్డాను-

"ఎందుకు వాళ్లను పాపగదిలోకి తీసుకెళ్లావు? సంస్కారం లేని మనుషులు! అందుకే పాపను చూపించటానికి నేను ఇష్టపడలేదు. ఈ మనుషులంతా ఇంతే.. ఛీ.." అని ఆక్రోశపడ్డాను.

సుహాస్ కూడా చాలా బాధపడ్డాడు. పాప దగ్గరికి వెళ్లి చూస్తూ కన్నీరు పెట్టుకున్నాడు. "మనకిదేం దౌర్భాగ్యం అరూ.. ఏం పాపం చేశాం మనం.." అన్నాడు. గుండెలు కదిలిపోయేలా చాలా సేపు ఏడుస్తూ కూర్చున్నాను.

"రకరకాల మనుషులుంటారు.. మనం ఇటువంటివన్నీ పట్టించుకుని బాధపడటం మానెయ్యాలి" అనేవాడు సుహాస్.

నన్ను మరిపించాలని ఏవేవో కబుర్లు చెప్పేవాడు. నెలల ప్రాయంలో వుండగానే కౌముదిలో ఈ అసాధారణ లోపం మేం కనిపెట్టగలిగివుండాల్సింది. పుట్టినప్పుడు కౌముది వెన్నెలలా తెల్లగా, ముద్దుగా వుంది. చాలా అందంగా చక్కని అవయవాల పొందికతో, విశాలమైన నేత్రాలతో, చిరునవ్వు చిందే ముద్దుముఖంతో ఆరోగ్యంగా వుంది.

"మీ పాప చాలా అందంగా వుంది. ఏదో ప్రత్యేకత కూడా కనిపిస్తోంది. పుట్టి కాసేపు కాలేదు, ఆ నవ్వు ముఖం చూడండి" అంది పాపను ఉయ్యాలలో వుంచుతూ డాక్టరు. ఆ మాటలు నన్నెంతో అలరించాయి. రెండు రోజులు దానికి జన్మనివ్వటానికి నేను పడిన యాతనంతా క్షణంలో మర్చిపోయి మురిపెంగా చూసుకున్నాను. కాసేపటికి సుహాస్ కూడా వచ్చి పసిదాన్ని చూసి సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయాడు. మా జీవితాలకొక పరిపూర్ణత సిద్ధించిందని తృప్తిగా భావించాం. ఇక అమ్మానాన్నల ఆనందం చెప్పనలవే కాదు. మేమక్కడ వున్నంత కాలం వాళ్లకు మనవరాలే లోకంగా వుండేది. కాని ఒక్క రెండు నెలలు మాత్రమే నేను కౌముదితో నా పుట్టింట్లో వుండగలిగాను. అప్పుడే ప్రమోషన్ మీద సుహాస్ దూర ప్రాంతానికి బదిలీ అవటంతో మేం అక్కడికి వెళ్ళిపోవలసి వచ్చింది. అమ్మ, నాన్న వదల్లేక వదల్లేక వదిలారు కౌముదిని. పసిపిల్ల పెంపకంలో నేను తీసుకోవలసిన జాగ్రత్తలను అమ్మ ఎంతో వివరంగా చెప్పింది. నెలలు వచ్చేకొద్దీ వాళ్ల పెరుగుదల ఎలా వుంటుందో, ఎప్పుడు బోర్లా పడతారో, ఎప్పుడు పాకుతారో.. అప్పుడు నేను తీసుకోవలసిన జాగ్రత్తలేవో పూస గుచ్చినట్టు చెప్పింది. అప్పట్లో పాప ఎదుగుదల, బరువు, చురుకుతనం ఆ ప్రాయానికి తగినట్లు సరిగానే వుండటంవల్ల మాకు దాని మానసిక ఎదుగుదల గురించిన అనుమానం రాలేదు. అది అసలు మా ఎవరి ఊహకూ అందని భయంకరమైన విషయం.

పాతికేళ్ల యవ్వన ప్రాయంలోనే కౌముది నా కడుపున పడింది. దృఢమైన శరీరం, పరిపూర్ణమైన శారీరక, మానసిక ఆరోగ్యాన్ని అనుభవిస్తున్న వయస్సు.

వివాహమయ్యాక కొంతకాలం సంతానం వద్దనుకున్నా డాక్టరు పర్యవేక్షణలోనే ఆమె సలహా సంప్రదింపులతోనే ఆరేళ్ల తరువాత గర్భం దాల్చాను. ఈ విషయంలో సుహాస్ ఎప్పుడూ నిర్లిప్తుడుగానే వుండేవాడు. ప్రపంచంలో ఏ పురుషుడైనా అంతే కావచ్చు. సంతానం కలిగాక వాళ్ళు పెరిగి పెద్దవాళ్ళవుతుంటే తండ్రిగా బరువు బాధ్యతలు మోస్తాడుకాని అంతవరకూ కష్టసుఖాలన్నీ భార్యవేననుకుంటాడు. సుహాస్ కూడా అంతే. నేనేది చెప్పినా చిరునవ్వుతో ఆమోదించేవాడు. నన్ను, నా కలలు, కోరికలు, ఆశయాలు, ఆలోచనలను పూర్తిగా అర్థం చేసుకుని సహకరించేవాడు. సుహాస్ వంటి మంచి మనిషిని భర్తగా పొందగలగటం అదృష్టంగా భావించేదాన్ని. చిన్నప్పుడు సునీత ఆంటీవాళ్ళ పాప నాపైన చూపిన ప్రభావం ఎప్పటికీ మరువలేనిది. తొలిసారి నేను సంతానవతిని కాబోతున్నానని తెలియగానే నేననుభవించిన ఆనందోద్వేగాలకు అవధులు లేవు. నా వయసులో వుండే యువతులందరిలాగే నేనూ కలల ప్రపంచంలో బతికేదాన్ని. ఇంతవరకూ నా జీవితంలో ఏ విధమైన కష్టమూ చవిచూచి ఎరుగను. సుహాస్ పెద్ద ఉద్యోగంలో ఉండి బాగా సంపాదించేవాడు. నేనేమి నోరు విప్పి అడగాల్సిన పని లేకుండానే కావలసినవన్నీ వచ్చిపడేవి. పెళ్లికి ముందు అమ్మగారింట్లో కూడా ఏ లోటూ లేకుండానే పెరిగాను. ఒక్కతే సంతానమవటంవల్ల మా వాళ్లు నా పెళ్ళి ఎక్కువ శ్రమపడకుండా చెయ్యగలిగారు. అందువల్ల నన్ను గురించి నేనేమీ ఆలోచించవలసిన పనుండేది కాదు. చిన్నప్పుడు నా తరపున నా కోసం అమ్మానాన్న ఆలోచించేవారు. ఇప్పుడు సుహాస్ ఆ బాధ్యత తీసుకున్నాడు. ఏ విషయం మనసుకు పట్టించుకోకుండా నిశ్చింతగా రోజులు గడిపేసేదాన్ని.

## కొత్తగాలి...

**చిమ్మచీకటి**
**నాకెంతో భయం**
**మిణుగురు పురుగు**
**కనిపించింది**
**గోరంత వెలుగొచ్చింది**
**కొండంత ధైర్యం నాలో కల్గింది**

*-గాదిరాజు రంగరాజు, చెరుకువాడ*

"మరీ అంత ఎక్సయిట్ అయిపోకు... నువ్వే కాదమ్మాయి.. ప్రపంచంలోని స్త్రీలందరూ తల్లులవుతూనే వున్నారు ఎప్పుడో ఒకప్పుడు" నా తడబాటు తన్మయత్వం గమనించి నవ్వుతూ ఆటపట్టించేవాడు సుహాస్.

"మాతృత్వమనేది సర్వసామాన్యమైన విషయమే కావచ్చు అయినా ఎవరికి వారికి ఆ అనుభూతి, అనుభవం గొప్పది కదా! మగవాడివి.. నీకేం తెలుస్తుంది? " అన్నాను రోషంతో.

సుహాస్ ఉల్లాసంగా నవ్వుతూ నన్ను తన బాహువుల్లో బంధించి, "అరూ... ఎందుకంత సెన్సిటివ్‌గా వుంటావు. చిన్నమాట కూడా అననివ్వవుకదా... మరీ అంత ఉక్రోషం పనికిరాదు. జీవితంలో వ్యతిరేకతను కూడా నిబ్బరంగా తీసుకోగలగాలి. అన్నీ మనం అనుకున్నట్లు జరగవు. అసలు నిన్ను అమితంగా గారంచేసి పాడు చేశారు మీ అమ్మనాన్న" అన్నాడు.

"ఇప్పుడీ సూక్తి ముక్తావళి అవసరమా.. కాస్త సందిస్తే చాలు ఉపన్యాసం దంచుతావు" అన్నాను అలక నటించి.

"సరే.. పో. నేనేం చెప్పినా నీకలాగే వుంటుంది. కానీ ఒకటి గుర్తుంచుకో అరూ.. మన జీవితంలో జరుగుతున్న సంఘటనలను మనం నిర్లిప్తంగా స్వీకరిం

చాలి. దేనికీ అతిగా స్పందించటం, ఎక్కువగా ఆలోచించటం మంచిది కాదు. మంచైనా, సరే చెడైనా సరే! ఎక్కువ ఆశలు పెంచుకుంటే ఒక్కోసారి నిరాశ పడవలసి వస్తుంది. ముఖ్యంగా ఈ సమయంలో నువ్వు ప్రాక్టికల్‌గా ఆలోచించటం మంచిది. మితిమీరిన ఊహలు, భావుకత తగదు."

ఈ మాటల్ని నేను పెద్దగా పట్టించుకోలేదు. సుహాస్ అవకాశం దొరికినప్పుడల్లా నాకిలా ఏదో ఒకటి చెప్తుండటం మామూలే! కాని తరువాత చాలాసార్లు అప్పుడు అతనన్న మాటలు నాకు తరచూ గుర్తు వస్తుండేవి. ఏమైనా సుహాస్ తెలిసో తెలియకో అనాలోచితంగానే ఆ మాటలన్నా నా బలహీనమైన మనసుకు తట్టుకోలేని అఘాతమే తగిలింది.

జీవితం పూలతేరులా ప్రేమానురాగాలతో సాగిపోతున్నా నా కల వట్టి భ్రమగా మారిపోయింది. నా కుటుంబాన్ని గురించి నేను కన్న రంగుల కలలన్నీ కల్లలయ్యాయి. ఈ విషాదాన్ని నేనప్పటికి ఊహించలేదు. నా కలలు నెరవేరుతున్నాయనే గొప్ప భ్రమలో తలమునకలుగా వుండేదాన్ని. తరువాతకాలంలో నా బతుకు తల్లక్రిందులై పోతుందన్న విషయం నాకప్పుడు తెలియదు. అసలు అటువంటిది నేను ఊహించలేదు. జీవితంలో అంతవరకూ నేను అనుకున్నవన్నీ జరిగాయి. ఎక్కడా ఏ దశలోనూ ఆశాభంగం కలగలేదు. నా స్నేహితులు నన్నెప్పుడూ 'నీకేమే అదృష్టవంతురాలివి' అనేవారు. దానికి భిన్నమైన అభిప్రాయం నాకు కూడా ఎన్నడూ కలగలేదు.

సుహాస్ నా ఆరోగ్య విషయంలో ఎంతో శ్రద్ధ కనబరిచేవాడు. పెద్ద లేడీ డాక్టర్ దగ్గరికి చెకప్స్‌కి తీసుకెళ్ళేవాడు. ఆవిడ రాసిన మందులు, టానిక్కులు నేను నియమం తప్పక వాడేటట్లు చూసేవాడు. ఆవిడ సూచించిన జాగ్రత్తలన్నీ తీసుకునేట్లు కనిపెట్టుకునేవాడు. ఆ సమయంలో సుహాస్ నా పట్ల తీసుకుంటున్న శ్రద్ధకు నేను పులకించిపోయేదాన్ని. కావాలని అతడ్ని ఏడిపించాలని ఒక్కోసారి ఏదో ఒక టాబ్లెట్ వేసుకోవటం మర్చిపోవటమో, బలంపట్టే టానిక్ తాగకపోవటమో చేసి 'అయ్యో.. మర్చిపోయాను' అని నవ్వేదాన్ని. అప్పుడు సుహాస్ చాలా ఉద్రేకపడేవాడు.

"ఏం... నీకంతా ఆటగా వుందా! డాక్టరు ఇచ్చిన మందులు కోర్సు ప్రకారం వాడితేనే నీకూ, లోపల వున్న బేబీకి మంచిది. తరువాత లేనిపోని ప్రాబ్లమ్స్ వస్తాయి. నీ ఇష్టం" అని కోపంతో పెద్దగా అరిచేవాడు. నెలవారీ పరీక్షలకు వెళ్ళినప్పుడు లేడీ

## చతురోక్తులు



ఇరవయ్యో శతాబ్దంలో పేరెన్నికగన్న ఆలోచనాపరుడు, నాస్తికుడు, గణితవేత్త బెర్ట్రాండ్ రసెల్ చతుర సంభాషణలకు పెట్టింది పేరు. వివిధ సందర్భాల్లో అనేక అంశాలపై అతడి చురకలు-

**తర్కానికి పరాకాష్ట**

ఒకటి ప్లస్ ఒకటి రెండుకు సమానమని అనుకుంటే ఈ ప్రపంచంలో దేనినైనా సాధ్యమేనని నేను నిరూపించగలను అన్నాడు రసెల్. దానికొక కుర్రాడు, 'అలాగయితే రసల్, పోప్ ఇద్దరూ ఒక్కటేనని రుజువు చేయండి చూద్దాం?' అన్నాడు.

కాస్సేపు ఆలోచించిన రసెల్- 'పోప్ ఈస్ ఈక్వల్ టు ఒన్. రసెల్ ఈస్ ఈక్వల్ టు ఒన్. అందువల్ల పోపూ, రసెల్లూ ఇద్దరూ ఒకరే కదా?' అన్నాడు తార్కికంగా

డాక్టర్ కూడా అంతా సక్రమంగానే వుందని, బిడ్డ పెరుగుదల బాగుందని చెప్పేది. నాకు ఏ విధమైన భయం, అనుమానం లేదు. మా అమ్మ గారింట్లోనూ, అత్తగారింట్లోనూ జరగవలసిన ముచ్చట్లు శాస్త్రోక్తంగా జరిపించారు. మరొక కొత్త చిన్నారి సభ్యుడు కుటుంబంలోకి రాబోతున్నాడని అందరూ ఉత్సాహంగా ఎదురు చూశారు. ఆ తొమ్మిదో నెలలో రెండు కుటుంబాలలోనూ ముఖ్యాకర్షణైపోయాను. 'ఈ సమయంలో తల్లి ఆరోగ్యం మీదే బిడ్డ ఆరోగ్యం ఆధారపడి వుంటుంది' ఈ మాట పెద్దవాళ్లు, పరిచయస్తులు, నన్ను చూడాలని వచ్చిపోయే బంధువులు, స్నేహితులు, ఎన్నోసార్లు అంటుంటే- విన్నదే మళ్ళీ మళ్ళీ వింటూ నవ్వుకునే దాన్ని.

"మా మనవడు దృఢంగా, ఆరోగ్యంగా పెరగాలంటే నువ్వు జాగ్రత్తగా మా సలహా పాటించాలమ్మాయ్. సుహాస్, నువ్వూ చక్కనివారే కనుక పిల్లవాడి అందం గురించి అనుమానం లేదు. కానీ మరీ నువ్వింత సున్నితంగా గాజుబొమ్మలా వుంటే కుదరదు" అనేది అత్తగారు.

ఆవిడ మాటల్లో ప్రేమతో కూడిన దర్పం తొంగిచూసేది. ఆవిడ మాటల్లో ఒక విషయం నన్ను కలవరపరుస్తోంది. ఒకసారి సుహాస్‌తో అన్నాను, "మీ అమ్మగారు మగ పిల్లవాడు కావాలనుకుంటున్నట్టున్నారు- ఆడపిల్ల అయితే.." సంకోచంగా.

వెంటనే సుహాస్ అన్నాడు, "ఏ పిల్ల కలిగినా ఆనందంగా ఆహ్వానిస్తారు. అవన్నీ సరదా మాటలు. మా ఇంట్లో మగపిల్లలు ఎక్కువే. మనవరాలు కావాలని పైకి అనకపోయినా మనకు అమ్మాయి కలిగితే మన వాళ్లంతా సంతోషిస్తారు. నువ్వా విషయం అనవసరంగా ఎక్కువ ఆలోచించి ఆరోగ్యం చెడగొట్టుకోకు. పిల్లలు భగవంతుడిచ్చే వరాలు. ఎవర్నిచ్చినా ఆనందంగా స్వీకరించాలి".

నాకు అతని మాటలు చాలా నచ్చాయి. ఎంతో ధైర్యమనిపించింది. పుట్టబోయేది ఆడో, మగో ముందే తెలుసుకునే ప్రయత్నం కూడా మేం చెయ్యలేదు. ఎవరైనా సరే ఆనందంగా మా జీవితంలోకి ఆహ్వానించాలన్న భావంతో వున్నాం. అందరి తపన ఒక్కటే. నేను, నాకు కలగబోయే బిడ్డ ఆరోగ్యంగా వుండాలి. ఇక నా గురించి మా అమ్మ పడిన ఆరాటం ఇంతా అంతా అని చెప్పలేను. అమ్మ నన్ను ముందుగానే తీసుకువెళ్లాలనుకుంది. కానీ సుహాస్ అంగీకరించలేదు. నన్ను నెల నెల పరీక్షిస్తున్న డాక్టరు అనుమతి లభించేవరకూ పుట్టింటికి పంపేది లేదని చెప్పేశాడు. అక్కడ వైద్య సదుపాయం సరిగా వుండకపోవచ్చని అతని అనుమానం. చివరకి డాక్టర్ ప్రసవ సమయం కొద్దిరోజులు అటు ఇటుగా నిర్ధారించి తీసుకోవాల్సిన జాగ్రత్తలు చెప్పి, అక్కడి డాక్టరు అనుసరించాల్సిన వైద్యం వివరాలు రాసి, ఇక పురిటికి నిస్సంకోచంగా పంపవచ్చు అని హామీ ఇచ్చాకే నన్ను మా ఇంటికి తీసుకువచ్చి దింపాడు.

"ఈ సమయంలో ఆడపిల్లలకు తల్లి ఎంతో అవసరం. మీరేం దిగులుపడకండి. అరుని జాగ్రత్తగా చూసుకుంటాం" అని అమ్మ పరిపరివిధాల అతనికి ధైర్యం చెప్పింది.

"ఈ అబ్బాయి అందరు మగవాళ్ళ లాంటి వాడు కాదు. లోకంలో చాలా మంది ఇటువంటి సందర్భాలలో పుట్టింటి వారిమీద వదిలేసి బే ఫరవాగా వుంటారు. నీ భర్తకు నువ్వంటే ఎంతో ప్రేమ. భార్య పట్ల ప్రేమాభిమానాలున్నవాళ్ళే ఇంత శ్రద్ధగా వుండగలుగుతారు" అనేది అమ్మ.

## కొత్తగాలి...

**ప్రభావానికీ ఫలితముంది**
**మంచైతే.. ప్రాభవం**
**చెడ్డయితే.. పరాభవం**

– గరిమెళ్ల నాగేశ్వరరావు,
కొమ్మాది, విశాఖపట్నం

తరువాత డెలివరీ అయ్యేవరకూ ఒక నెలరోజులపాటు సుహాస్ వారాంతాపు సెలవుల్లో తప్పకుండా వస్తుండేవాడు. ఇక్కడ నన్ను పరీక్షిస్తున్న డాక్టర్ని కలిసి మాట్లాడేవాడు. అమ్మ చెప్పినట్లు నిజంగా ఇటువంటి సందర్భాలలోనే భార్యమీద భర్తకు గల శ్రద్ధ, అనుకంపన తెలిసేది. తల్లి కావటంలో ఎంత ఆనందముందో అంత శ్రమ, రిస్క్ వుందని అర్థమవుతున్న కొద్దీ నా మనసులో దిగులేదో కదులుతుండేది. అది కనిపెట్టగలిగేదేమో అమ్మ- "భయపడవలసిందేమీలేదు. వైద్యశాస్త్రం అభివృద్ధి చెందింది. కాన్పు సునాయాసంగా జరుగుతుంది. నువ్వు లేనిపోని భయాలు, అనుమానాలు మనసులో పెట్టుకోకుండా ప్రశాంతంగా వుండు" అంటూ నాచేత భారత భాగవతాలు చదివించేది. ప్రశాంతతను చేకూర్చే మంచి సంగీతం వినిపించేది. మంచి విషయాలు చెప్తుండేది. ఇదంతా ఈ రోజుల్లో నాకు కాస్త ఛాదస్తమనిపించినా అమ్మను సంతృప్తి పరచటంకోసం వినేదాన్ని. ఇందులో నా స్వార్థం కూడా లేకపోలేదు. నేను నాకు కలగబోయే బిడ్డ గురించి అమితమైన ఆశలు పెట్టుకున్నాను. నా బిడ్డ అందంగా, ఆరోగ్యంగా, తెలివిగా, ఒక ప్రత్యేకమైనదిగా వుండాలని కోరుకునేదాన్ని.

మేమిద్దరం ఆరోగ్యవంతులం. వంశపారంపర్యంగా మా నుంచి పిల్లలకు సంక్రమించే జన్యుపరమైన అనారోగ్యాలేమీ లేవు. మా నాన్నగారి వంశం, మా అమ్మగారి వంశంలో అందరూ మేధావులు, విద్యాధికులే. సుహాస్ కుటుంబంలోనూ అంతే. సుహాస్ బి.టెక్ చదివి ఇంజినీరుగా పనిచేస్తున్నాడు. నేను కూడా ఉద్యోగం చెయ్యటం లేదుకానీ పెళ్ళికి ముందే మాథ్స్‌లో మాస్టర్ డిగ్రీ తీసుకున్నాను. శారీరకంగా, మానసికంగా బలంగా దృఢంగా వుంటాను. అందువల్ల నాకేవిధమైన భయంలేదు. భయమంటే ఏమిటో కూడా నేనెరుగను. నాకు అనివార్యంగా కలగబోయే కొద్దిపాటి శారీరక శ్రమను ఓర్చుకోవాలని నిర్ణయించుకుని ఆ క్షణంకోసం ఎదురుచూడసాగాను. ఒక అనుభవాన్ని ఊహించుకుని మధన పడటంలో వుండే తీవ్రత, నిజంగా దాన్ని అనుభవిస్తున్నప్పుడు వుండదనుకునేదాన్ని. కానీ నా ఆశలన్నీ తల్లకిందులైపోతాయని కలలో కూడా ఊహించలేదు. అందచందాలతో పుట్టిన మా అమ్మాయి ఇలా అయిపోవటానికి కారణమేమిటో నాకెప్పటికీ అంతుపట్టని చిక్కు ప్రశ్నే!

కౌముదిని నేను తొలిసారి చూసుకున్న సమయం నాకెప్పుడూ గుర్తే! ఆదివారం నాతో గడిపి సోమవారం డ్యూటీకి వెళ్ళాడు సుహాస్. ఒక్కరోజులో.. అదీ ఒక పూటో, కొద్ది గంటలో మాత్రమే తను నాతో ఉండగలిగేవాడు. ఎక్కువ సమయం ప్రయాణానికే సరిపోయేది. అయినా వారంవారం రావటం ఎప్పుడూ మానలేదు. పైగా "ఎలా ఉన్నావు? డాక్టరు దగ్గరికి వెళ్ళావా? భోజనం సరిగ్గా చేస్తున్నావా.. ఇబ్బందిగా లేదుగా?" లాంటి ప్రశ్నలు గుప్పిస్తుండేవాడు. అందులో కూడా తన కర్తవ్యం సక్రమంగా నిర్వర్తించాలన్న తపన కనిపించేది. అతనికి నా

# అరుదైన అవకాశం



రెండేళ్ల క్రితం బెర్ముడాలోని ఎల్బో బీచ్ రిసార్ట్‌లో మార్విన్ బుచ్చర్ అనే అతను మధ్యాహ్నం పూట వెయిటర్‌గా పని చేసేవాడు. అతను కస్టమర్స్ అందరితో ఎంతో నమ్రతగా, మర్యాదగా ప్రవర్తించేవాడు. అతని ప్రవర్తన తీరు అమెరికానుంచి వచ్చిన లిన్ బేక్‌ని బాగా ఆకట్టుకుంది. ఆమె ఎల్బో బీచ్ రిసార్ట్‌లో బసచేసినన్ని రోజులు అతన్ని ప్రత్యేకంగా గమనించసాగింది. అతను ఎప్పుడూ ఉత్సాహంగా పని చేసేవాడు. దాంతో ఆమె అతడికి సహాయం చేయాలనుకుంది. అమెరికానుంచి ఆమె అక్కడికి రావడానికి కారణం ఎండీ కోర్ట్ అంతర్జాతీయ విశ్వవిద్యాలయంలో పని ఉండటం. ఆమె ఆ విశ్వవిద్యాలయం అధ్యక్షుడు రిచర్డ్ లైలిక్‌కి వెయిటర్ మార్విన్ గురించి చెప్పి, అతడు చక్కటి అభ్యర్థి అని, స్కాలర్‌షిప్‌కి రికమెండ్ చేసింది. నాలుగేళ్లు స్కాలర్‌షిప్, ఉచిత భోజనం, బస, వసతులు అతడికి అధ్యక్షుడు ఏర్పాటు చేశాడు. దాంతో మార్విన్ జీవితం మారిపోయింది. ఉద్యోగం మానేసి ఎండీ కోర్ట్ విశ్వవిద్యాలయంలో హోటల్ మేనేజ్‌మెంట్ కోర్స్‌లో చేరాడు- అమెరికాలోని బోస్టన్‌లో.




"ఇది జీవితంలో ఒక్కసారే వచ్చే అవకాశం. నేనెప్పుడూ ఎండీకోర్ట్ విశ్వవిద్యాలయం పేరు వినలేదు కూడా. అందులో చేరతానని ఊహించలేదు. నా ఉద్యోగాన్ని నేను సక్రమంగా చేసిన దానికి బోనస్‌గా ఇది లభించింది" అని అతడు పత్రికా విలేఖరులకి చెప్పాడు.

ఆ విశ్వవిద్యాలయం తరచూ విదేశీ విద్యార్థులకి అతిథి కార్యక్రమం కింద స్కాలర్‌షిప్పులను మంజూరు చేస్తుంటుంది.

"నాకు ఒకటే ఫిర్యాదు. ఎండ ఉన్నచోట పుట్టి పెరిగిన నేను ఈ బోస్టన్ చలికి తట్టుకోలేకపోతున్నాను. చలి దుస్తులకి చాలా ఖర్చయింది. కానీ ఇక్కడి నాలుగేళ్ల చదువు తర్వాత నా భవిష్యత్తు ఎంతో బావుంటుంది. హౌస్‌కీపర్‌గా అతి తక్కువ ఉద్యోగంలో చేరిన నేను ఈ చదువయ్యాక ఏకాఏకి మేనేజర్‌గా అదే హోటల్లో చేరే అవకాశం ఉంది. నన్ను స్పాన్సర్ చేసిన లిన్ బేక్‌కి నా మీద గల నమ్మకాన్ని వమ్ము చేయను" చెప్పాడు మార్విన్



మీద కల ప్రేమానురాగాలకు అమ్మ తబ్బిబ్బయిపోయేది. ఆశ్చర్యంగా, అబ్బురంగా అల్లుడ్ని చూసుకునేది. అతడు మంచివాడని తెలుసు. మరీ ఇంత సున్నిత మనస్కుడని అనుకుని వుండదు. నాన్నగారు కూడా నిస్సందేహంగా అమ్మని ఇలాగే ప్రేమించివుండవచ్చు. స్త్రీ, పురుష వైవాహిక సంబంధంలో ఈ ఆత్మీయత, అనురాగం, బాధ్యత అంతర్లీనంగా పెనవేసుకుని వుండక తప్పదు. అయితే సుహాస్ నన్ను ఆరాధించినంతగా ఈ ప్రపంచంలో ఏ భర్త తన భార్యను ఆరాధించి వుండడని నా నమ్మకం. అతడు నాకు భర్తే కాదు, 'ఫ్రెండ్, ఫిలాసఫర్, టీచర్, గైడ్.. అండ్ వాట్ నాట్? హి ఈజ్ మై లైఫ్..' అనుకునేదాన్ని ఆరాధనా భావంతో.

సరే, సుహాస్ ఎన్నెన్నో జాగ్రత్తలు చెప్పి వెళ్ళాడు. ఆరోజు తను అతనికి గుమ్మంలోనే వీడ్కోలు చెప్పింది. వెళ్ళే ముందు నన్ను పూలగుత్తిలా అపురూపంగా పొదివి పట్టుకొని వచ్చేవారు.

"నేవచ్చేసరికి నన్నిద్దరు ఆహ్వానిస్తారు లాగుంది" అన్నాడు సహజమైన చిలిపి నవ్వుతో. అతని కళ్ళలో అప్పుడు ఒక ఆశా రేఖతోపాటు చిన్న దిగులులాంటిదేదో కదలింది. అది నాపైన ప్రేమ మూలంగా కలిగిందేనని నాకు తెలుసు. నిజానికి నా మనసులో పైకి వ్యక్తీకరించలేని ఆరాటం, అలజడి. ఉషోదయానికి సమాయత్తమవుతున్న నిశాంతంలా నా మనసు భారంగా వుంది. అందులో ఏదో ఉత్సుకత, కుతూహలం, వెరపు.. నా మనోగత భావాలన్నీ అతనికి వివరించగల శక్తి నాకు లేదు. ఆ సమయంలో చెప్పాలని కూడా అనిపించలేదు.

"బీ హేపీ అరూ.. ఎవ్విరి థింగ్ విల్ బి ఆల్ రైట్" నిండుగా గాజులతో గలగలాడుతున్న నా చేతిని తన వెచ్చని పెదవులకు అన్చుకుని, ఆప్యాయంగా భుజంతట్టి తల తిప్పుకుని నాన్నగారితో కలిసి స్టేషన్‌కు వెళ్ళిపోయాడు. తన కళ్ళలో కదిలే ఆర్ద్రత నాకు తెలియకూడదనే అలా చటుక్కున తల తిప్పుకుని వెళ్ళిపోయాడనుకుంటాను.

ఆ రాత్రే నేను నర్సింగ్ హోంలో చేరాను. డాక్టరు చెప్పిన గడువు దగ్గర పడినందువల్ల అమ్మ, నాన్న అన్ని విధాలుగా సంసిద్ధులుగానే వున్నారు.

"కంగారు పడకు.. ప్రశాంతంగా వుండు. నీకేమి భయంలేదు. భగవంతుడి దయ వల్ల అంతా సక్రమంగా జరిగిపోతుంది" అంటోంది అమ్మ. కాని అమ్మ కళ్ళలో లోతుగా కదులుతున్న దిగులు, కన్నకూతురు కష్టపడితే తట్టుకోలేని సున్నితత్వం, అప్పుడప్పుడు నేనెక్కడ అధైర్యపడతానోనని ఏదో మాట్లాడుతున్నా.. లోలోపల తన ఇష్టదైవాన్ని నిర్విరామంగా ప్రార్థించుకుంటోందని నాకు తెలుసు. నిజానికి నేను చాలా ధైర్యంగానే వున్నాను. కొద్దిసేపట్లో, లేకపోతే కొద్దిగంటల్లో నా భారం తీరిపోయి మా కొత్త పసిబంధాన్ని చూసుకోగలుగుతానన్న ఉత్సుకతతో వున్నాను.

నేను నర్సింగ్ హోంలో చేరీచేరగానే లేడీ డాక్టరు, ఇద్దరు నర్సులు నన్ను అటెండయ్యారు. నాన్నగారు అక్కడ్నించే సుహాస్‌కి ఫోన్ చేసి చెప్పారు. ఆ వేకువజామునే నాకు ఆడశిశువు కలిగింది. కాసేపటి తరువాత దాన్ని నేను మొదటిసారిగా చూసిన క్షణం.. అదొక మరపురాని అనుభూతి. చక్కని గులాబి రంగులో మెత్తని దూది బొమ్మలా వుంది. చెయ్యివేసి తాకటానికి భయపడ్డాను. నా చెయ్యి తగిలితే ఆ సుతిమెత్తని శరీరం ఎక్కడ కందిపోతుందోనని. "భయపడకమ్మా.. అప్పుడే జన్మించిన శిశువు ఇలాగే వుంటుంది. గాలి తగిలి క్రమంగా శరీరం గట్టిపడుతుంది"

అంది నర్సు.

పాప పుట్టిన సమయం సరిగ్గా నోట్ చేసుకుని సిద్ధాంతిగారికి చూపించాడు నాన్న జాతకం రాయించడానికి. పాప పుట్టిన సమయం చాలా మంచిదన్నారు ఆయన. నాన్నగారి ఫోను అందిన వెంటనే వచ్చేశాడు సుహాస్. రాత్రంతా అమ్మ, నాన్నగారితో పాటు తను నర్సి గ్హోం గార్డెన్‌లో కూర్చుని శుభవార్త కోసం ఆత్రుతగా ఎదురుచూశాడు. నన్ను, పాపనీ రూమ్‌లోకి తీసుకు వచ్చి పడుకోపె ట్టాక వాళ్ళందర్నీ మమ్మల్ని చూడటానికి అనుమతించారు. గంట గంటకు డాక్టరు నన్ను, పాపను వచ్చి చూస్తూనే వున్నారు.

సుహాస్ లోపలికి వచ్చాడు. అమ్మా నాన్న ఉయ్యాల దగ్గర్నించి కాస్త కదిలి అతనికి పాప దర్శనభాగ్యం కలిగించారు. సుహాస్ చేతులు వెనక్కి కట్టుకుని, ముందుకు వంగి ఉయ్యాలకు అంత దూరంలో నిలబడి తొంగిచూశాడు పాపని. అతని ముఖంలో దాచుకున్నా దాగని గొప్ప ఉత్కంఠ, ఉత్సాహం.. తదేకంగా క్షణం పాపని చూస్తూ వుండిపో యాడు. అప్పుడే అది కాళ్ళూ చేతులు కది లిస్తూ అలవాటులేని కొత్త వెలుగుకు ముడుతలు పడివున్న కళ్ళు కొద్దిగా తెరిచి చికిలిస్తూ తండ్రి వంక చూసింది. సుహాస్ ముఖంలో చిరునవ్వు వెన్నెల్లా కదిలింది. వాళ్ళిద్దరూ ఒకరినొకరు చూసుకుంటూ పరిచయం చేసుకుంటుంటే నాకెంతో ఉల్లాసం కలిగింది. సుహాస్ నా బెడ్ దగ్గ రున్న స్టూలుమీద కూర్చుని 'అరూ..' అని పిల్చాడు. సుహాస్ నా ఈ ఆరేళ్ల వైవాహిక జీవితంలో 'అరూ... అరూ' అని నన్నెనేక సార్లు పిల్చాడు. అతని పెదాలమీద ఆ పిలుపు రకరకాల భావాలతో, రకరకాల అనుభూతులను నాలో కలిగిస్తూ వుండేది. ప్రేమ, ఆర్తి, తపన, అలక, బాధ అనేక హృదయగత భావాలను పలికించేదా పిలుపు. ఇప్పుడు 'అరూ' అన్న అతని పిలుపులో ఇంతకు పూర్వం నాకనుభవం కాని కొత్త భావమేదో కదలినట్లైంది.

## రచనల్లో మానవీయ విలువలే ఆశయం



**యర్రమిల్లి విజయలక్ష్మి**

విశ్వకథా విపంచి 'విపుల'లో బహుమతి నందుకున్న 'బొరుసు' కథతో నా సాహిత్య ప్రస్థానం కొనసాగుతోంది. నేను రాసిన కథలు, నాటికలు ఆకాశవాణి ద్వారా ప్రసిద్ధి పొందాయి. 'చిలకలంచు జరీ కోక' ఆంధ్రప్ర దేశ్ మాసపత్రిక పురస్కారం అందుకుంది. వివిధ తెలుగు పత్రికలన్నింటికీ కథలు రాస్తున్నాను. ఉత్తమ కథలుగా కొన్ని పుర స్కారాలు అందుకున్నాయి. కొన్ని కథలు హిందీ, కన్నడ, ఆంగ్ల భాషల్లోకి అనువాదమ య్యాయి. ఇప్పటివరకూ పది నవలలు, రెండు కథాసంకలనాలు వచ్చాయి. అన్ని సాహితీ ప్రక్రియల్లోనూ కృషి చేస్తున్నప్పటికీ కథారచనంటేనే ఎక్కువ ఇష్టం. మానవీయ విలువలుగల రచనలు చేయాలన్నదే నా ఆశయం. 'కౌముది'ని ఆదరించిన 'చతుర'కు ధన్యవాదాలు.

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, బహు గ్రంథకర్త యర్రమిల్లి నరసింహారావు నా తండ్రిగారు. తల్లి పరమేశ్వరి. ఆంధ్రా బ్యాంకులో ఆఫీసర్‌గా పనిచేశాను.

చిరునామా: యర్రమిల్లి విజయలక్ష్మి
డోర్ నెం. 23/13/10,
సజ్జాపురం, తణుకు-534211



మితిమీరిన అనురాగం, జాలి, కృతజ్ఞత, బాధ- వాటి అనేక భావాలందులో పొదువుకుని నాకొక వింత అనుభూతిని కలిగించింది. నా చేతిని అందుకుని పెదాలకద్దుకుని ఈ ప్రపంచంలోని ప్రేమనంతా తన చూపుల్లో నింపుకుని.. "అరూ.. ఆర్ యు ఆల్‌రైట్?" అన్నాడు ఆరాటంగా. నేను చిరునవ్వు నవ్వి తల ఊగించాను. నా శరీరమంతా ఇంకా కంపిస్తోంది. కనుకొలుకుల్లోంచి కన్నీరు చెంపలమీదకు జారుతోంది. మనోభారమంతా ఇక తీరిపోయిందిలే అన్నట్లు దీర్ఘంగా నిట్టూర్చి 'డాక్టర్‌తో మాట్లాడి వస్తాను' అని వెళ్ళాడు సుహాస్. క్రమంగా నా శరీరం కొద్దికొద్దిగా సత్తువ పుంజుకుని సహజ స్థితికి వస్తోంది. డాక్టరు దగ్గరకు వెళ్ళి సుహాస్ నా ఆరోగ్య విషయం, బిడ్డ ఆరోగ్య విషయం వివరంగా తెలుసుకుని వచ్చాడు.

"హమ్మయ్యా.. అంతా సక్రమంగా జరిగిపోయింది. మీ ఇద్దరి ఆరోగ్యం కూడా పర్‌ఫెక్టుగా వుందని చెప్పింది డాక్టరు. ఇప్పుడు నాకు చాలా రిలీఫ్‌గా వుంది అరవిందా.. అబ్బ.. ఎంత టెన్షన్.." అలసటగా నుదురు రుద్దుకుంటూ నవ్వు ముఖంతో చెప్పాడు.

"పుట్టి రెండు గంటలైనా కాలేదు.. అప్పుడే చూడు ఎంత చుర్గ్గా వున్నాయో కదలికలు.." ఉయ్యాల తొట్టి దగ్గర నిలబడి ఇంకా కళ్ళు కూడా పూర్తిగా తెరవని పాపని చూస్తూ అంది అమ్మ అబ్బురంగా.

పాపను, నన్ను చూసుకుంటున్న నర్సు అంది, "అంతే కాదమ్మా. ఈ పిల్ల చాలా అందంగా, ఆరోగ్యంగా వుంది. ఈ బిడ్డలో ఏదో ప్రత్యేకత కూడా కనిపిస్తోంది. రోజూ ఎందరో చిన్నపిల్లల్ని, పసిపిల్లల్ని చూస్తుంటాం. మీ అమ్మాయిలాంటి పిల్లని మాత్రం చూడలేదు.."

'ఏముంది దీనిలో ఎవరిలోనూ లేని ప్రత్యేకత' అనుకుంటూ ఉయ్యాలలోని పిల్ల వంక చూశాను. చిన్న నోరు ముఖం మంతా చేసుకుని ఆవులిస్తోంది. ముడతలు ముడతలుగా వున్న ముఖంమీద, బిగించి వున్న చిన్న గులాబి మొగ్గలాంటి పిడికిలితో ఊరికే రుద్దుకుంటోంది. కాళ్ళు విదిలిస్తూ తన ఉనికి తెలియచెయ్యాలనుకుంటున్నట్లు 'ఊం... ఊం..' అని చిన్నగా అంటోంది. అది ప్రదర్శిస్తున్న హావభావాలు, చిన్న చిన్న కదికలు నాకు వింతగా వున్నాయి. ఇప్పుడిప్పుడే ఈ ప్రపంచంలోకి వచ్చిపడింది. ఒక్కటొక్కటి అన్నీ వస్తాయి లాగుంది. నర్సు ఏదో అంటోంది కాని ఇది అందరు పసి పిల్లలకు మల్లేనే వుంది. కాకిపిల్ల కాకికి ముద్దన్నట్లు మా అమ్మాయి కనక మా కంటికి అందంగానే కనిపిస్తుంది. అది సహజం. బిడ్డ ఎలా వున్నా, అందంగా వున్నా, వికారంగా వున్నా ప్రేమించటమనేది తల్లికి ప్రకృతి సహజమైన క్రియ. నాకు మాత్రం దీనికి భిన్నంగా ఎందుకుంటుంది? నా తొమ్మిది మాసాల స్వప్నం కనువిందైన రూపు ధరించి నా ఎదుట వుంది. జీవితాన్ని గురించి ఎన్నెన్నో కలలు అందరు యువతుల్లాగే కన్నాను. నన్ను పరిపూర్ణంగా అర్థం చేసుకున్న భర్త, ప్రేమానురాగాలు పంచిచ్చే అమ్మా నాన్న, తమ బిడ్డలాగే ఆదరాభిమానాలతో చూసుకునే అత్తగారు, అందం ఆరోగ్యం, ఆనందం, ఐశ్వర్యం అన్నీ అమరిన పూర్తి జీవితం నాది. ఇప్పుడు బంగారానికి తావి అబ్బినట్లు మమ్మల్ని అనుక్షణం మురిపించి మరిపించే చిన్నారి. ఈ సౌభాగ్యం కోసమే కదా అనాదిగా ఈ ప్రపంచంలోని స్త్రీలందరూ తాము పడే శ్రమనంతా తృణప్రాయంగా భావించి, భరించేది!

మాతృత్వ భావనలోని గొప్పతనం అది. మనదేశంలో స్త్రీలు పిల్లల్ని అన్నిటికన్నా

మిన్నగా భావిస్తారు. కన్నబిడ్డలను తమ కంటే గొప్పగా ప్రేమిస్తారు. మానవ జీవన ప్రవంతిని నిరంతరంగా కొనసాగించేవారు పిల్లలని నమ్ముతారు. లేకుంటే ఈ మానవజాతి అనాదిగా పరంపరాగతంగా ఎలా నిలిచి వుండగలదు? స్త్రీత్వానికి మాతృత్వం వరం. ఈ పరిపూర్ణతను ప్రకృతి నిష్పక్షపాతంగా ప్రతీ స్త్రీజాతికి పంచి ఇచ్చింది. అందుకే స్త్రీ ప్రకృతి. ఈ రకమైన విశ్వాసాలు, భావాల మధ్య పెరిగిన దాన్నవటం వలన నాలోనూ అవే అభిప్రాయాలు కొద్దిపాటి కాలానుగుణమైన మార్పులతో నాటుకుని వున్నాయి. ఇప్పుడు నా కల సఫలమైన ఆనందంలో నేను మునిగిపోయాను.

ఇక మా అమ్మ ఆనందం మాటల్లో వివరించలేను. పాతికేళ్ల తరువాత మా ఇంట్లో పసిపిల్లల కేరింతలు విని ఆమె పులకించిపోయేది. నా కూతురిలో ఆనాటి తన పసి అరవిందను చూసుకుని మురిసిపోయేది. నాతో పాపను పోలుస్తూ ఏవేవో పాత కబుర్లు చెప్పేది. 'పాప పోలిక ఎవరిది నాదా.. సుహాస్‌దా..' అన్న విషయంలో ఇంట్లో వాదోపవాదాలు జరుగుతుండేవి.

'అంతా నీ పోలికే ఆ ముక్కు, నోరు.. ముఖ్యంగా కళ్ళూ..' అని ఎవరైనా పాపను వర్ణిస్తుంటే నాకు గొప్ప ఉత్సాహంగా వుండేది.

"అబ్బే.. పిల్లలో సుహాస్ పోలికలే కనబడుతున్నాయి.. ఆ పొడవు, రంగు" అప్పుడు సుహాస్ ముఖం వికసించేది. సుహాస్ చామనఛాయ రంగులో వుంటాడు. మంచి ఎత్తు. నేనతని గుండెల వరకూ వస్తాను. ఆడపిల్లలకు తండ్రి పోలిక వస్తే అదృష్టమంటారు. నేను, నా కూతురు కూడా అదృష్టవంతురాలు కావాలని ఆశపడ్డాను.

నేను పూర్తిగా కోలుకుని స్వయంగా

## కొత్తగాలి...

**మంచిపని తిట్టయినా**
**చేయించాలి!**
**చెడ్డపని కొట్టయినా**
**మాన్పించాలి**

*– గరిశకుర్తి రాజేంద్ర,*
*భిక్‌నూర్, నిజామాబాద్*

పనులు చేసుకునే శక్తి వచ్చేవరకూ పుట్టింట్లోనే వుండాలని నిర్ణయించారు. చిన్న పిల్లలకి చెయ్యవలసిన పనులన్నీ అమ్మ తను చేస్తూ నాకు వివరంగా చెప్పేది. తరువాత వారం వచ్చినప్పుడు పాపకు పేరు సెలక్ట్ చెయ్యటంకోసం కూర్చున్నాం. రకరకాల పేర్లున్న రెండు పేర్ల పుస్తకాలు తెచ్చాడు సుహాస్. అందులో ఒక్కటీ మాకు నచ్చలేదు. జాతకరీత్యా పేరులో మొదటి అక్షరం 'క' వుండాలన్నారు. మేమందరం కూర్చుని 'క' మొదటి అక్షరంగా వచ్చే పేర్ల జాబితా తయారుచేశాం. చివరకు ఎంతో తర్జన భర్జనలు పడ్డాక 'కౌముది' అన్న పేరు నిర్ణయించాం. వెన్నెలలాంటి మా చిన్నారికి కౌముది అన్న పేరు చక్కగా సరిపోతుందని అందరం తీర్మానించాం.

నామకరణోత్సవం గొప్ప వేడుకగా జరిపించారు అమ్మానాన్న. అత్తవారింట్లో వారంతా వచ్చారు. అందరూ కౌముదికి ఏవేవో కానుకలు తెచ్చారు. పిల్ల బోర్లా పడ్డరోజు అమ్మ ఆనందం ఇంతా అంతా కాదు. బొబ్బట్లు చేసి ఊరంతా పంచేసింది. గడపదాటితే గారెలు చెయ్యాలని-అడుగులు వేస్తే అరిసెలు చెయ్యాలని, ముద్దు ముద్దుగా అత్త, అమ్మ అని పలికితే పంచదార చిలుకలు పంచాలని తను నా దగ్గర వున్నా లేకపోయినా నేను చెయ్యవ

లసినవన్నీ చెప్పింది. ముఖ్యంగా పసిపిల్లను ప్రాణంలా చూసుకోవాలని, కంటికి రెప్పలా కాపాడుకోవాలని జాగ్రత్తలు చెప్పింది. తీరిక దొరికితే చాలు పిల్లల పెంపకం గురించి చెప్తూనే వుండేది. శ్రద్ధగా వినేదాన్ని. ఎప్పుడన్నా పాప విషయంలో ఏ చిన్న అజాగ్రత్త, పొరపాటు జరిగినా అమ్మ చివాట్లు పెట్టేది. ఉదయం నిద్ర లేవగానే ముందు ఉయ్యాల దగ్గరకే వెళ్ళేది. రాత్రి బట్టలు తీసేసి అంతా శుభ్రంచేసి స్నానానికి ఏర్పాట్లు చేసేది. ఉయ్యాల్లో కాస్త కదిలినట్టనిపిస్తే చాలు వెంటనే లేచి చూసేది. అవసరమైతే పడకబట్టలు మార్చి పాప పడుకుని నిద్రపోయేవరకూ అక్కడే మెల్లగా ఉయ్యాల ఊపుతూ వుండేది. ఈ లోకంలో



చాలామంది పిల్లలు వుంటారు. చాలా మంది తల్లులూ ఉంటారు. కానీ మా అమ్మలా పసి పిల్లల్ని చూసుకోగల వారెంతమంది వుంటారు? అనుకునేదాన్ని. ఒక్కోసారి నన్ను పరీక్షించడానికి అమ్మ 'పాప పని నువ్వే చూసుకో'మని నాకు వదిలేసి నేనెలా చేస్తున్నానో గమనించేది. ఒకసారి పాపకు స్నానం చేయించటానికి ప్రయత్నిస్తుంటే చేతకాక ముక్కులోకి, నోట్లోకి నీళ్ళు పోయి ఉక్కిరిబిక్కిరైపోయింది. అమ్మ పడిన కంగారు ఇంతా అంతా కాదు. పాపకేమవుతుందోనని నా గుండెలు భయంతో కొట్టుకున్నాయి. అమ్మ పాపను తీసుకుని త్వరగా పొడిబట్టతో ఒళ్ళంతా తుడిచి 'పద ముందు' అంటూ ఆస్పత్రికి తీసుకుపోయింది.

ఆవిడ పరీక్షించి "ఏం భయంలేదు. కొద్దిగా నీళ్ళు మింగింది అంతే. స్నానం చేయించేటప్పుడు నీళ్ళు నోట్లోకి పోకుండా జాగ్రత్తగా చూసుకోండి" అంది.

అప్పటికి మా గుండెలు కుదుటపడ్డాయి. ఇలా నేనక్కడ వున్న రెండు నెలలు ఎన్నో విషయాలు గ్రహించాను.

అమ్మ నాకు ఎన్నో విషయాలు చెప్పింది. కానీ ఒక్కటి మాత్రం చెప్పలేదు. నా కోసం పొంచి వున్న అపారమైన దుఃఖాన్ని నేనెలా భరించాలో మాత్రం చెప్పలేదు. పైకి అంతా సవ్యంగా, సహజంగా కనబడుతుంటే ఎవరు మాత్రం ఇంకో విధంగా ఊహించగలుగుతారు? నా విషయంలోనూ అంతే జరిగింది. విధి మమ్మల్ని క్రూరంగా పరిహసించింది. తరువాత కాలంలో నేను ఒంటరిగా గొప్ప విషాదాన్ని భరించాల్సి వుందన్న కఠిన సత్యం మాకెవరికీ స్ఫురించలేదు. అందువల్లే ఆరోగ్యంగా, అంతా సక్రమంగా వున్న పిల్లను జాగ్రత్తగా ఎలా పెంచి పెద్ద చెయ్యాలన్న విషయమే, ఆ జాగ్రత్తలే అమ్మ, మా అత్తగారు, మరెందరో పెద్దవాళ్ళు చెప్పారు. నా కూతురి భవిష్యత్తు, దానితో పెనవేసుకుని వున్న రాబోయే జీవితాన్ని వాళ్ళు ముందుగా గ్రహించి వున్నట్లయితే అటువంటి పిల్ల తల్లిగా నేను తీసుకోవాల్సిన జాగ్రత్తలు మరో రకంగా చెప్పి వుండేవారనిపిస్తుంది. ఓరిమి, సహనం, దుఃఖాన్ని నిగ్రహించుకోగల మానసిక స్థైర్యం ఎలా పెంపొందించుకోవాలి? పాపను అది జీవించినంత కాలం లేదా నేను జీవించి వున్నంతకాలం ఎలా భరించాలి? అనే అంశాల దిశగా సాగి వుండేది వాళ్ళు నాకిచ్చే శిక్షణ. కానీ అప్పట్లో అదేమీ జరగలేదు.

ఒక ఆదివారం సుహాస్ వచ్చినప్పుడు "మంచి ఆర్ట్‌మూవీ వుంది ఊళ్లో. చూద్దామా?" అన్నాడు. అతను, నేను బయట చెట్టపట్టాలేసుకుని తిరిగేవాళ్ళం పాప నా కడుపున పడకముందు. తరువాత కూడా మూడు నాలుగు నెలలు వచ్చే వరకూ బాగానే సినిమాలకు, షికార్లకు, స్నేహితుల ఇళ్ళకూ వెళ్ళేవాళ్లం. నాలుగో నెల ప్రారంభమైన దగ్గరినుంచి నా శరీరంలో తేడా మరీ కొట్టివచ్చినట్టు కనప



డటం ప్రారంభించింది. పొత్తికడుపు భాగం ఎత్తుగా తయారై నాకు బయటకు వెళ్ళాలంటే సిగ్గనిపించేది. ప్రపంచానికంతకూ 'నాకు సంతానం కలగబోతోంద'ని చాటింపు చేసి చెప్తున్నాననిపించేది.

"ఇందులో సిగ్గు పడవలసిందేముంది? నువ్వు తల్లివి కాబోతున్నందుకు నేను గర్వపడుతున్నాను, సంతోషపడుతున్నాను. నువ్వు అలాగే భావించాలి. అనవసరమైన సిగ్గు, సంకోచం, బిడియం వదిలివెయ్యాలి" అనేవాడు సుహాస్.

చాలాసార్లు నన్ను కన్విన్స్ చెయ్యాలని ప్రయత్నించి చివరకు భరించలేక "నువ్వు పరమమొండివి. నీకెవరూ చెప్పలేరు!" అని వదిలేసేవాడు. నిజమే నా మనస్తత్వంలో చిత్రమైన బలహీనత, వాటి లక్షణం వుండేది. నా కిష్టంలేనిది ఎంత మంచిదైనా, ఎంత ముఖ్యమైనదైనా దాని జోలికి పోయేదాన్ని కాదు. అందరూ వేటినైతే చిన్న విషయాలుగా భావించి పట్టించుకోకుండా వదిలేస్తారో వాటి విషయంలో నాకెక్కువ శ్రద్ధ వుండేది. 'నీ అంతటి సెంటిమెంటల్ ఫూల్‌ని నేను చూడలేదు' అనేవాడు సుహాస్ ఒక్కోసారి బాగా కోపం తెప్పించినప్పుడు. ఎవరి నుంచి నాకు సంక్రమించిందో కాని ఈ మానసిక తీవ్రత ఎక్స్ట్రీమిజం అనిపించే భావ సంచలనం నన్ను తరచు లోబరుచుకుంటూ వుండేది. క్రమంగా అది నాతోనే పెరుగుతూ వచ్చింది.

సరే, గత ఆరేడు నెలలుగా మేమిద్దరం కలిసి బయట తిరిగింది లేదు. అంతకు మునుపు ఎత్తు పొట్ట, ఇప్పుడు పసిపిల్ల మా స్వేచ్ఛకు ఆటంకాలయ్యాయి. ఇప్పుడు నా మొదటి సమస్య తీరిపోయినట్లే! పొట్ట అణిగిపోయేలా అమ్మ నా పొట్టకు మెత్తని సన్నని బంధంవేసి పొత్తికట్టు నేర్పించింది. అయితే ఇప్పుడు చంటిపిల్లను ఇంట్లో వదిలి సినిమాకు వెళ్ళటమా అనిపించింది.

"ఇప్పుడా.. నేను లేకపోతే అది ఏడుస్తుందేమో.." అన్నాను, సుహాస్ ఎక్కడ నొచ్చుకుంటాడోనని అనుమానిస్తూనే. నా మాటలకు సుహాస్ నవ్వాడు. నేను లేకపోయినా పాప ఏడవదని నాకు తెలుసు. అమ్మ అనుక్షణం దాన్ని కంటిపాపలా కాచుకుని చూసుకుంటుంది. అదింకా నా అవసరాన్ని గుర్తించటంలేదు. ఏడవడం అనేది దానికింత వరకూ తెలియదు. నీళ్ళు పోసి సాంబ్రాణి పొగ వేసి, పాలుపట్టి ఉయ్యాల్లో వేస్తే గంటలకొద్దీ నిద్రపోతుంది. 'నిద్రపోవటం తప్ప దీనికేం పని లేదామ్మా?' అనేదాన్ని, ఉయ్యాల్లో పడుకుని నిద్రపోతున్న పిల్లని చూస్తూ.

"పిల్లలు ఎక్కువసేపు నిద్రపోతారు. అలా నిద్రపోతేనే మంచిది. దానికింకా నీతో కేరింతలు కొడుతూ అల్లరిచేసే వయసు రాలేదు" అనేది అమ్మ. అందువల్ల కౌముది ఏదో లేచి, నేను కనపడకపోతే ఏడ్చి గోలచేసేంత సీను లేదక్కడ. ఈ విషయం సుహాసూ కనిపెట్టాడు. అందుకే నా మాటలకు నవ్వాడు. కానీ ఇంకోలా రియాక్టు కాలేదు. అదే అతనిలోని గొప్పతనం. ఇతరులను ఎప్పుడూ నొప్పించకుండా వారి మాటకు తగిన విలువనిస్తాడు.

అమ్మ నన్ను లోపలికి పిలిచి చెప్పింది "వెళ్ళిరండి.. నువ్వుండి దానికి ఇప్పుడు చేయవలసిందేమీ లేదు.. నేను చూసుకుంటా"

వెంటనే నేను తయారై పాప ఉయ్యాల దగ్గరికి వెళ్ళి "కౌమూ.. మమ్మీ డాడీతో సినిమాకి వెడుతోందిరా. ఏడిచి అమ్మమ్మను విసిగించకేం" అంటూ నిద్రపోతున్న నా కూతురి బుగ్గలు నిమిరాను.

"అది ఏడవదు. నువ్వే బుగ్గలు గిల్లి

ఏడిపించేట్టున్నావు. నిద్రపోతున్న పిల్లని లేపకూడదు. ఉలిక్కి పడుతుంది. మీరు వెళ్ళిరండి.." అంది అమ్మ వెంటనే తను వచ్చేసి మనవరాల్ని అటెండవుతూ.

చాలా నెలల తరువాత నేను, సుహాస్ సినిమాకు వెళ్ళాం. అది సుహాస్‌తో కలిసి నేను చూసిన చివరి మూవీ అని నేనప్పుడు అనుకోలేదు. థియేటర్‌కి వెళ్ళేవరకూ హుషారుగానే ఉన్నాం. 'నేను టిక్కెట్స్ తీసుకొస్తాను. నువ్విక్కడే కూర్చో' అని సుహాస్ నన్ను థియేటర్ లాంజ్‌లో వదిలి టికెట్స్ కౌంటర్స్ వైపు వెళ్ళాడు. అక్కడ ఇంకా కొందరు ఆడవాళ్ళు వాళ్ళ పిల్లలతో ఉన్నారు. పిల్లలు ఆనందంగా అటు ఇటు పరుగులు తీస్తూ ఆడుకుంటున్నారు. అకస్మాత్తుగా నా దృష్టి వాళ్ళతో కలిసి కేరింతలు కొడుతున్న ఒక కుర్రాడి మీదకు పోయింది. ఆ పిల్లవాడు వయసుకు మించిన శరీరంతో, పెద్ద తలతో వికారంగా కనిపించాడు. పిల్లలు ఆడుకుంటుంటే వంకర కాళ్ళతో తనూ పరుగెత్తాలని ప్రయత్నించి పడిపోయాడు. ఆ కుర్రవాడు దబ్బున కింద పడగానే నా గుండె కలుక్కుమంది.

"ఆంటీ మీ నగేశ్ పడిపోయాడాంటీ.." ఒక పిల్లాడు పరుగున వచ్చి నగేశ్ తల్లికి లాగుంది చెప్పాడు. నిజానికి వాడొచ్చి ఆమెకు పిల్లవాడు పడిపోయాడని చెప్పవలసిన అవసరం లేదు. ఆవిడ అక్కడే సోఫాలో కూర్చుని పక్కవాళ్ళతో మాట్లాడుతోంది. పిల్లవాడి కదలికల మీదే ఆమె దృష్టి ఉంది. నేను పిల్లవాడ్ని లేవతియ్యాలని ఆత్రుతగా కదలబోయాను. ఆవిడ లేచి వెళ్ళి, లేవటం చేతకాక అట్లాగే కూర్చున్న నగేశ్‌ని పెదవులు బిగపట్టి పైకెత్తి తీసుకువచ్చి సోఫాలో కూలేసింది.

"పడిపోయాడా.. వీడ్నెందుకు తీసుకొస్తావు నువ్వు.." మరో స్త్రీ అదో రకంగా చూస్తూ జాలి పడుతున్నట్లు అడిగింది.

## కొత్తగాలి...



**అన్నం విలువ**
**ఆకలికి తెలుసు**
**ఆకలి విలువ**
**అనాథకు తెలుసు**

–సి.కామేశ్వర రావు, కాశీబుగ్గ

"ఏం చెయ్యమంటావక్కా.. పాపం పిచ్చి వెధవ. వాడికీ కాస్త కాలక్షేపం కావాలి కదా.. నేను మీతో సినిమాకి వచ్చేస్తే వాడ్ని ఇంట్లో ఎవరు చూస్తారు చెప్పు. ఇంతే, నా ఖర్మ.. వాడి ఖర్మ.. తప్పదు అనుభవించాల్సిందే" అంది ఆ తల్లి నిర్వేదంగా.

ఇంతలో టిక్కెట్స్ తెచ్చి 'పద' అంటూ సుహాస్ కూడా ఆ కుర్రవాడ్ని చూశాడు. క్షణకాలం అతని చూపుల్లో జాలి కదిలింది. మరుక్షణం చూపు తిప్పుకుని "ఊс...పద పిక్చర్ మొదలైంది" అన్నాడు మామూలు స్థితికి వస్తూ. థియేటర్‌లో కూర్చున్నా నా మనసు ఎందుకో వెలితిగా దిగులుగా వుంది. సుహాస్ సినిమా చూట్టంలో నిమగ్నమయ్యాడు. అతని తత్వమే అంత. ఏదీ సీరియస్‌గా పట్టించుకోడు. అతని మనసులో ఇతరులకు సంబంధించిన అనవసర విషయాలేవీ వుండవు. ఆ కుర్రవాడి వల్ల నా మూడ్ డిస్టర్బ్ అయిందని గ్రహించాడు. నా చెయ్యి తన చేతిలోకి తీసుకుని "రిలాక్స్ అరూ! అనవసర విషయాల గురించి ఎందుకు నీ మనసు పాడుచేసుకుంటావు? ఇట్స్‌నాట్ అవర్ జాబ్! ఫొటోగ్రఫీ చూడు ఎంత నీట్‌గా ఉందో! మ్యూజిక్ సూపర్బ్. రెహమాన్ బీట్ చూడు.. ఎంత మెలోడియస్‌గా వుందో.." అంటూ హుషారు పరచాలని ప్రయత్నించాడు.





నేనూ అలాగే అనుకున్నాను. జీవితంలో ఎవరెవరికో చెందినవి, మనకే మాత్రం సంబంధం లేనివి అయినా ఆ అసహజమైన వికృత రూపం తుడిపెయ్యాలన్నా నా మనసులోంచి పోలేదు. తెలియని బాధతో నా గుండె జలదరించింది. 'ఆ పిల్లవాడు ఎవరో మానసికంగా పరిణతి చెందలేదు లాగుంది పాపం!' అని జాలిపడ్డాను. జాలి-ప్రేమ అంతకు మించి మరే అభిప్రాయం నాలో కలగలేదు. అటువంటి దృశ్యాలు నన్ను భయపెడతాయి. నేను భరించలేను. ఆ పిల్లవాడ్ని ఆ తల్లి ఎందుకు బయటకు తీసుకువచ్చింది అనుకున్నాను. బయటివాళ్ళు తన పిల్లాడ్ని అదోలా చూస్తుంటే ఆ తల్లి ఎలా భరిస్తుంది!

అప్పుడు మేము జీవితాన్ని చాలా ఫ్రీగా, ఆనందంగా, సుఖంగా గడిపేవాళ్ళం. సుహాస్, నేను ప్రేమపక్షుల్లా ఏకాంత జీవితాన్ని ఆరంభించిన తొలినాళ్ళవి. సుహాస్ అసిస్టెంట్ ఇంజినీర్‌గా పనిచేస్తుండేవాడు. ఉద్యోగపు టూర్లో మేమిద్దరం కొత్త కాపురం ఆరంభించాం. మా ఇంట్లో గంగమ్మ అనే పని మనిషి వుండేది. మనిషి సన్నగా, పీలగా వుండేది. ఒకప్పుడు బాగానే బతికిన వాళ్ళవటంవల్ల కష్టం చెయ్యటం అలవాటులేదు. అయినా ఇంటికి సంబంధించిన పనంతా బాగానే చేసేది. ఇంట్లో సాగక పనిలోకి వస్తోంది. ఆ ఊరు వచ్చిన వెంటనే తెలిసింది అక్కడ పని మనుషుల ఎద్దడని. సుహాస్ కంపెనీలో పనిచేసే వాళ్ళెవరో ఆ అమ్మాయిని మా ఇంట్లో పనికి కుదిర్చిపెట్టారు. అప్పటికింకా సరదా సరదాగా చిన్న చిన్న పనులు- అదీ బుద్ధి పుట్టినప్పుడు చెయ్యటమే తప్ప పనిలో అంత నిపుణత అబ్బలేదు. వంటల పుస్తకాలు దగ్గర పెట్టుకుని కొత్త కొత్త ప్రయోగాలు సరదాగా చేస్తుండేదాన్ని. మా ఇంట్లో సాధారణంగా నా వయసులో వుండే ఆడపిల్లలంద



## కొత్తగాలి... 

**ఏసీ గదిలో కూర్చున్నా**
**ఎంతో ఉక్కగా ఉంటోంది**
**చెట్టు మీంచి పిట్టల్లా**
**షేర్లు పతనమవుతున్నాయ్!**

– కొలచన వెంకట రమణమూర్తి,
ప్రశాంతినగర్, హైదరాబాద్

రకు మల్లేనే ఏమీ పని వుండేది కాదు. అంతా అమ్మే చేసుకునేది. వంట ఏం చేసిందో కూడా భోజనాల బల్లముందు కూర్చున్నాకే తెలిసేది నాకు. ఒక్కతెనే సంతానం కావటంవల్ల అమ్మ మరీ అపురూపంగా ఏమీ నేర్పించకుండా పెంచింది.

'ఆడపిల్లలకు పనిరాకపోతుందా.. పెద్దయ్యాక అన్నీ ఎటూ అదే చేసుకోవాలి.. ఇప్పట్నించీ వంటింట్లో కూర్చోపెట్టాలా?' అనేది ఎప్పుడన్నా ఎవరన్నా పనిపాటల ప్రస్తావన తెస్తే. అందువల్ల ఆడపిల్లలకు సహజసిద్ధంగా అబ్బే కొద్దిపాటి ఇంటి పనులు తప్ప నాకేమీ ప్రత్యేకమైన నిపుణత ఏర్పడలేదు. నేనేమీ కష్టపడకుండా గంగమ్మ అన్ని పనులు చేసేది. మనిషి కూడా వినయంగా, ఒద్దికగానే వుండేది. అయితే నిండా పాతికేళ్ళైనా వుంటాయో వుండవో కాని ఎప్పుడూ అనారోగ్యంతో తుమ్ముతూ, దగ్గుతూ, ముక్కుతూ, మూల్గుతూ వుండేది. అలాంటి రోగిష్టి మారి మనుషులంటే నాకు చిరాగ్గా వుండేది. కానీ తప్పదుకదా. పనిమనిషి లేకపోతే ఇబ్బంది. అందువల్లే దాని ఆకార వికారాలు పట్టించుకోకుండా పనిలో పెట్టుకున్నాను.

ఒకరోజు సాయంత్రంవేళ విశ్రాంతిగా టెర్రస్‌మీద కూర్చుని చదువుకుంటున్నాను. పుస్తకాలు చదవటం నా హాబీ. నిశ్శబ్దంగా వుండే చల్లని ప్రశాంత సంధ్యా సమయాలంటే ఇష్టం. అందమైన ప్రకృతి, అందమైన వస్తువులు, అందమైన మనుషులు, సృష్టిలోని అందమైనవన్నింటినీ నేనెంతో ఆరాధిస్తాను. జీవితాన్ని అందంగా- ఆనందంగా వుంచుకోవటం నా ఆశయం.

ఉన్నట్లుండి బయట గేటు దగ్గర సందడి వినిపించింది. నా ధ్యానం భగ్నమైంది. ఎవరో వచ్చినట్టున్నారనుకున్నాను. వరండాలో చిన్న, చిన్న అడుగులు ఈడుస్తూ నడుస్తున్న శబ్దం. గుసగుసగా సన్నని మాటలు వినిపిస్తుంటే నా ఏకాగ్రత చెదిరింది. "ఎవరూ?" అన్నాను విసుగుదల అణచుకుని.

"నేనేనమ్మా.." అంటూ వచ్చింది గంగమ్మ.

పనంతా సాయంత్రమే ముగించుకు వెళ్ళిపోయింది. మళ్ళీ వచ్చిందేమిటి? ఏమన్నా డబ్బు కావల్సి వచ్చివుంటుందనుకుని "ఏమిటి గంగా.. ఈవేళప్పుడొచ్చావు?" అన్నాను పుస్తకం తిరగేస్తూ అటు చూడకుండానే.

"అమ్మగోరికి పిల్లగాళ్ళని సూపిద్దామని తీసుకొచ్చానమ్మా..." అంది గుమ్మంలో ఒక పక్కగా ఒదిగి నిలబడి గంగమ్మ.

నా అందమైన సాయంత్రం పాడైందన్న బాధ కలిగింది.

'ఏమిటో దీని సంతానాన్ని నాకిప్పుడు తెచ్చి చూపించకపోతే' అనుకున్నాను, మనసులో విసుగుపడుతూ. పైకి ఏమీ అనలేక చిన్నగా నవ్వి ఊరుకున్నాను. మనసులోని భావాలను మాటల్లో బయటపెట్టలేని సంస్కారం నాది. అప్పటి నా అపరిపక్వ మనస్తత్వాన్ని, అవివేకాన్ని తలచుకుంటే ఇప్పుడు బాధ కలుగుతుంది. నామీద నాకే జుగుప్స, అసహ్యం ఏర్పడతాయి. జీవితమంటే ఏమిటో తెలియని అవివేకం, అహంకారం. అప్పటి నా ఆనందం, స్థితి, అంతా శాశ్వతమేనన్న భ్రమ. అసలు నా

భవిష్యత్ జీవితం ఎంత విషాదకరమైన మలుపు తిరుగుతుందోనన్న ఆలోచనే కల గవలసిన పరిస్థితి కాదు. మనిషి ఆశిం చింది జరగదు. జరిగేది ఆశించలేడు. నా భావి జీవితం ఊహించగలిగితే అప్పట్లో గంగమ్మ పట్ల, అటువంటి మనుషుల కష్టాల పట్ల నా స్పందన ఇంకోరకంగా వుండేదేమో?

"ఈడేనమ్మగోరూ మా పెద్దోడు సుధా కరం. సానా మెతక మడిసండి. మాటలు కూడా సరింగా రాలేదమ్మా.. ఈ ఎదవ పుటకలోనే నాకు పెద్ద జబ్బు సేసిందండి. ఆసొదిలేసుకున్నా అమ్మగారు. సచ్చి బతికి నానమ్మ" పిల్లల కోడిలా వచ్చి హాల్లో నేల మీద కూర్చుని మొదలెట్టింది గంగమ్మ. అప్పటికి అది పనిలో చేరి కొద్దిరోజులే అయింది. అందుకే అంతవరకు ఆ పిల్లల పరిచయ భాగ్యం నాకు కలగలేదు అనుకు న్నాను. నాకు దాని కథలో ఏమీ ఉత్సాహం లేదు. యథాలాపంగా పిల్లవాడి వంక చూశాను. బలహీనంగా వేరుపురు గులా తల్లిని పట్టుకు వేలాడుతున్నాడు. నా దగ్గరికి తీసుకువస్తున్నందుకు ఉతికిన చొక్కా లాగు వేసింది. క్రాపు కూడా దువ్వి నట్లుంది. ముఖం శుభ్రంగా కడిగి తిలకం చుక్క కూడా పెట్టింది. పైపై అలంక రణలెన్ని చేసినా అసలు రూపం ఏమైపో తుంది? రోగిష్టిమారి పిల్లాడని చూడగానే అర్థమైపోతుంది. మాల్ న్యూట్రిషన్.. దానికే లేదు.. పిల్లలకేం పెడుతుందనుకు న్నాను. చాలాకాలంగా పనికిరాని పాత వస్తువుల్ని వదిలేసినట్లు, గంగమ్మ విషయం నా మనసులోంచి తొలగించే శాను. ఇప్పుడు మళ్ళీ కొత్తగా గుర్తుకొస్తు న్నాయి ఆ సంగతులు. ముఖ్యంగా ఆ పిల్లాడు, సుధాకరం. వాడంటే ఎంత ప్రేమ చూపించేది గంగమ్మ. తల్లికి తన బిడ్డ కురూపి అయినా, రూపసి అయినా, మందబుద్ధయినా, తెలివిగలవాడైనా ప్రేమించడమే కదా తెలుస్తుంది!

ముగ్గురు పిల్లలు దానికప్పుడే. చిన్న పిల్లకి ఆరేడు నెలలుంటాయేమో. ఎత్తుకు నివచ్చి వెనక వరండాలో ఎవరికీ అడ్డులే కుండా ఒక మూల పాత చీర పరిచి పడు కోబెట్టేది. మిగతా ఇద్దరూ మగపిల్లలు, పెద్దవాళ్ళు.

"అమ్మగోరికి దణ్ణవెట్రా సుదాకరూ!" కొడుకుతో అంటే వాడు ఇంతింత కళ్ళు మిటకరించి చూశాడు. తల్లి చెప్పిందేమిటో వాడి బుర్రకర్థం కాలేదు. కాళ్ళీడ్చుకుంటూ అటు ఇటూ కుంటుతూ తిరిగేవాడు. ఏడాది వయసులో జ్వరం వచ్చి కాలు పీక్కుపోయిందట. ఎన్ని మందులు వాడినా తగ్గలేదట. ఆ మందుల వల్ల నడక రాలేదు సరికదా మెదడు కూడా దెబ్బతింది. పోలియోలాగుంది. రెండో వాడు పెద్దవాడి కంటే కాస్త మెరుగ్గానే ఉండేవాడు. చురుకుగా కూడా ఉండే వాడు. వాడి కాలు, చెయ్యి క్షణం ఊరుకు నేది కాదు. బల్లమీది వస్తువులన్నీ అటు ఇటు కదిలిస్తూ, పరీక్షిస్తూ ఉండేవాడు. వాడి పేరు దివాకర్..

"అయ్యన్నీ తాక్కూడదు, తప్పు! దివా కరూ.. ఈడ కూకో" అనేది గంగమ్మ వాడ్ని మందలిస్తూ.

మాటల్లో ఆ యాస, ఆ పిల్లలూ.. అదీ.. నాకు అదోలా అనిపించేది. వీడి పేరు దివాకరమ్మగారూ.. ఇది జోతి. ఆల్ల నాన్నకీ పిల్లంటే పానవండి. దీన్ని బాగా సదివించాలని..." అనేది గంగమ్మ ఒళ్ళో నిద్రపోతున్న పిల్లతలను మురిపెంగా నిమురుతూ. ఆ గొంతులో ఏవిటో గొప్పతనం. పిల్లల భవిష్యత్ మీద తిరుగులేని ఆశ. నాకు ఆశ్చర్యంతోపాటు నవ్వు తెప్పించేది. 'బాగానే వుంది కోరిక. ముందు వాళ్ళకి కడుపు నిండా తిండి







పెట్టండి. చాలు. తమ పిల్లల్ని ఏ కలక్ట ర్లనో, డాక్టర్లనో చేసెయ్యాలని ప్రతివాళ్ళకీ ఆశే' అనుకునేదాన్ని మనసులో. ఎప్పుడూ పిల్లల గురించి చెప్తూనే వుండేది. నేను వింటున్నానో లేదో, దాని విషయంలో నాకు శ్రద్ధ వుందో లేదో ఏమీ గ్రహించేది కాదు. తన గోడు వెళ్ళబోసుకుంటూనే వుండేది. పనిచేస్తున్నంతసేపూ పిల్లలు రెండ్రోజులకొకసారన్నా దానితో వచ్చే వారు. మా ఇల్లు, తోట అంటే వాళ్ళకి ఇష్టంగా ఉండేదనుకుంటా. ఎన్నిసార్లు చూసినా ప్రతి వస్తువునూ ఆశ్చర్యంగా, వింతగా చూసేవారు.

నీడలు తేలే మొసాయిక్ మీద కూర్చుని చేత్తో రాస్తూ ఆనందపడిపోయేవారు. మురికి మనుషులు - శుభ్రత తెలియదు. దుమ్ముకాళ్ళతో ఇల్లంతా పాడుచేస్తున్నారని బాధపడేదాన్ని కానీ ఆ మాటలు పైకి చెప్పి గంగమ్మను నొప్పించలేకపోయే దాన్ని. కానీ తక్కినవాళ్ళ సంగతి అటుంచి, సుధాకరాన్ని చూస్తుంటే నాకు చాలా అశాంతిగా వుండేది. ఆ కుర్రాడు తల్లిని విడిచి వుండలేకపోయేవాడు. 'పో, ఇంటికి పోయి తమ్ముడితో ఆడుకో' అని తల్లి కేకలేస్తున్నా వాడికి అర్థమయ్యేది కాదు. వాళ్ళమ్మ పనిచేసుకుంటున్నంత సేపూ నేను ఇచ్చిన బిస్కటో, చాక్‌లెటో తింటూ, చొంగ కారుస్తూ గుమ్మానికి అంటిపెట్టుకుని, మిడిగుడ్లేసుకుని చూస్తుంటే నాకేమిటోగా వుండేది. కేకలే సినా, తిట్టినా ఏమీ తెలిసేది కాదు. ఒక్కో సారి విసుగుతో 'వీడ్నెందుకే రోజూ కూడా తెస్తావు.. పని చేసుకోనివ్వడు' అనేసే దాన్ని. గంగమ్మ జాలిగా, బాధగా చూసేది 'ఏం చేయమంటారమ్మా.. ఎంత సెప్పినా ఇనిపించుకోడు. అర్థం కాదమ్మగోరూ.. తిట్టినా తెల్డు. సిన్నోడు బళ్ళోకెళ్ళిపోతాడు. పిల్ల నిదరోద్ది. ఈడేనమ్మా కూడా పడ తాడు' అంటూ సోది ప్రారంభించేది. దానితో సంభాషణ కొనసాగించటమంటే మరో తలనొప్పిగా వుండేది నాకు. మెల్లిగా వాడికి మా ఇల్లు అలవాటైంది. ఎవరి ఇష్టాయిష్టాలు, విసుగు వాడికి పట్టేది కాదు. భయం, బెదురు చూపులు తగ్గాయి. నన్ను చూసి పళ్ళన్నీ బయట పెట్టి ఇకిలించేవాడు. గంగమ్మ పనికోసం ఇవన్నీ సహించవలసి వచ్చేది. వాడ్ని చూస్తుంటే నాకెంతో చిరాకుగా వుండేది. అటువంటి మనుషుల్ని తప్పించుకుపోవాల నిపించేది. ఒక్కోసారి సుహాస్ వున్నప్పుడు వచ్చేవాడు. వాడి అకార వికారాల్ని పట్టిం చుకునేవాడు కాదు సుహాస్. జాలిగా పల కరించి ఏమన్నా కొనుక్కోమని డబ్బులిచ్చే వాడు. వాడు తీసుకోకుండా భయంగా కుంటి కాలీడ్చుకుంటూ పారిపోయేవాడు.

ఒకరోజు.. నాకు ఇప్పటికీ బాగా గుర్తుంది. ఆ సంగతులన్నీ మరుపు తెరల్లో మరుగున పడిపోయినట్లనిపించినా అవన్నీ ఎంత స్పష్టంగా, సజీవంగా నా స్మృతిపథంలో నిక్షిప్తమై వున్నాయోనను కుంటే ఆశ్చర్యమేస్తుంది. అనవసరమను కున్న వాటిని విస్మరించటం, వాటిని స్మరిం చుకోకుండా వదిలెయ్యటం, ఇష్టమైన విష యాలుగా మనం భావించేవాటిని పదే పదే గుర్తు చేసుకుంటూ వుండటం మానవ నైజం కావచ్చు. అసలు గంగ మ్మను గురించి, దాని పిల్లల్ని గురించీ నేనింతగా గుర్తుచేసుకోవలసిన సమయం ఒకటి నాకు ఎదురవుతుందని నేనెన్నడూ ఊహించి వుండను.

గంగమ్మ ఒక్కతే పనిలోకి వచ్చింది. ఆ 'కుంటి వెధవ' కూడా రాలేదు. అది నాకు చాలా హాయనిపించింది. గంగమ్మ మౌనంగా పనిచేసుకుపోతున్నా అదోలా దిగులుగా కనిపించింది. 'ఏమిటే'ని అడగా లంటే భయం నాకు. ఆకలి, దరిద్రం,

కన్నీళ్లు, రోగాలు, కథలు చెప్పుకొస్తుందని. దానికేమన్నా డబ్బు సహాయం కావాలంటే చెయ్యగలరుకానీ ఆ తెలుగు సినిమా కష్టాలన్నీ విని భరించలేను. ఆ సహనం నాకు లేదు. అందుకే 'ఏమిటి గంగా అలా వున్నావు' అని నేను అడిగే సాహసం చెయ్యలేదు. గంగమ్మ త్వరత్వరగా పని ముగించుకుని "వస్తానమ్మా.. పెద్దోడ్ని ఆసుపత్రికి తీసుకెళ్ళాల. రేత్తిరి కాడ్నించి ఓటే జొరవండి" అని వెళ్ళిపోయింది నేనా విషయం పట్టించుకోలేదు.

ఏదో సమయంలో వచ్చి నాకు ఇబ్బంది కలిగించకుండా పనిచేసుకుపోయేది గంగమ్మ. పిల్లాడికి బాగా లేదని బాధపడుతుండేది. 'ఎంతైనా తల్లి కదా పాపం' అని జాలి కలిగేది. ఆ పిల్లవాడు మా ఇంటికి రావటం మానేసరికి నా మనసుకు శాంతి కలిగేది. 'డాక్టరుకి చూపించి మంచి మందు ఇప్పించమని, డబ్బేమైనా అవసరమైతే తీసుకో'అని చెప్పేదాన్ని. "పెద్దాసుపత్రిలో సూపిత్తున్నాడమ్మా. గోళీలు అరుకు ఇత్తన్నారు. పలీచ్చులెయ్యో సేపింసాలంటన్నారు.. ఆల్లనాన కూడా పనిసేసేకాడ నెలజీతవంతా ముందే తీసేసుకున్నాడమ్మా ఈడి వైదిగెం కోసరం. మీకాడి పైసలు కూడా ఆడికే కర్సెట్టేత్తే మిగిలినోళ్ళకి కూడెట్టాగమ్మా? ఈడి పుటకలకి నాకెంతో జబ్బుసేసింది. ఆడసలే బతకడనుకున్నాం. అట్టాటిది మేమిద్దరం బతికి ఆడి పాణాలు తోడేత్తన్నాం. సచ్చినా బాగుండిపోయేది కదమ్మా.." అని కన్నీళ్లు పెట్టుకునేది. ఆ మాటలు బాధ కలిగించినా వాటిలోని గాఢమైన నైరాశ్యం, తరువాత అలాంటి స్థితిలో నేనున్నప్పుడుకానీ నాకర్థం కాలేదు.

అప్పట్లో తన పిల్లవాడి అవస్థ చూడలేక వాడికి తగిన వైద్య సదుపాయం కూడా సమకూర్చలేని దయనీయ స్థితిలో వాడు, వాడితోపాటు తనూ ఆనాడే చనిపోతే సరిపోయేదన్న గంగమ్మ మాటలు నాకు కఠినంగా తోచినా తరువాత అనేకసార్లు 'ఈ బతుకు బతికేకన్నా భగవంతుడు నా బిడ్డకు మరణం ప్రసాదించకూడదా?' అని రోదించేదాన్ని. ఇప్పుడు అదంతా తలచుకుంటే అనిపిస్తుంది గంగమ్మకు నాకు, దాని బిడ్డకు, నా కూతురికి తేడా ఏమిటి? ఏమీలేదు. ఇద్దరి కష్టం ఒక్కటే. ఇద్దరి వేదనా ఒక్కటే. తను ముందే అనుభవించింది. మరణమనే పదం ఇప్పుడు నాకు ఏమీ బాధ కలిగించదు. నేను నా కూతుర్ని అమితంగా ప్రేమించాను. దాని చుట్టూ ఎన్నో రంగురంగుల ఇంద్రధనుస్సులు అల్లుకున్నాను. అవన్నీ కరిగిపోయి బతుకు కాదు.. మరణమే దానికి సుఖాని

## దేశభక్తి?

యుద్ధ వ్యతిరేకి అయిన రసెల్ దేశభక్తి, యుద్ధం గురించి ఇలా చెప్పాడు-

★ 'అతిస్వల్ప కారణాలకే ఇతరులను చంపేందుకు, తాము కూడా చచ్చిపోయేందుకు అంగీకరించడమే దేశభక్తి'

★ యుద్ధం ఎవరు సరో నిర్ణయించదు. చివరికి ఎవరు మిగులుతారో నిర్ణయిస్తుంది.





వ్వగలదు కనుక మరణాన్నైనా మనఃపూర్వకంగా కోరుకునేదాన్ని.

గంగమ్మ అదృష్టం, దాని కొడుకు అదృష్టం కావచ్చు అప్పుడే వచ్చింది నా ఫ్రెండ్ వసంత. తను మెడికల్ ప్రాక్టీషనర్. మెడికల్ క్యాంప్ వర్క్‌మీద మా ఊరికి వచ్చింది. నేనక్కడే వున్నానని తెలిసి మిగిలిన వాళ్ళతో గెస్ట్‌హౌసులో వుండకుండా మాఇంటికి వచ్చేసింది. మాటల మధ్య గంగమ్మ కొడుకు విషయం చెప్పాను. వసంత నన్ను వదిలేసి గంగమ్మ కొడుకు గురించి ఎన్నెన్నో ప్రశ్నలడిగి, వాడి అనారోగ్యం గురించి ఏవేవో ఆరాలు తీసింది. అంతా అనాసక్తంగా విన్నాను. 'రాక రాక వచ్చింది, అనవసరమైన విషయం కదిపానే. సరదాగా కబుర్లు చెప్పుకోకుండా' అని పశ్చాత్తాప్తపడ్డాను. అన్ని వివరాలు తెలుసుకుని సాయంత్రం మెడికల్‌క్యాంపు దగ్గరికి పిల్లాడ్ని తీసుకురమ్మని చెప్పింది వసంత.

వసంత కోసం ఆ సాయంత్రం నేనూ మెడికల్‌క్యాంపు దగ్గరికి వెళ్ళాను. ఉమెన్స్ కాలేజి ఆవరణమంతా టెంట్లువేసి లయన్స్ క్లబ్ క్యాంప్ నిర్వహించింది. కార్డియాలజిస్టులు, గైనకాలజిస్టులు, చిల్డ్రన్ స్పెషలిస్టులు, జనరల్ డాక్టర్స్.. ఒకరేమిటి.. ఎందరో డాక్టర్లు, నర్సులు ఆ క్యాంపులో పాల్గొన్నారు. వసంత కోసం నేనూ కాసేపు అక్కడ వున్నాను. నాకు హాస్పిటల్సంటే ఎలర్జీ. ఆ మందుల వాసన భరిస్తూ ఆ వాతావరణంలో అస్సలు నిలవలేను. తప్పనిసరిగా ఎప్పుడన్నా హాస్పిటల్‌కి వెళ్ళవలసి వస్తే ఆ రోజంతా కడుపులో వికారంగా వుండేది. ఆ మందుల వాసన వెంటాడుతూ తిండి సయించేది కాదు. ఆ మంచాలమీద రకరకాల రోగాలతో జీవచ్ఛవాల్లా పడివున్న రోగులే గుర్తు వచ్చి మనసంతా కలతచెందేది. అయినా ఆ రోజు నా స్నేహితురాలి కోసం దూరంగా చెట్లకింద నించుని ముఖం చిట్లించి, ముక్కు దగ్గర కర్చీఫ్ వుంచుకుని ఓపిగ్గా అంతా చూశాను. ఉదయం నుండి ఉచిత పరీక్షలు చేయించుకోవాలని చుట్టుపక్కల ఊళ్ళలోని పేద వాళ్ళు, స్త్రీలు, పిల్లలు వస్తూనే వున్నారు. నిర్విరామంగా డాక్టర్లు పరీక్షలు చేస్తూనే వున్నారు. విసుగులేదు, అలసట లేదు. రోగుల దృష్టిలో వాళ్ళు సాక్షాత్తూ దైవ స్వరూపాలే! దయగా చూస్తూ, మృదువైన మాటలతో ధైర్యం చెప్తూ, ఓపిగ్గా వాళ్ళ సందేహాలన్నింటికీ సమాధానాలిస్తూ దీన మానవసేవ చేస్తున్న వారిపట్ల రోగుల చూపుల్లో ఎంత భక్తి భావమో, ఎంత గౌరవమో, ఎంత కృతజ్ఞతో.. నేనంతా నిర్లిప్తంగా చూస్తూ వుండిపోయాను.

గంగమ్మ కొడుకుని కూడా డాక్టర్లు పరీక్షించారు. వసంత మూలంగా మరింత శ్రద్ధగా మందులు, టానిక్కులు ఏవేవో ఉచితంగా ఇచ్చారు.

ఇక గంగమ్మ ఆనందానికి అవధులు లేవు. పదే పదే దణ్ణాలు పెడుతూ కొడుకుని తీసుకువచ్చి వసంతకు కృతజ్ఞతలు చెప్పుకుంది. వసంత వాడ్ని దగ్గరకు తీసుకుని ఆదరంగా 'ఎలా వుందిరా జ్వరం... తగ్గిందా? ఏం తిన్నావు' అని పలకరిస్తుంటే గంగమ్మ తడబడిపోయింది. దాని కళ్ళు కృతజ్ఞతతో, భక్తితో నిండిపోయాయి. రోగాన్ని నయంచేసి ప్రాణదానం చేసే డాక్టరుకంటే దైవం ఇంకెవరుంటారు. పిల్లాడి గురించి చెప్పిందే మళ్ళీ మళ్ళీ చెప్తూ ఆరాట పడిపోయింది. అంతా ఓపికగా వింది వసంత.

"తగ్గిపోతుంది.. భయంలేదు. కాని మంచి వైద్యం ఇంకా చేయించాలి. వీడు చాలా బలహీనంగా వున్నాడు. బలానికి మంచి ఆహారం, మందులు ఇవ్వాలి.

పట్నంలో ఇలాంటి పిల్లల కోసం సేవాశ్రమాలున్నాయి. మీ అబ్బాయిని అక్కడికి పంపుతానంటే నేను వాళ్ళకి చెప్పి, ఏర్పాటుచేస్తాను. పిల్లవాడి బాగోగులు కూడా వాళ్ళే చూస్తారు. చదువు కూడా చెప్తారు. అక్కడకు పంపితే ఆరోగ్యం మెరుగుపడుతుంది. పిల్లవాడి భవిష్యత్ బాగుంటుంది. ఇక్కడ మీ వల్లకాదు. ఎప్పటికీ ఇల్లాగే వుండిపోతాడు ఏమంటావు? ఆలోచించుకుని చెప్పు" అంది వసంత.

ఆ సంభాషణంతా నేను నిరాసక్తంగా విన్నాను. వెంటనే దణ్ణంపెట్టి 'అట్లాగే నమ్మా' అంది గంగమ్మ. 'మీ ఆయన్ని అడగవా? ' అంటే అదోలా నవ్వింది. అవును అతను మాత్రం ఏమంటాడు? పిల్లాడినయితే కన్నారు కాని, వాడి మంచి చూడగలుగుతున్నారా అనుకున్నాను. "మేమేం సేగలం తల్లి, ఆడ్నీడుంచుకుని! తవబోటి దయగల తల్లులే ఆడ్ని ఆదుకోవాల. యాడైనా బిడ్డ బాగుండటమే కదమ్మా మాకు కావల్సింది" అంది మన స్ఫూర్తిగా.

"చిన్నపిల్లాడు కదా తల్లిదండ్రుల్ని వదిలి వుండగలడా? " అంది గంగమ్మ.

వసంత చెప్పింది, "కొత్తలో కాస్త దిగులనిపించినా అదే అలవాటైపోతుంది. అప్పుడప్పుడు మీరు వచ్చి చూస్తుండవచ్చు. అక్కడ ఇంకా ఇటువంటి పిల్లలు చాలా మంది వుంటారు. వాళ్ళకి సరైన ఆశ్రయం అక్కడే దొరుకుతుంది. ఒంటరితనం తెలియదు. తమ వయసు పిల్లలతో కాలక్షేపం చేస్తారు. అక్కడ ఇంకో ముఖ్యమైన అవకాశం వుంది. అది బయటవాళ్ళకు దొరకదు. మానసికంగా ఎదుగుదల లేని పిల్లల్లో కూడా ఏదో ఒక అభిరుచి వుంటుంది. అక్కడ వీళ్ళకు ఏ విషయంలో ఇష్టముందో కనిపెట్టి అందులో శిక్షణనిస్తారు. అల్లా ఎంతోమంది పిల్లలు చిన్న, చిన్న చేతిపనులు నేర్చుకుని వాటిలో

## కొత్తగాలి... 

**నేటి చదువు..**
**ఇంద్రజాలమే**
**కంప్యూటర్ ట్రిక్కులతో**

- కూర్మాన వెంకట సుబ్బారావు,
మురళీనగర్, విశాఖపట్నం

రాణిస్తున్నారు. ఒక అవయవం లేకపోయినంత మాత్రాన జీవితమంతా పోయినట్లు నిరాశతో కృంగిపోవలసిన పనిలేదు. ప్రతి మనిషికీ జీవించే హక్కు ఉంది. వాళ్ళకీ ఆనందం, ప్రేమ కావాలి కదా!"

సుధాకరం ట్రీట్‌మెంట్‌కి అవసరపడే సొమ్ము తను ఇస్తానన్నాడు సుహాస్. వసంత, సుహాస్ చాలాసేపు ఆ సమస్యను గురించి చర్చించుకున్నారు. కళలు, పుస్తకాలు, సంగీతం, ప్రకృతి ఆరాధన వంటి విషయాలమీదతప్ప తన మనసు ఇతర సమస్యల జోలికి పోయేది కాదు. సుందరమైన ఊహల్లో విహరించటం, భావుకతతో ఉండటం ఎక్కువ. నన్ను గురించి, సుహాస్ గురించి తప్ప బాహ్య విషయాలేమీ నా ఆలోచనల్లోకి రాగలిగేవి కాదు. జీవితమంటే అందం, ఆనందమనే భ్రమల లోకంలో మునిగి తేలేదాన్ని. అప్పట్లో నా స్థితి కూడా అందుకు తగినట్లుగానే వుండేది. ప్రాణాధికంగా ప్రేమించే భర్త, స్నేహపూరితమైన వాతావరణం, మంచి సామాజిక అంతస్తు, సమృద్ధి సౌకర్యాలతో నిండిన జీవితం.. యవ్వన కాలం.. ఇవన్నీ జీవితంపట్ల నాకెంతో మధురమైన భ్రమలను పెంచేవి. దీనికి విరుద్ధంగా ఇంకో పార్శ్వం వుందని, బతుకు ఎల్లకాలం సుఖసంతోషాలతో పూలరథంలా సాగిపోదని కొన్నేళ్ల తరువాత స్వానుభవంతో నాకు అవగతమైంది. తరువాతంతా చివరి





## కొత్తగాలి... 

**గెలుపూ, ఓటమి**
**కావాలి సరిసమానం**
**అయినా ఓడినప్పుడు**
**దుఃఖించడం మానం**

*—మాధవీ సనారా, అనకాపల్లి*

వరకు కృష్ణపక్షమే నన్ను వరించింది. జీవితంలో గల ఆనందం, ఆహ్లాదం మాయమై ఒకే ఒక్క గాఢతమ తిమిరచ్ఛాయ జీవితమంతా నీడలా వెన్నంటి వచ్చింది.

గంగమ్మ కొడుకుని వికలాంగుల సంక్షేమ నిలయంలో చేర్చి వచ్చింది. అప్పుడప్పుడు తల్లిదండ్రులిద్దరూ వెళ్ళి కుర్రాడ్ని చూసి వస్తుండేవారు. చదువు చెప్పిస్తున్నారని, వీడు వెదురుబుట్టలు, చాపలు అల్లగలుగుతున్నాడని, తమ దగ్గర వున్నప్పటికన్నా పిల్లాడు చురుగ్గా వున్నాడని, వాడి గురించి తమకిక దిగులు లేదని తృప్తిగా చెప్పేది. వసంతకు, మా ఆయనకు దణ్ణాలు పెడుతుండేది. 'ఆయమ్మ దయవల్ల నా బిడ్డ సుకంగా వున్నాడమ్మా!' అని పదేపదే తలచుకునేది. బిడ్డ దిగులు తగ్గటం వల్ల తను కూడా కాస్త బలం పుంజుకుని ఆరోగ్యంగా కనపడేది. మళ్ళీ పదిరోజులన్నా కాకుండానే 'బిడ్డ ఎట్టున్నాడో..' అని బెంగపడేది. అయితే వాళ్ళ పరిస్థితి వేరు. కానీ నాలాటివాళ్ళు పిల్లని అనాథలా ఎవరో దయాధర్మాలమీద వదిలెయ్యగలరా?

మా కౌముది నెలల పిల్లగా వున్నప్పుడు తన వయసుకన్నా ఒకటి, రెండు నెలల పెద్దపిల్లలున్నట్లు బొద్దుగా ముద్దుగా వుండేది. ఎప్పుడూ ఎవరో ఒకరు మా ఇంటికి వచ్చి- కౌముదిని చూసి దాని అందాన్ని మెచ్చుకుని ముద్దులిస్తుండేవారు. ఆ మాటలకు నేను ఉప్పొంగిపోయేదాన్ని. 'రోజూ పదేసిమంది వచ్చి చూసిపోతున్నారు. ఎవరి కళ్ళు ఎలాంటివో.. పసికందుకు దిష్టి తగులుతుందమ్మా' అంటూ అమ్మ రోజూ రాత్రిళ్ళు దిష్టి తీసేది.

ఒకసారి నా చిన్ననాటి స్నేహితురాలు వచ్చింది. కూడా నాలుగేళ్ల పిల్లాడు వచ్చాడు. వాడు తన వయసుకన్నా చిన్నవాడిలా బలహీనంగా పీలగా వున్నాడు. నా స్నేహితురాలు మా కౌముదిని చూసి ఒకటే సంబరపడిపోయింది. "నువ్వు చాలా అదృష్టవంతురాలివే అరవిందా! అందం, ఐశ్వర్యం, హోదా వున్న భర్త- అందమైన ముద్దులొలికే అమ్మాయి.. అందుకే అన్నారు పుణ్యం కొద్దీ పురుషులు దానం కొద్దీ బిడ్డలు!" అని తెగ మెచ్చుకుంది. ఆ మాటల్లో ఏదో వెలితి, అసంతృప్తి ధ్వనించాయి. స్త్రీ సహజమైన కాస్త ఈర్ష్య కూడా వుందనిపించింది.

"పిల్లవాడిని మంచి డాక్టరుకి చూపించి బలానికి ట్రీట్‌మెంటు ఇప్పించలేకపోయావా? " అన్నాను ఆమె అసంతృప్తి గమనించి.

"ఏం చెప్తావులే అరవిందా.. ఎన్ని మందులు, ఎన్ని బలవర్ధకాలు ఇచ్చినా అదేమిటో నా ఖర్మ. వీడిలాగే ఈసురోమంటూనే ఉన్నాడు. అన్నీ ఏ గోతిలో పోతున్నాయో అర్థం కాదు. వీడికి నాలుగేళ్లు నిండుతున్నాయంటే ఎవరన్నా నమ్ముతారా? మళ్లీ అన్ని విషయాల్లోనూ చురుగ్గానే వుంటాడు, బతుకంతా ఇలాగే వుంటాడేమోనని భయపడి చస్తున్నాను. డాక్టర్‌కి చూపిస్తే ఏమీ లోపం లేదు, బలమైన తిండి పెట్టమంటారు" అని తన మనసులోని బాధంతా వెళ్లగక్కింది.

"గాభరాపడకమ్మా, కొందరు పిల్లలు చిన్నతనంలో ఇలగే బలహీనంగా కనిపిస్తారు. పెద్దవుతున్నకొద్దీ బలం పుంజుకుంటారు. నువ్వోపని చేస్తుండు. రాత్రిళ్ళు

అన్నంలో పాలుపోసి, తోడు పెట్టి, అది ఉదయం తినిపిస్తుండు. బలం పడుతుంది. అనవసరంగా ఎక్కువ మందులు వాడటం కూడా పిల్లాడికంత మంచిది కాదు" అంటూ అమ్మ ఏమేమో చెప్పి కాస్త ధైర్యం కలిగించింది. మునుపైతే ఇటువంటి మాటలన్నీ చాదస్తంగా నాకు విసుగనిపించేవి.

ఆరోగ్యకరమైన వాతావరణంలో మా అమ్మాయి శరీరం ఆరోగ్యంగా పెరుగుతోంది. మేం వున్న ఊరు పల్లెటూరి వాతావరణంతో ప్రశాంతంగా వుండేది. పచ్చికబయళ్ళు, తోటలు, పెద్ద పెద్ద చెట్లతో, పంట పొలాలతో చూడముచ్చటగా వుండేది. అటువంటి స్థలంలో మంచిగాలి, వెలుతురు ప్రసరించే ఇంట్లో ప్రేమాస్పదులైన కుటుంబసభ్యుల మధ్య కౌముది అందంగా, ముద్దుగా పెరిగేది. అమ్మ దగ్గర వున్నంతకాలం పిల్లను గురించిన భయాందోళనలేమీ మాకెవరికీ కలగలేదు.

నేను, సుహాస్ కౌముదిని తీసుకుని మా ఉద్యోగపుటూరికి చేరుకున్నాక కొంతకాలం నేను భ్రమలోనే వున్నాను. బిడ్డ అందమైన ఒళ్ళు, ఆరోగ్యకరమైన ముద్దులొలికే శరీరం, చక్కని రంగు, నల్లని పెద్ద కళ్ళు.. ఇవన్నీ నన్ను చాలా మోసగించాయి. కౌముది నా ప్రథమ సంతానం కావటం వల్ల మిగిలిన పిల్లల వికాసంతో దాన్ని పోల్చుకుని లోపాన్ని గమనించే అవకాశం నాకు లేకపోయింది. లేకపోతే 'ఈ వయసుకి వాడు పాకాడు, ఈ నెలలో వాడు పొర్లాడాడు, ఈ వయసుకి ముందే వాడు 'అమ్మ, అత్త' అన్నాడు అని జాగ్రత్తలు తీసుకోగలిగేదాన్నేమో! ఎవరైనా మరి దానిలోని లోపాన్ని కనిపెట్టారో లేదో కానీ మాతో ఏమీ అనుమానాన్ని వ్యక్తపరుస్తూ చెప్పేవారు కాదు. అమ్మ దగ్గర వున్న సమయంలో అంతా సవ్యంగానే వుందనిపించింది. అప్పటికింకా దానికి రెండు నెలల వయసే! అమ్మకు చిన్నపిల్లని తీసుకుని అప్పుడే నేను వెళ్లటం ఇష్టం లేదు. కానీ సుహాస్ అప్పటికే నెలల తరబడి హోటళ్లలో తింటూ ఇబ్బందులు పడుతున్నాడు. ఇంకో రెండు మూడునెలలు నేను అమ్మ దగ్గరే వుంటానన్నా అతనేమీ అభ్యంతరపెట్టడు. కానీ అతడి బాగోగులు చూసుకోవలసిన బాధ్యత కూడా నాపైన వుంది. కౌముది పుట్టిన వేళా విశేషం బాగుంది. సుహాస్‌కి పదోన్నతి లభించింది. అతనికన్నా సీనియర్స్‌ని పక్కన వుంచి అతనికి కంపెనీ పెద్ద అసైన్‌మెంట్ అప్పగించింది. అతని ఉద్యోగ ధర్మానికి సహకరించవలసిన బాధ్యత కూడా నాకుంది కదా. అందుకే అమ్మ కొత్త ఊరికి నన్ను ఆనందంగా పంపింది. మేం వచ్చేస్తుంటే మనవరాల్ని వదలలేక ఆవిడ గుండె ఎంత కొట్టుకుందో ఆ ముఖమే చెప్పింది. "అరూ... పాపను జాగ్రత్తగా చూసుకో! ఎప్పటికప్పుడు ఉత్తరాలు రాస్తుండు. నీకెన్నిపనుల తొందరలున్నా ముందు పాప పని చేశాకే తక్కినవి. ఏదన్నా తేడా చేస్తే వెంటనే డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళు.." అంటూ రకరకాల జాగ్రత్తలు బండి కదిలేవరకూ చెప్తూనే వుంది. పిల్లను వదల్లేక వదల్లేక ప్రేమంతా కళ్ళలో నింపుకుని ఆర్తిగా చూస్తూనే వెనక్కు మళ్ళారు అమ్మా నాన్న.

అప్పుడు వారిని చూస్తే నాకెంతో దిగులనిపించింది. ఇన్నాళ్ళు చిన్నదాని ఆలన పాలనతో, నా సేవలతో అమ్మ తలమునకలుగా వుంది. ఇప్పుడు దాన్ని వదిలివుండాలంటే బాధపడుతోంది. ఇరవై రెండేళ్లు నన్ను ప్రాణంగా పెంచి పెళ్ళిచేసి పంపేటప్పుడు ఆవిడ ఎంత పరితపించిందో తనకు తెలుసు. ఏడుస్తున్న నన్ను దగ్గరికి తీసుకుని 'తప్పమ్మా! శుభసమయంలో కన్నీరు



కార్చకూడదు. అంతా నీకే అలవాటైపో తుంది' అని తన హృదయంలో పొంగు తున్న దుఃఖాన్ని అక్కడే తొక్కి వుంచి, ధైర్యం చెప్పి పంపింది. తను అనేకసార్లు బాధపడుతూనే వుంటుంది. కష్టసుఖాలు పంచుకునే తోడబుట్టిన తోడు ఒక్కరైనా లేకపోవటం ఎంతో లోటనేది తన వంతు బాధైతే- అమ్మ, నాన్నల విషయం మరింత కష్టం. తన్ను విడిచి వుండలేకపోయినా, సుహాస్ అత్తమామల్ని కూడా తన తల్లితం డ్రుల్లా ఆదరించగల సంస్కారం కలవా డైనా, అమ్మానాన్న ఎప్పుడూ తన దగ్గర కొచ్చి పదిరోజులు వుండలేకపోతున్నారు. ఏమిటో బిడియం, సంకోచం.. తప్పనిసరై వచ్చినా ఆ పని పూర్తయ్యాక వచ్చిన బంధువులతో వాళ్ళూ సంచీ తీసుకుని బయల్దేరిపోతారు. ఈ విషయంలో తను వాళ్ళని మార్చలేకపోయింది. 'నేను మీ కొడుకులాటివాడ్నని మీరే ఎప్పుడూ అంటుంటారు కదా! మీ కొడుకు దగ్గర వుండటానికి మొహమాటపడతారేమిటి మావగారూ' అని సుహాస్ కూడా ఎన్నో సార్లు చెప్తుంటాడు.

అబ్బాయికి ఎంత ప్రేమవున్నా, నువ్వు మా పిల్లవే అయినా మిమ్మల్నిద్దర్నీ ఇక్క డికి పిలిచి నాల్గురోజులుంచుకుని పంప టంలోని ఆనందం.. మేం వచ్చి అక్కడ వుండటంలో వుండదు. నువ్వు తల్లివయ్యా వుకదా. కౌముది పెద్దదై నీకూ అల్లుడు వచ్చాక తెలుస్తుందిలే" అంది అమ్మ, తను మాతో రావటంలేదని అలిగితే.

"సరే.. వేలెడులేదు. ఇది పెద్దదవటం, పెళ్ళై నాకు అల్లుడు రావటం, అబ్బ ఏం ఊహించేస్తోందో చూడు" ఎగతాళిగా నవ్వింది తను.

"నవ్వకు. పిల్లలు ఎంతలో ఎదిగిపో తారు. అందులోనూ ఆడపిల్ల చూస్తుండ గానే పెద్దదైపోతుంది. నువ్వూ ఇలాగే వుండేదానివి, నోట్లో వేలేసుకుని. ఆ నోట్లో వేలేసుకునే అలవాటు మాన్పించటానికి ఎంత అవస్థ పడ్డానో' అంటూ నా బాల్యం లోకి వెళ్ళిపోయింది.

చివరికి ఏమైతేనేం అమ్మ మనవరాల్ని వదలక తప్పలేదు. ఇంతకాలం ఆవిడ ప్రేమానురాగాలన్నీ నా చుట్టూ అల్లుకుని వుండేవి. ఒక్కరోజు కూడా నన్ను వదిలి వుండేది కాదు. ఇప్పుడా మమకారం నా కూతురి చుట్టూ అల్లుకుంటోంది. ముఖ్యంగా అమ్మ నా పసితనాన్ని దానిలో చూసుకుంటూ ఆనందపడుతోందేమో. దాన్ని వదిలి వుండాలంటే దిగులుగానే వుంది.

కౌముదిని పెంచటంలో సుహాస్ కూడా నాకు సహకరించేవాడు. నేను అత్యవసర మైన పనిలో వున్నప్పుడు దాని ఉయ్యాల ఊపుతూ వుండటమో, విజిల్‌వేసి దాన్ని ఆడించటమో చేస్తుండేవాడు. దాన్ని ఎత్తుకో వాలంటే మాత్రం చాలా భయపడేవాడు. తప్పనిసరైనప్పుడు నేను మెత్తగా టవల్‌వేసి జాగ్రత్తగా ఒళ్ళో పడుకోబెడితే కదలకుండా కూర్చునేవాడు. "ఎందుకంత భయం నేను ఎత్తుకోవటంలేదూ. నేర్చుకో" అనేదాన్ని.

"ఇంకా నయం.. ఇది క్షణం కుదురుగా వుండదు. జారి కిందపడిపోతే.. అమ్మో!" అనేవాడు. ఎక్కువ సమయం ఇంట్లో వుండేట్లు పనిమనిషిని కుదుర్చుకున్నాను. సుహాస్‌కి ఎప్పుడూ బయటి వ్యవహారా లతో సరిపోతుంది. ఇంటి దగ్గర వుండే రాత్రి సమయాల్లో కూడా ఏదో కాసేపు సరదాగా పాపతో ఆడుకునేట్లుండాలి కాని, అదొక అదనపు బాధ్యతగా అతను భావిం చకూడదని నా ఉద్దేశం. మేమిద్దరం దాన్ని ఎదురుగా వుంచుకుని ఎప్పుడూ దాని భ విష్యత్తు గురించి కలలుకనే వాళ్లం. ఏ స్కూల్లో చేర్పించాలి.. ఏ చదువులు చెప్పించాలిలాంటి విషయాలు మాట్లాడుకు

నేవాళ్లం.

ఈ సరదావల్లే ఒకసారి నా ఫ్రెండ్ తార తన మూడేళ్ల కొడుకు అరుణ్‌ను పంపే ప్లేస్కూలుకి వెళ్ళాను ఆమెతో.

"ఊళ్లోకల్లా ఇది మంచి స్కూలు. మేనేజ్‌మెంటు బాగుంది. పిల్లలపట్ల ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటారు. మీ కౌముదిని కూడా ఇక్కడే చేర్చెయ్యి...మా అరుణ్ వున్నాడుగా హాయిగా చదువుకుంటారు. ఇద్దరూ.." అంది తార లోపలకు నడుస్తూ. రకరకాల పూల మొక్కలతో గార్డెన్ అందంగా వుంది. చల్లనిగాలి, చెట్ల నీడ, విశాలమైన ఆటస్థలం అంతా చక్కగా వుంది. ఆయాలు పిల్లల్ని దగ్గర వుండి ఆడిస్తున్నారు. ఆడుతూ పాడుతూ కేరింతలు కొడుతున్న పిల్లలందరూ పుష్టిగా, ఆరోగ్యంగా వున్నారు. నేను అపుడే నిర్ణయించుకున్నాను మా కౌముదిని కూడా అక్కడే చేర్పించాలని. కాని నా ఆశలన్నీ ఆడియాసలేనని, నా కూతురుకి అందరి పిల్లల్లా నవ్వుతూ, తుళ్లుతూ ఆడేపాడే శక్తి లేదని తరువాత కొద్ది కాలానికే తెలిసింది.

ఎదుగుతన్నకొద్దీ పిల్లలకు మాటలు వాటంతటవే సహజంగానే వచ్చేస్తాయంటారు. వాళ్లు వింటున్న మాటల్ని అప్రయత్నంగా తిరిగి అంటుంటారు. అలా వింటూ వింటూ వయస్సు పెరుగుతుంటే తమ భావాలను స్పష్టంగా వ్యక్తీకరించే విధానాన్ని నేర్చుకుంటారు. కానీ రెండేళ్ళ వయస్సు వచ్చినా కౌముదికి మాటలు రాలేదు. నాకు ఆందోళన మొదలైంది. గులాబి రంగు శరీరం, ఒత్తైన మెత్తని జుట్టు, పువ్వుల్లా వుండే తెల్లని కళ్ళు, చూట్టానికి ఏవిధమైన బలహీనతలేక అందంగా, ఆరోగ్యంగా వుండేది. మరి ఎందుకు మాట్లాడలేకపోతోంది? మాటలు రావటంలో ఆలస్యమెందుకు జరగాలి? కౌముదికి సహజంగా మాటలు రావలసిన వయసులో రావటంలేదని నాలో వ్యథ

## కొత్తగాలి...

**మసకబారిన కళ్లకు**
**మంచి చూపు నిస్తోందని**
**కాబోలు**
**కళ్లజోడుకా ముక్కు సింహాసనం**

– వ్రతావ వెంకట సుబ్బారాయుడు,
సికింద్రాబాద్

ప్రారంభమైంది. ఏదో అసహజమైన మందకొడితనంతో మరింత కలవరం కలిగేది. నా జీవితంలో నేనెన్నడూ ఊహించని రెండు భయంకరమైన దురదృష్టకర సంఘటనలకు అది సమయం. కౌముదిని చూస్తుంటే ఏదో తెలియని భయంతో మంచుగడ్డలతో అదిమినట్లు నా గుండెలు బిగుసుకుపోయి, పైకి ఎవరికీ వ్యక్తపరచలేని భయాందోళనలతో నలిగిపోయేవి. సరిగ్గా అదే సమయంలో హృద్రోగంతో అమ్మ అకస్మాత్తుగా మరణించింది. అత్యంత క్లిష్టమైన పరీక్షా సమయాన్ని ఒంటరిగా ఎదుర్కోవలసిన దుస్థితిని నాకు విధి రాసిపెట్టి వుండవచ్చు. తీవ్రమైన గుండెపోటు కారణంగా ఒక తెల్లవారుజామున అమ్మ నిద్రలోనే కన్నుమూయటం నాకు అశనిపాతమైంది. అమ్మ మరణించాకే నేను వెళ్ళి చూడగలిగాను. జీవితంలో నేనెదుర్కొన్న అత్యంత విషాదకరమైన అనుభవం అమ్మలేకపోవటం. ఆ విషాదంలో కొద్దిరోజులు ఎలాగో గడిచిపోయాయి. ఆ రోజుల్లో మమ్మల్ని పలకరించి సానుభూతి చూపాలని వచ్చిన వాళ్ళందరినీ కౌముది ఆకర్షించేది. వాళ్ళలా దాన్ని రెప్పలార్పక పరిశీలనగా చూస్తుంటే నా గుండె తెలియని భయంతో క్రుంగిపోయేది. ఏదో తెలియని దుఃఖం

నన్నావారించేది. పిల్లలందరికీ ఒకే వయసులో మాటలు రాకపోవచ్చు. ఒకొక్కరు ఒక్కో వయసులో మాట్లాడతారు. ఒంటరిగా పెరిగే పిల్లలకంటే పదిమంది పిల్లల మధ్య పెరిగే వాళ్ళకు మాటలు త్వరగా వచ్చే అవకాశం వుంటుంది. ఇదేమీ కంగారు పడవలసింది కాదని చెప్తుంటే నా మనసుకెంతో ఊరట కలిగేది. ఇంకోలా జరగకూడదని ప్రార్థించుకునేదాన్ని. వాళ్ళు గమనిస్తున్నారో లేదో కేవలం మాటలు రాకపోవటమే కాదు నా భయానికి కారణం. కౌముదికంటే చిన్న వయసుగల పిల్లలు అప్పుడే 'మ్మ', 'త్త' అంటూ కేరింతలు కొడుతుండటం, ఆ చురుకుదనం



కౌముదిలో కనపడకపోవటం నన్ను కలవరపరుస్తుంటే భయంతో సుహాస్‌ని గాభరా పెట్టేసేదాన్ని. కొత్తలో సుహాస్ నా భయాన్ని పెద్దగా పట్టించుకునేవాడు కాదు. నా మాటల్లో దానికింకా మాట్లాడటం రావడంలేదనే తొందరే కనిపించేది. అందుకే తేలిగ్గా నవ్వేసి "అబ్బ..! అరూ నీకంతా తొందరే. కొందరు పిల్లలు ఆలస్యంగా మాట్లాడతారని అంటున్నారు కదా. అవే వస్తాయిలే.. అదేదో మూగపిల్లైపోయినట్టంత ఆరాటపడిపోతావేం" అనేవాడు.

'అదేదో మూగపిల్లై పోయినట్టు అంత ఆరాటపడిపోతావేం' అంటుంటే నా మనసు భయంతో వణికిపోయేది. నా భయాన్ని వివరించలేక "ఏమిటట్లా మాట్లాడతావు.. దానికి ఏడాది నిండిపోతోంది వచ్చే నెలతో. నేను ఏడాది నిండగానే వసపిట్టలా వాగేదాన్నట. మా అమ్మ చెప్పేది" 'మూగపిల్ల'న్న మాట నా మనసుకు వెగటుగా తోచి ఉక్రోషపడేదాన్ని. అతనామాట ఎందుకు వాడాలి అని బాధ కలిగేది. 'అవును.. నేను మరీ తొమ్మిది నెలలు కూడా రాకుండానే పాటలు కూడా పాడేవాణ్ణట. మా అమ్మ చెప్పింది' అని నవ్వించాలని చూసేవాడు. నేను నవ్వలేకపోయేదాన్ని. మనసంతా వ్యథతో కూడిన ఆలోచనలతో నిండి వుండేది.

నా బాధ భరించలేకో.. లేక తనకే ఏమన్నా సంశయం కలిగిందో ఒకరోజు నేను ప్రెగ్నెంటుగా వున్నప్పుడు పరీక్షించిన లేడీ డాక్టరు దగ్గరికే తీసుకువెళ్ళాడు. "మీరు మీ పాపను తీసుకువచ్చి ఏడాది దాటిపోతోంది. ఎలా వుంది బేబీ!" అంటూ పాపను ప్రేమగా దగ్గరికి తీసుకుని దాని గులాబి బుగ్గలమీద మృదువుగా చిటికెవేసి నవ్విందావిడ. కౌముది ఆవిడ చేతుల్లో అసహనంగా కదిలింది. నోరు తెరిచి ఆవులించి కళ్ళు మూసుకుంది "అంతా నార్మల్‌గానే వుంది" అందావిడ పైకి కనిపిస్తున్న పిల్ల దేహారోగ్యానికి సంతృప్తిపడి.

"అంతా నార్మల్‌గానే వుందంటారా డాక్టరు గారూ? " సుహాస్ కౌముదిని బల్లమీద నుంచి లేవదీసి నా చేతి కందిస్తూ





అడిగాడు. ఆవిడ దానికేం బదులిస్తుందోనని నాగుండె వేగంగా కొట్టుకుంది. 'అంతా సక్రమంగానే వుంది. మీ అమ్మాయి ఆ వయసులో వున్న అందరి పిల్లల్లాగానే ఆరోగ్యంగా వుంది' అంటే వినాలని నా మనసు ఆరాటపడింది. దాన్ని గురించి ఏ నెగెటివ్ రిప్లై వచ్చినా నేను తట్టుకోలేను. అకస్మాత్తుగా మున్నెన్నడూ లేనివిధంగా నా మనసు దుర్బలమైపోసాగింది.

"ఏమీ లేదే.. పాప బాగానే వుంది.. ఏమన్నా ప్రాబ్లం మీరు ఫీలవుతున్నారా? ఏమిటో చెప్పండి.." అందావిడ మళ్ళీ కౌముది ముఖంవంక పరిశీలనగా చూస్తూ.

"మా అమ్మాయి మాట్లాడటంలేదు డాక్టర్. ఈపాటికి చిన్న, చిన్న మాటలు వస్తాయంటున్నారందరూ.."

ఆవిడ సున్నితంగా నవ్వింది పాపవంక చూస్తూ. "వస్తాయి... ఎందుకు రావు? చురుగ్గానే వుందిగా" అంటూ పాప బుగ్గ మీద స్పర్శ తగిలేలా తట్టింది. అది కళ్ళు తెరిచి క్షణం ఆవిడవంక అదోలా తేరిపార చూసి వెంటనే తల తిప్పుకుని ఏడవటం ప్రారంభించింది.

"చూశారా.. బిడ్డకు అన్నీ తెలుస్తున్నాయి. కంగారుపడకండి. మాటలు వాటంతట అవే వచ్చేస్తాయి. మీరు మాట్లాడుతుంటే విని నేర్చేసుకుంటుంది. కొందరి నడక, మాట రావటం ఆలస్యంగా జరుగుతుంది" అనేసరికి నాకు మనసులోని భారం తీరిపోయి గొప్ప బలం వచ్చినట్లైంది.

"మాట్లాడటం నేర్పించండి- అమ్మ-అత్త-నాన్నలాటి చిన్న చిన్న మాటలు ఎక్కువ సార్లు బిడ్డ వినేట్లు అంటుండండి. వీలుంటే ఈ ఈడు లేకపోతే కొద్దిగా పెద్ద ఈడు పిల్లలతో కలిపి ఆడిస్తుండండి. అనుకరణ బిడ్డ ఎదుగుదలకి చాలా దోహదపడుతుంది. పెద్దవాళ్ళని, ఇంట్లో వాళ్ళని అనుకరిస్తూ నేర్చుకోవటం పిల్లల సహజ లక్షణం. తనకు కావాల్సింది ఏడ్చో అడిగో తీసుకోవాలనే తెలివి కూడా ఇప్పట్నించే పిల్లలకు వస్తుంది. తల్లి దూరంగా వుంటే కావాలని తన దగ్గరికి వచ్చేదాకా ఏడవటం- ఆకలేస్తే ఏడ్చి తెలియచెయ్యటం- నిద్ర వస్తే తిక్కగా ఏడవటం వంటివి చేస్తుంటారు. ఒక్కో అవసరానికి ఒక్కోలా ఏడుస్తుంటారు. పోనుపోను పిల్ల ఏడ్చే విధానాన్నిబట్టి దానికి ఆకలేస్తోందో- నిద్ర వస్తోందో- లేకపోతే డ్రెస్సు మార్చాలో మీకే అర్థమైపోతాయి. ఒకటి గుర్తుంచుకోండి. పిల్లలు ఒంటరిగా పెరగటం కన్నా పదిమందిలో పెరగటం వాళ్ళ ఎదుగుదలకు మానసిక వికాసానికి సహాయం చేస్తుంది.

ఈ కారణం వల్లే తల్లికి మొదట పుట్టిన సంతానం కంటే తరువాత కలిగిన పిల్లలు చురుకుగా, తెలివిగా పెరుగుతుంటారు" ఇలా చాలా విషయాలు చెప్పిందావిడ.

ఆమె మాటలు నాకు కొంత ఊరట కలిగించాయి. కౌముదికి మాటలు వస్తాయన్న ఆశ కొత్త ఆనందాన్నిచ్చింది. కొంత కాలం ప్రశాంతంగా వుండగలిగాను.

"నీ భయం తీరిందా? దానిమీదే వెర్రి ప్రేమ పెట్టుకుంటున్నావు.. పిల్లల్ని సామాన్యంగానే చూడాలి. అదీ అందరిలాటి పిల్లేకదా. అందరూ పెరిగినట్లే అదీ పెరుగుతుంది. ఏ విషయంలోనూ అతి పనికిరాదు" అన్నాడు సుహాస్.

సుహాస్‌ని కొంతకాలం నా భయాలతో సతాయించటం తగ్గింది. పాప మెలకువగా ఉన్నప్పుడు ఉయ్యాల దగ్గర కూర్చుని దానికి వినపడేలా 'అమ్మ- తాత, నాన్న తాత' లాంటి మాటలు అంటుండేదాన్ని. అది నా వంక కూడా చూసేది కాదు.

అయినా నా ప్రయత్నం చేస్తూనే వుండే దాన్ని. అప్పుడప్పుడు తారతో అరుణ్ స్కూల్ కి తీసుకువెళ్ళేదాన్ని. పదిమంది పిల్లల మధ్య ఉంచితే కాస్త మార్పు వస్తుం దన్న ఆశతో! దీనికన్న ఒకటి రెండేళ్ల పెద్దపిల్లలు వాళ్ళు కౌముదిని చూడగానే పసిపిల్లలకు సహజమైన కుతూహలంతో దాని చుట్టూ చేరి దాని దృష్టిని ఆకర్షించా లని ప్రయత్నించేవారు. కేరింతలు కొడుతూ, గెంతుతూ దాన్ని నవ్వించాలని చూసేవారు. వాళ్ళంతా వచ్చీరాని మాట లతో చెట్లమీద పక్షుల కిలకిలా రావాలు చేస్తున్నట్లు గజిబిజిగా అరుస్తుండేవారు. వాళ్ళకి స్పష్టంగా ఏ మాట ఉచ్ఛరించటం రాదు. 'నీ పేరేమిటి.. మమ్మీ పేరేమిటి.. మీ డాడీ పేరేమిటి..' లాంటి ప్రశ్నలకు మాత్రం సమాధానం చెప్పగలిగేవారు. ఒక్కోసారి అమ్మ పేరో, నాన్న పేరో చెప్పే టప్పుడు నోరు తిరక్క తడబడేవారు. అయినా ఆ మాటలు ఈ ప్రపంచంలోని మాధుర్యాన్నంతా నింపుకుని అమితానం దాన్ని కలిగించేవి. త్వరలోనే మా కౌముది కూడా అట్లాగే చిలుకపలుకులతో మమ్మల్ని ఆనందపరుస్తుందని ఆశగా ఎదురుచూసేదాన్ని. ఒక్కోసారి అనవసర మైన అశాంతితో నా మనసు దిగులుతో నిండిపోయేది.

"ఏమిటీ పిల్లింకా మాట్లాడటంలేదు. ఈపాటికి మాటలు వచ్చేయ్యాలే.. మా సుహాస్ ఈ వయసుకి వసపిట్టలా వాగే వాడు. ఏడాది నిండకుండానే ఏవేవో మాట్లాడాలని ప్రయత్నించేవాడు" అంది సుహాస్ తల్లి. ఒకసారి మా దగ్గరికి వచ్చి పాపని పరిశీలించింది. అప్పుడు సుహాస్ అక్కడే ఉన్నాడు. ఆవిడ మాటలకు నా ముఖం పాలిపోయింది. అది గమ నించింది "సరే.. అరవిందకీ అదే బాధ.. నువ్వూ తోడయ్యావా ఇక. ఎందుకమ్మా అది మాట్లాడటం లేదని మీరంత ఆరాట

## కొత్తగాలి...

**చెట్టు నవ్వుతోంది**
**పువ్వులు**
**విరబూసి**

– అనురాధ రామకృష్ణ,
నెల్లూరు

పడుతున్నారు? కొందరు పిల్లలు కాస్త ఆలస్యంగా మాట్లాడతారని డాక్టరు కూడా చెప్పింది" అన్నాడు సుహాస్.

"కావచ్చునేమో.. మరి మనింట్లో మాత్రం పిల్లలందరూ రెండేళ్ళు రాకుం డానే మాట్లాడేవారు. శౌరిగాడు దీనికంటే నాలుగు నెలలు చిన్న. అప్పుడే కిచకిచ మని ఎంతలా వాగుతున్నాడో" అందావిడ. శౌరి అంటే మా ఆడబిడ్డ కొడుకు. మా అత్త తమ కుటుంబంలో పిల్లలెవరికీ ఆలస్యంగా మాటలు రాలేదని చెప్తోంది. వాళ్ళతో నా బిడ్డను పోల్చి చూసుకుం టోంది. 'మీ ఇంట్లోనే కాదత్తయ్యా.. మా ఇంట్లోనూ నేను త్వరగానే మాట్లాడాను' అని చెప్పలేకపోయాను. నేను ఎప్పుడు మాట్లాడానన్నది, నా భర్త బాల్యంలో ఎన్నో ఏట అమ్మ- అత్త అన్నాడన్నది కూడా ముఖ్యం కాదు. నాకు కావాల్సింది కౌముది ఎప్పుడు మాట్లాడుతుందన్నది. నా మనసంతా నీరవమైపోయింది.

"పిల్ల మందంగా ఉంది. ఎప్పుడూ అలా ఉయ్యాలలో వేసి ఉంచకు. కాస్త చేతులు పట్టుకుని అటు ఇటు అడుగులు వేయించు. పిల్లకి నడక, మాట అన్నీ ఈస రికి వచ్చెయ్యాలి" అందామె. పిల్లని ఉయ్యాలలోంచి లేవతీసి "నేనమ్మా... నాయనమ్మని.. చూడు.. చూడు" అని దాని ముఖం దగ్గరగా చిటికెలు వేస్తూ ఆడిస్తోంది. అమ్మని చూశావా..





'అమ్మ..మ్మ..మ్మ..పిలు' అంటోంది పెద్దగా. కౌముది కళ్ళు అటు ఇటు తిప్పి, నన్ను చూసి చిట్టినోరు చప్పరించి, పెదిమలు కదిల్చింది కొద్దిగా. "చూశావా నిన్ను బాగానే గుర్తు పడుతోందంటే... ఫరవా లేదు" అందావిడ. 'ఫరవాలేదా' అంటే ఏమిటి? ఎందుకామాట అన్నారావిడ. బిడ్డ మనుషుల్ని సరిగ్గా గుర్తించలేకపోతోందనుకున్నారా? ఆవిడ పాపను గురించి ఏమనుకుంటుందోనని ప్రశ్నించి తెలుసుకునే ధైర్యం చెయ్యలేకపోయాను.

## జైలు జీవితం



లైబ్రరీలో అందంగా ముస్తాబై ఎవరూ చదవని, నిరుపయోగంగా పడున్న పుస్తకంలా ఉండటం నాకిష్టం లేదు. మీరొక అందమైన పుస్తకంలాంటి వారయితే యూదు కోటీశ్వరుడో కడు మిమ్మల్ని కొనుక్కొని, యూనిఫామ్ తొడిగించి తనవద్దవున్న ఇతర అనేక పుస్తకాలతో పాటు ఉంచితే ఎలా ఉంటుంది? జైలు జీవితం కూడా అచ్చం అలాంటిదే!'

ఆవిడ పాపను పరిశీలనగా చూస్తుంటే ఆ చూపుల్లో ఏదో అనుమానం తోచి వణికిపోయాను. దాని ముద్దుముఖంలో కనపడే మొద్దుతనం.. నిస్తేజం.. మందకొడితనం.. భయాందోళనలకు గురిచేస్తోంది.

కొంతమంది పెద్దవాళ్ళకు, పిల్లల విషయంలో అనుభవంకలవాళ్ళకు కౌముది విషయం- దానిలోని లోపం గురించి పూర్తిగా తెలుసుననే నిజాన్ని నేను గ్రహించిన తరువాత నాకు అర్థమైంది. అప్పుడప్పుడు మనసులోని దిగులు అణచుకోలేక "ఇప్పుడు నేనేం చెయ్యాలి? నా బిడ్డ విషయంలో మీరేమన్నా సలహా ఇవ్వలేరా?" అని అడిగేదాన్ని. వాళ్ళా విషయాన్ని గ్రహించేవారు. అయినా నాకు విప్పి చెప్పటానికి సంకోచించేవారు. ఉన్న వాస్తవం స్పష్టం చెయ్యటానికి వాళ్ళెందుకు వెనకాడేవారో నాకు అర్థం కాలేదు ఎప్పటికీ. కౌముది వాస్తవ స్థితిని చెప్పేస్తే నా వేదన కొంత తగ్గివుండేది. లేనిపోని భ్రమలు కలిగించి, మభ్యపెట్టే తటస్థ వైఖరి కన్నా నిజం చెప్పటమే ఎంతో మంచిదనిపిస్తుంది. ఎందుకంటే నిజం ప్రాణసమానమైంది. నిష్ఠూరమైనా, బాధ కలిగించేదైనా, మనం ఎదుర్కోవటానికి ఇష్టపడనిదైనా నిజం నిజమే. దాన్ని భరించక తప్పదు.

ఆశ నిరాశల మధ్య కాలం గడిచిపోతోంది. నేను పూర్తిగా నిరాశలో కృంగిపోకముందే కౌముది కొద్దిగా మాటలు చెప్పటం ప్రారంభించింది. నాభయం కొంత తీరింది. అప్పట్లో నేను పూర్తిగా అనుభవశూన్యురాలిని. పాప మాట్లాడగలుగుతోందని సంబరపడిపోయాను. కానీ దాని ముఖ కవళికలు నట్టు నట్టు మాటలు అదో రకంగా వుండేవి. అదేం పలుకుతోందో అర్థం చేసుకోవాలని సుహాస్, నేను ప్రయత్నించేవాళ్ళం. ఎక్కువ సమయం నిశ్శబ్దంగా వుండేది. మేం మళ్ళీ కౌముదిని పిల్లల వైద్యుడి దగ్గరికి తీసుకెళ్ళాం. అందువల్ల మాకేమీ

ప్రయోజనం కలగలేదు. ఆయన ఒక సలహా ఇచ్చాడు. "అప్పుడప్పుడు కొద్దిగా మాట్లాడుతోందంటున్నారు కనుక పూర్తిగా మాటలు రావని నిరాశపడకండి. ఎక్కువగా మాట్లాడటం నేర్పండి. అడగకుండా ఏమీ ఇవ్వకండి. కావాల్సింది అడిగే అలవాటు చెయ్యండి" ఈ సలహా నాకు నచ్చింది. అది ఆచరణలో పెట్టసాగాను. తనకు కావాల్సింది అడగటం నేర్పించాలని ప్రయత్నించాను.

ఇందులో భాగంగా ఒకరోజు మధ్యాహ్నం భోజనం అంటే పప్పు నెయ్యి కలిపిన మెత్తని అన్నం గుజ్జు టైం ప్రకారం ఇవ్వకుండా ఊరుకున్నాను. కాసేపటికి ఏడుస్తుందనో, అడుగుతుందనో నా ఊహ. గంటసేపు గడిచినా అది ఏడవలేదు. ఉయ్యాల టాపుకు అది ఆడుకోవడానికి కట్టిన రంగు రంగుల బొమ్మల పందిరి వంక ధ్యాసలేని పెద్దకళ్ళతో అట్టే చూస్తూ మెదలకుండా ఉంది. నేను అటు, ఇటు తిరుగుతూ దాని కదలికలను గమనిస్తున్నాను. దానికి ఆకలి తెలిసినట్లు లేదు. లేకపోతే ఆకలి తెలిసినా దాన్ని వ్యక్తపరచే విధానం తెలియలేదా? ఆకలి తెలిస్తే అడగకపోయినా కనీసం ఏడవన్నా ఏడ్వాలి కదా. అదీ లేదు. మధ్యాహ్న భోజనం పెట్టేవేళ మించిపోయింది. నా మనసు విలవిలలాడింది. ఎంత పిచ్చిపిల్ల. ఆకలిని కూడా వ్యక్తం చెయ్యలేకపోతోందే! నాకు దుఃఖం ఆగలేదు. మూడు గంటలైంది. ఇక నా వెర్రి ప్రయత్నాలతో పసిదాన్ని మాడ్చటం నా వల్ల కాలేదు. నా అంతట నేనే వేళకు కొద్దిగా యాపిల్ గుజ్జు తినిపించి పాలు తాగించాను.

రాత్రి సుహాస్ కంపెనీ నుంచి వచ్చాక ఎంతో బాధతో జరిగిందంతా చెప్పాను.

"సుహాస్! నాకు కౌముది గురించి చాలా భయంగా ఉంది. దానికి ఆకలి కూడా తెలియటంలేదు లాగుంది" అంటుంటే కన్నీరు ఆగలేదు. ఇంతకాలం నా బాధను గుండెల్లోనే దాచుకున్నాను. నా కన్నీరు చూస్తే సుహాస్ తట్టుకోలేక బాధపడతాడని ధైర్యాన్ని, నిబ్బరాన్ని కొని తెచ్చుకునేదాన్ని. ఇక నటించడం నావల్ల కావటంలేదు. "ఊరుకో అరూ.. ఏడవకు.. ఏం చేస్తాం?" అని బరువుగా నిట్టూర్చాడ తను. సుహాస్ మాటల్లో నిరుత్సాహం నన్ను మరింత కృంగదీసింది. 'ఏం చేస్తాం అంటాడేమిటి? ఏమీ చెయ్యలేరా..? కౌముది స్థితిని ఎవరూ మెరుగుపరచలేరా..? చేతులు ముడుచుకు కూర్చోవటమేనా? దీనికి తగిన చికిత్సే లేదా?

"రేపు అమెరికాలో ప్రత్యేక శిక్షణ పొందిన పిల్లల డాక్టరు ఒకరు వస్తున్నారు. రోటరీ హాల్లో ఆయన ప్రసంగం వుంది. మన కౌముదిని చూపిద్దాం" అన్నాడు సుహాస్.

మరుసటి రోజు నేను, సుహాస్ కౌముదిని తీసుకుని కమ్యూనిటి హాల్‌కి వెళ్లాం. సమావేశానికి చాలామంది తల్లిదండ్రులు తమ పిల్లల్ని తీసుకుని వచ్చారు. వాళ్లకీ ఏవో సమస్యలుండవచ్చు. కానీ మా కౌముది వంటి పసివాళ్ళెవరూ అక్కడ నాకు కనపడలేదు. నేను చాలా ఆత్రుతగా హాల్లో తల్లుల ఒడిలో కూర్చుని వున్న ప్రతి పాపనూ పరీక్షగా చూశాను. అసలు నేనిం

### కొత్తగాలి...

**కాడెద్దులు**
**కనపడకేమో..**
**ఒంటెద్దు పోకడలతో**
**విడాకుల్లో యువత..**

–కె.ఆర్.వి.వి.రత్నకుమారి, హైదరాబాద్

## కొత్తగాలి...

**తూరుపు**
**తెల్లారింది**
**ఆశ**
**నిద్రలేచింది**

-ఎస్.శేషగిరిరావు, హైదరాబాద్

తవరకూ అటువంటి చిన్నపిల్లలను నాకు పరిచయమైన సమాజంలో చూడలేదు, ఆ రోజు థియేటర్‌లో చూసిన పిల్లవాడు తప్ప! తరువాత నేను కూడా అందరిలాగే ఆ అబ్బాయి విషయం మరిచిపోయాను. కానీ ఇటీవల మా పాపని చూస్తుంటే నా మనసులో పదే, పదే ఆ పిల్లవాడు గుర్తు కొస్తున్నాడు. కౌముది పరిస్థితి కూడా అంతేనా అన్న ఆలోచన నన్ను వికలం చేస్తోంది. అటువంటి పిల్లలు నూటికి ఒకరో ఇద్దరో బహు కొద్దిమంది తల్లితం డ్రుల దురదృష్ట ఫలితంగా జన్మిస్తుంటారు లాగుంది. అటువంటి దురదృష్టవంతుల్లో నేనూ ఒకదాన్నని వద్దనుకున్నా నాకు తెలుస్తోంది.

డాక్టరు పసిపిల్లలు పుట్టుక, పెరుగుదల గురించి ఎన్నెన్నో విషయాలు తలిదం డ్రులు తెలుసుకోవలసినవి వివరంగా చెప్తుంటే నేను శ్రద్ధగా విన్నాను. మా అమ్మాయిలో పెద్దలోపం దాని పెరుగుద లకు అవరోధంగా వుందని అప్పుడు గ్రహించాను. డాక్టరు ప్రసంగంలో నాకు అర్థం కాని మెడికల్ సైన్సుకు సంబంధిం చిన కొన్ని విషయాలు ప్రస్తావించారు. నేను కొద్దిగా చదువుకున్నప్పటికీ- నా శరీ రతత్వాన్ని నేనే తెలుసుకోలేని చాలామంది అవివేకవంతులైన అమ్మాయిల్లాగే పెరి గాను. తరువాత్తరువాత వయసు పెరిగి అనుభవంవల్ల కొంతమేర విషయం, శరీర సంబంధమైన సమస్యలు కొంతమటుకు గ్రహించగలిగినా విజ్ఞానపరమైన పరి జ్ఞానం అతి తక్కువ. నేనే కాదు మన సమాజంలో చాలామంది తల్లులు ఇలాగే వుంటున్నారు. ప్రభుత్వం మాతా శిశు సంక్షేమ పథకాల ద్వారా స్త్రీలలో చైత న్యాన్ని, అవగాహనను పెంపొందించాలని ప్రయత్నాలు చేస్తున్నా ఆధునిక భావాలు కలవాళ్లు ఏ కొద్దిమందో మేలు పొందుతు న్నారు. చాలామంది ప్రిమిటివ్ స్టేజిలోనే వైద్యపరమైన ప్రయోజనాలను పొందలేని పరిస్థితుల్లోనే వుండిపోతున్నారు.

చిన్నపిల్లల్లో శారీరక, మానసిక వికాసా నికి అవరోధాలని, మనం గ్రహించవలసిన కొన్ని ప్రమాదకర లక్షణాలను ఆయన వివరించారు. నడక రావటంలోనూ, మాటలు రావటంలోనూ సహజ ప్రక్రి యకు విరుద్ధంగా ఆలస్యం కావటం పిల్లల్లో మానసిక వికాసం తగ్గుతుందనుకో వటానికి ఒక కారణం అన్నారు. నంగి, నంగిగా మాట్లాడటం, నడక వచ్చినా కాలు నేలమీద నిలకడగా నిలపలేకపోవటం, బాలెన్సు సరిచేసుకుంటూ నడవలేకపో వటం, అవిశ్రాంతిగా పడుతూ లేస్తూ పరు గులు పెట్టే ప్రయత్నం చెయ్యటం, ఎక్కు వగా నిద్రపోవటం, ఎక్కువగా తినటం, చురుకుదనం చూపలేకపోవటం ఇవన్నీ ప్రమాదకరమైన లక్షణాలని వింటుంటే నా గుండె పూర్తి జారిపోయింది. మా పాప వయసుకి మించి ఏపుగా వున్నా అదంతా శరీర దారుఢ్యంగా అనుకున్నాను. శరీ రాన్ని అదుపులో వుంచలేని మానసిక రో గంగా ఆ మాటలు విన్నాక అర్థం చేసుకో గలిగాను. ఇంతకాలం నాలో నానాటికీ పెచ్చు పెరుగుతున్న ఆందోళన, అశాంతి ఎవరిముందూ వ్యక్తం చెయ్యలేదు. దానిలో అప్పుడప్పుడు నేను గమనించగలి గిన మంచి ఆరోగ్యకరమైన లక్షణాలను

తలచుకుంటూ నా మనసులో మెదిలే భయాన్ని తొలగించుకోవాలని చూసే దాన్ని. కానీ నన్ను నేను ఈ విధంగా భ్రమ పెట్టుకోవటంవల్ల ప్రయోజనం ఏముంటుంది? ఒక అనివార్యమైన క్లిష్ట స్థితిని భరించటానికి తగిన మానసిక స్థైర్యాన్ని మేమిద్దరం అలవరచుకోక తప్ప లేదు.

డాక్టరు అపాయింట్‌మెంట్ తీసుకుని మరునాడు కౌముదిని ఆయన దగ్గరికి తీసుకువెళ్లాం. ఆయన చాలాసేపు పాపను, దాని కదలికలను పరిశీలిస్తూ కూర్చు న్నారు. పిల్ల పుట్టిందగ్గర్నించీ ఎలా వుంది, దాని లక్షణాలెలా వున్నాయి వంటి ప్రశ్న లెన్నో వేశారు. నాకు తెలిసినవన్నీ చెప్పాను. దానిలో నాకు కనపడుతున్న లోపాలు వున్నవి వున్నట్లు నిజం చెప్పటం తప్ప మరేదీ ఇప్పుడవసరం లేదు. ఏదీ దాచకుండా యథార్థ స్థితిని వాళ్లకు వివ రించటం దానికి చెయ్యబోయే చికిత్సకు ఉపకరిస్తుంది. అయితే దానిలో నాకు కని పిస్తున్న కొన్ని మంచి లక్షణాలు, తెలివైన పిల్లే అని ఆశ పుట్టించేవి కూడా కొన్ని వున్నాయి. అవీ చెప్పాను. 'అప్పుడప్పుడు వేళ్ళతో ఆహారం తానే తీసుకుని తింటుంది. ఫ్రాకు వేస్తూ 'చెయ్యి ఎత్తమ్మా' అంటే పైకి ఎత్తుతుంది. రంగురంగుల పువ్వుల్ని, బొమ్మల్ని ఇష్టపడుతుంది. బొమ్మల పుస్తకం చూట్టానికి ఉత్సాహపడు తుంది. కొన్ని కొన్ని బొమ్మలు తరచు చూపించేవి గుర్తుపట్టి చేత్తో వాటి మీద తడుతూ వుంటుంది. అప్పుడప్పుడు మంచి సంగీతం వినిపిస్తే నిశ్శబ్దంగా కూర్చుని వింటున్నట్టే అనిపిస్తుంది. తానుగా నడవ లేదు. చేతులు పట్టుకుని నడిపిస్తే భయం, భయంగా కొన్ని అడుగులు వేస్తుంది. నేను చెప్తున్న విషయాలు వింటూనే, ఆయన బిడ్డను పరీక్షగా గమనిస్తున్నారు. అప్పుడు మా పాప చేతిలో ఒక మెత్తటి కుక్కపిల్ల బొమ్మ వుంది. అది భయపడ కుండా బల్లమీద తండ్రి చేతుల మధ్య కుదురుగానే కూర్చుని వుంది. దాని శరీరం అందంగా, ఆరోగ్యంగా, మృదువుగా కనిపి స్తోంది. అది మనోవికాసం లేని పిల్లగా నాకెప్పుడూ అనిపించదు. ఎక్కడో ఏదో చిన్న లోపం కాలక్రమేణా అదే సర్దుకుం టుందన్న వెర్రి ఆశ నన్ను బతికించేది. ఆయన కౌముదిని చూచి సాలోచనగా తల పంకించాడు. 'బాగానే కనిపిస్తోంది' అన్నాడు మెల్లిగా. ఇంతలో చేతిలోంచి బొమ్మ కిందకు జారిపోయింది. అది అటు చూడలేదు. బొమ్మ తిరిగి తీసుకోవాలని ప్రయత్నించలేదు. అప్పుడాయన పిల్లను తన వడిలో కూర్చోపెట్టుకుని దాని రియా క్షన్స్ గమనించసాగాడు. చాలా ఇనేక్టివ్‌గా వుంది ప్రతిస్పందన. ప్రతిక్రియ దాదాపు లేనట్లే! వాళ్లేం చెప్తారోనని నేను ఉత్కం ఠతో ఎదురుచూస్తున్నాను. పిల్లలోని లోపం ఏమిటో, వాళ్ళేమనుకుంటున్నారో, మేము దాన్ని నార్మల్ ఛైల్డ్‌గా చెయ్యటా నికి ఏం చెయ్యవలసి వుంటుందో ఆ పెద్ద డాక్టరు ద్వారా తెలుసుకోవాలని ఎంతో కోరుకుంటున్నాను. 'వున్నది వున్నట్లు నిస్సంకోచంగా చెప్పమని, దేన్నైనా ఎదు ర్కోవడానికి మేము సిద్ధంగానే వున్నామ'ని సుహాస్ వాళ్లని అర్థించాడు. కాని లోపమే మిటో వాళ్లకూ అర్థమైనట్లు లేదు. లోపం విషయం అటుంచి దాన్ని బాగుచేసే నివా రణోపాయం కూడా వాళ్లేమీ సూచించలేక పోయారు. బిడ్డలో మానసిక పరిణతి ఆగి పోయిందని మాత్రం నిర్ధారణకు వచ్చారు. కానీ ఏ కారణం వలన ఆగిపోయిందో చెప్పటం లేదు.

"గర్భంతో వున్నప్పుడు మీకేమైనా అనా రోగ్యం చేసిందా..? పుట్టిన కొద్దినెలల్లో పిల్లకేమన్నా పెద్ద జ్వరంలాంటిది





కొత్తగాలి...

**గుండె గుప్పెడే**
**మంటే ఆకాశమంత**
**మనసు పిడికెడే**
**లోతే సముద్రమంత**

–డా.ఎం.విజయగోపాల్, విశాఖ

వచ్చిందా..? కిందపడి తలకేమన్నా పెద్ద దెబ్బ తగిలిందా? భార్యాభర్తలిద్దరూ దగ్గర సంబంధీకులా...' లాంటి అనేక ప్రశ్నలు వేశారు. "అటువంటిదేమీ లేదండి. పెద్ద నర్సింగ్ హోంలో మొదటి నుండే పరీక్షలు చేయించుకున్నాను. మంచిది కాదన్నారని జెండర్ టెస్టు కూడా చేయించలేదు. పుట్టిందగ్గర్నించీ పిల్ల ఎంతో ఆరోగ్యంగానే వుంటోంది. చిన్న జ్వరంలాంటిది కూడా ఎప్పుడూ ఎరగదు. పడటం, దెబ్బలు తగలటం ఎప్పుడూ జరగలేదు. డాక్టరుగారూ మా అమ్మాయికేం జరిగింది? ఎందుకిల్లా వుంటోంది? " అన్నాను ఉద్విగ్నంగా.

"దిగులు పడకండమ్మా.. పాప తక్కిన అన్ని విషయాల్లోనూ బాగుంది. మానసిక వికాసంలో ఏదో లోపం వుంది అని మాత్రం తెలుస్తోంది. మీరు స్పెషలిస్టులను కలవండి. లోపమేమిటో, తగిన వైద్య విధానమేమిటో వాళ్లు మాత్రమే చెప్పగలరు" అంటూ కొందరు పిల్లల, మానసిక వైద్యుల పేర్లు, చిరునామాలు మాకిచ్చారు. వాళ్లు మాకెన్నో ఇంతవరకూ మా గ్రహింపునకు రాని విషయాలూ చెప్పారు. మా అమ్మాయి కాన్సన్‌ట్రేషన్ చాలా తక్కువగా, చంచలంగా వుంది. తన వయసు పిల్లలకుండవలసిన దానికన్నా చాలా తక్కువగా వుంది. మెదడు, మనసు ఉపయోగించకుండా కొన్ని దైహికమైన చలన క్రియలు మాత్రమే అప్పుడప్పుడూ చెయ్యగలుగుతోంది. అందంగా వున్న ఆ చూపుల్లో స్థిరత్వం, నిశ్చలత్వం లేకుండా ఒకవిధమైన శూన్యత తోస్తుండేది.

సుహాస్ ముఖంలో ఆందోళన స్పష్టంగా కనిపిస్తోంది. నేను మనసులో భయపడుతున్నదే ఆయన స్పష్టం చేశారు. దాన్ని గురించి నాకు తెలియందేమీ ఆయన చెప్పలేదనిపించింది. అదెలా వుంటోంది- ఏం చేస్తోంది అన్నది కాదు నాకు మళ్ళీ మళ్లీ తెలియచెప్పాల్సింది. దానిలోని లోపాన్ని సరిచెయ్యటం ఎలా అన్నది. దానికా లోపం ఎందుకు ఏర్పడిందో- దాని పేరేమిటో- అందుకు గల వైజ్ఞానిక కారణాలేమిటో నాకు తెలియవు. కాని మా అమ్మాయి అందరు పిల్లల్లా కాక వేరుగా అసహజంగా వుందని గ్రహించాను. "మీ అమ్మాయి మానసికంగా పరిణితి పొందలేదు" అని ఎవరో నాకు చెప్పటం కంటే విషాదం మరేమీ లేదు.

"ఏం ఫరవాలేదు! నేను సెలవు పెడతాను. మంచి స్పెషలిస్టులకీ చూపిద్దాం. వైద్యరంగం చాలా అభివృద్ధి చెందింది. ఎటువంటి రోగానికైనా చికిత్స లభిస్తోంది. అనవసరంగా దిగులుపడి మనసు పాడు చేసుకోకు" అని నాకు ధైర్యం చెప్పాలని ప్రయత్నించాడు సుహాస్. ఆ ముఖంలో నవ్వు మాయమై పేలవంగా వుంది. పాపం అతనూ దిగులు పడుతున్నాడు. అయినా మగవాడు కనుక పైకి ధైర్యం ప్రదర్శిస్తూ నన్ను సమాధానపరచాలని తాపత్రయ పడుతున్నాడు. ఎంత మగవాడైనా అతనికి మనసులో బాధ వుంటుంది కదా! నిజానికి సుహాస్‌కి ఊరట కలిగించవలసిన బాధ్యత నాకుంది. కానీ అదేమీ పట్టించుకునే పరిస్థితిలో నేనే లేను. పగలు-రాత్రి, ప్రతిక్షణం, ఎప్పుడూ నా మనసు కౌముది గురించే మథన పడుతుంది. ఇత

రుల గురించి కాని, సుహాస్ గురించి కాని, అసలు నా గురించి కూడా నేనేమీ శ్రద్ధ వహించలేకపోతున్నాను. గుండె గట్లను తెంచుకుని నాలోని దుఃఖావేశం పెల్లుబికి అతన్ని ముంచెత్తకుండా వుండాలన్న ప్రయత్నంలో నిబ్బరం నటిస్తున్నాను.

కౌముది మానసిక అపరిపక్వత, మంద కొడితనం ఎవరికీ తెలియకూడదనీ, ఇతరులెవ్వరూ దాన్ని గురించి అసహ్యంగా గాని, సానుభూతితో కాని మాట్లాడుకోవటం వినకూడదని నన్ను నేను మభ్య పెట్టుకున్న రోజులు పోయాయి. మేముగా ఎవరికీ చెప్పకపోయినా అందరికీ తెలిసిపోయింది. ఒక సత్యాన్ని, చేదు వాస్తవాన్ని అంగీకరించలేక దాన్నుంచి తప్పించుకోవాలని ఎక్కడికో ప్రపంచానికి దూరంగా నేను, నా కూతురు తప్ప మరో మనిషి కానరాని మూలలకు పారిపోయి తల దాచుకోవాలనే వెర్రి ఆక్రోశం నన్ను ముంచెత్తేది. అనేక రోజులు దానినేకాక, నేను కూడా ఎవరికీ కనపడకుండా బయట ప్రపంచానికి ముఖం చూపించలేని దయనీయ స్థితిలో ఒకమూల గదిలో ముడుచుకుపోయేదాన్ని. సుహాస్ క్యాంపుల కెళ్ళినప్పుడు మా ఇంటి తలుపులు తెరిచేవుండేవే కావు. ప్రేమ-అభిమానం, సంతోషం-దుఃఖం లాంటి భావాలేమి లేని కేవలం క్రియారహితమైన అవయవాలతో, రక్తమాంసాల మూటలా కనిపించే నా పిల్లను హృదయానికి హత్తుకుని, తలుపులు మూసుకుని వంటరిగా రోజులు గడిపేదాన్ని. అప్పుడప్పుడు చిన్న చిన్న శిక్షణలిస్తుండేదాన్ని. దాని నోటి నుండి వెలువడే చిన్న శబ్దమైనా నన్నమితమైన ఆశకు గురి చేసేది. అది నోరు తెరిచి పెదవులు కాస్తా సాగదీసి నావంక తృటికాలం దృష్టి నిలిపితే అమ్మను గుర్తిస్తోందని ఆనందపడిపోయేదాన్ని. ఆ చిన్న ఆశ కోసం రోజుల తరబడి దాన్ని ఎదురుగా కూర్చుని చూస్తూ వుండేదాన్ని. కానీ ఈ ప్రశాంతత... దీన్ని నేను ప్రశాంతతగానే భావించేదాన్ని. నిర్నిరోధమైన ఏకాంతంలో ఎక్కువకాలం బిడ్డ సన్నిధిలో దానికి అమ్మ ఉనికిని తెలియ చేస్తూ నా ప్రేమని అర్థం చేసుకునే అవకాశాన్నిస్తూ గడపటం నా ప్రథమ కర్తవ్యంగా భావించాను. కాసేపు నేను ఎడమైతే దగ్గరలేనని గ్రహించి దిగులు పడుతుందేమో. పిలిచి, అరిచి, ఏడ్చి తన అవసరాన్ని చెప్పుకోలేదాని తపన పడేదాన్ని. అయితే ఎప్పుడూ నాకీ అవకాశం దొరికేది కాదు. సుహాస్ ఇంట్లో వున్నప్పుడు అతని పనికి సంబంధించిన మిత్రులు, పరిచయస్థులు, ఇతర ఇంజనీర్లు, కాంట్రాకర్లు ఎవరెవరో వస్తూ పోతుండేవారు. వారికి కాఫీలు, మరీ ముఖ్యమైన వారైతే లంచ్ కూడా ఏర్పాటు చెయ్యవలసివచ్చేది. పూర్వం నేను అటువంటివన్నీ చాలా ఇష్టంగా, సరదాగా చేసేదాన్ని. ఇప్పుడు ఇరవైనాలుగ్గంటలు కౌముదిని విడవకూండా వుండాలనుకుంటున్నానే తప్ప ఇల్లాలి అతిథి సత్కారాలలోను, మర్యాదలు పాటించటంలోనూ మనసు పెట్టలేకపోతున్నాను. అయినా సుహాస్ కోసం కొన్ని మర్యాదల్ని బలవంతాన నెరవేర్చేదాన్ని. అ సమయంలో నా మనసు మరింత అశాంతికి లోనయ్యేది. వచ్చిన వాళ్ళు కొంత కౌముది గురించి విని వుండేవారేమో- ఇంట్లోకి వస్తూనే "ఏదీ మీ బేబిని చూడనివ్వండి" అంటూ చనువుగా అది వున్న గదిలోకి వచ్చేసేవారు. కొత్తలో ఎవరన్నా మా ఇంటికి వస్తున్నారంటే కౌముదిని కాస్త ప్రత్యేకంగా తయారుచేసేదాన్ని. మంచి డ్రెస్ వేసి, పౌడర్‌పూసి, తలదువ్వి నీటుగా వుంచేదాన్ని. అందువల్ల దానిలోని లోపం మరీ కొట్టవచ్చేట్లు కనపడకుండా వుంటుందన్న అవివేకం నాలో

**కొత్తగాలి...**

**అందలమెక్కిస్తోంది**
**ఆడపిల్ల**
**ఆహుతి చేస్తోంది**
**అగ్గిపుల్ల**

– మేడిచర్ల సూర్య ప్రకాశరావు,
రామరాజులంక

వుండేది.

రోజు దాని గురించి శ్రద్ధ పెట్టనని కాదు. కాలానికి తగినట్లు లేత రంగు నేత అంగీలాంటివి, ఎక్కువ బరువులేనివి, కుట్లు, అల్లికలు, ఆర్భాటాలు లేనివి, సౌకర్యంగా వుండేవి వేసేదాన్ని. ఎక్కువగా రిబ్బన్లు అవీ కట్టి అలంకరించకుండా సాదాగా వుంచేదాన్ని. కాని ఇంటికి ఎవరన్నా వస్తున్నారంటే సహజంగానే మా అమ్మాయి వాళ్ల కంటికి ఆరోగ్యంగా, ముద్దు పాపలా కనిపించాలని కోరుకునే దాన్ని. వాటివల్ల ఉపయోగమేముంది? వాళ్ళు నేలమీద బొమ్మల మధ్య చేష్టలుడిగి కూర్చుని వున్నప్పుడో, మంచం మీద అశాంతిగా పొర్లుతూ కన్నీరు కారుస్తున్నప్పుడో, అర్థంలేని అరుపులు అరుస్తూ అసహజంగా ప్రవర్తిస్తున్నప్పుడో దాన్ని చూసేసేవారు. వెంటనే 'గాడ్.. పూర్ గర్ల్' అని బరువుగా నిట్టూరుస్తూ, గదిలో దాని ఎదుట నిలవలేనట్టు విషణ్ణ వదనాలతో బయటికి వచ్చేసేవారు. కొందరు దాన్ని పలకరించాలనీ, నవ్వించాలనీ ప్రయత్నించేవారు. బిస్కట్ పాకెటో, ఆట వస్తువో, ఫ్రాకో, ఏదన్నా చిన్న బహుమతో తీసుకోమని ఇస్తుండేవారు. దానికి తీసుకోవటం తెలిసేదికాదు. కాసేపు చేతిలో వుంచాలని చూసి చేతకాక ఒడిలోనే పక్కమీద వుంచేవారు. దాని దృష్టిని ఏదీ ఆకర్షించలేకపోయేది. ఇదంతా చూసేవాళ్ళకి చాలా బాధ కలిగించేది. ఆ జాలి చూపులు, నిట్టూర్పులు తప్పించుకోవటానికి అక్కడ్నించి వెళ్ళిపోయేదాన్ని. ముందు ముందు ఎవరన్నా దాని పరిస్థితిని మెరుగుపరిచే మంచి సూచన, సలహా అనుభవం మీద చెప్పగలరేమో.. వాళ్ళ రాకవల్ల మాకేమన్నా మేలు జరుగుతుందేమోనన్న ఆశతో అక్కడే నిలబడి వాళ్ల మాటలు వింటుండేదాన్ని. వాళ్లు అడిగే ప్రశ్నలకు సమాధానం చెప్తుండేదాన్ని ఓపికగా. వారి వల్ల మాకేమి ప్రయోజనం లేదని తెలిపోయాక నేను మా పాప స్థితిని గురించి అమాయకంగా ఇతరులకు చెప్పటం తగ్గించాను. దానితోపాటే నేను బయటివాళ్ళతో సంభాషించటం తగ్గింది. షికార్లు, సినిమాలు, పార్టీలు, స్నేహితులు, అన్ని వ్యాపకాలు వెనుకపడ్డాయి. ఏ పనిలోనూ ఉత్సాహం, కుతూహలం చూపలేకపోయేదాన్ని. మనస్సంతా అశాంతితో నిండివుండేది. అందమైన, ఆరోగ్యకరమైన, పువ్వులాంటి పిల్లలతో తల్లితండ్రులు తిరుగుతుంటే తెలియని అపరాధ భావంతో, వేదనతో నా మనస్సు కృంగిపోయేది. ఎవరన్నా మా ఇంటికి రావటం కూడా ఇష్టపడేదాన్ని కాదు. ఇదంతా నా మనోలోకం. కానీ సుహాస్ ఈ పరిస్థితిని సహజంగానే తీసుకుంటున్నట్టు కనిపించేవాడు. ఒక్కోసారి భరించలేక 'ఎందుకు సుహాస్ వాళ్ళకవన్నీ చెప్తావు? ఎందుకు వాళ్ళకి మన సమస్య చెప్పడం' అనేదాన్ని, బాధను కోపంగా మార్చుకొని.

వాళ్ళు మంచి మనసుతో అడుగుతున్నారు. మనల్ని బాధించాలని కాదు.. ఇతరులను హేళన చేసేవాళ్ళు, ఇబ్బందుల్లో వుంటే చూసి వికృతానందం పొందే వాళ్లు, ఇతరుల వ్యవహారంలో జోక్యం కల్పించుకుని అనవసర కుతూహలం ప్రదర్శించి ఇబ్బంది కలిగించేవాళ్ళు కొద్దిమంది

# అజ్ఞాత దాత



అమెరికాలో ఐయోవా రాష్ట్రానికి చెందిన షెల్లా అనే ఊళ్లోని డాక్టర్ సలామి కేఫ్‌కు 2007లో ఓ గురువారంరోజు భోజనానికి అలిస్సా, తన భర్త బెర్రీతో వెళ్లింది. ఒకతను వీరి దగ్గరకు వచ్చి మాట్లాడసాగాడు. వాళ్లకి పిల్లలు ఉన్నారా? అని ప్రశ్నించాడు. రెండేళ్ల బిడ్డ ఉన్నదని తెలుసుకుని అతను జేబులోంచి ఓ చెక్‌బుక్‌ను బయటకి తీసి సంతకం చేసి ఆ బ్లాంక్ చెక్‌ను వారి ముందు ఉంచి చెప్పాడు-

"మీ ఇష్టమొచ్చిన అంకెను దీన్లో నింపుకుని డబ్బులు తీసుకోండి".

వారిద్దరూ అతడు జోక్ చేస్తున్నాడు అనుకున్నారు. సరదాకు ఆ చెక్‌లో లక్ష డాలర్ల అంకెను నింపి అతడికి చూపించాడు బెర్రీ.



"నా అకౌంట్‌లో ఇంకా ఎక్కువ మొత్తమే ఉంది. కానీ మీరా చెక్‌ను కేష్ చేసుకోవడానికి కొన్ని షరతులు వర్తిస్తాయి" అని వాటిని అతను వాళ్లకి చెప్పి, వాళ్ల బిల్లు తనే చెల్లించి వెళ్లిపోయాడు. మర్నాడు దాన్ని వాళ్లు బేంక్‌లో డిపాజిట్ చేయాలో వద్దో, తేల్చుకోలేకపోయారు. అది ప్రాక్టికల్ జోక్ అయి ఆ చెక్ వెనక్కు వస్తే ఏభై డాలర్ల ఫైన్ బేంకుకి కట్టాలి. అయినా అదృష్టాన్ని పరీక్షించుకోవాలనుకుని బెర్రీ ఆ చెక్కును తన అకౌంట్‌లో అపనమ్మకంగానే డిపాజిట్ చేశాడు. ఆశ్చర్యంగా లక్ష డాలర్లు అతడి అకౌంట్‌లో క్రెడిట్ అయ్యాయి.

ఈ సంగతి లోకల్ దినపత్రికలో వార్తగా వచ్చాక 'గుడ్ మార్నింగ్ అమెరికా' టీవీ ప్రోగ్రాంలో వాళ్లను ఇంటర్వ్యూ చేశారు. యాంకర్ గర్ల్ అడిగిన కొన్ని ప్రశ్నలకు సమాధానంగా వాళ్లు చెప్పిన జవాబులు ఇవి:

"ఆ డబ్బును ఇచ్చినతడి పేరు, వివరాలు బయటకు వెల్లడించకూడదని నియమం పెట్టాడు కాబట్టి చెప్పలేం. అయినా అతడి గురించి మాకు తెలిసింది తక్కువే. అతడి వయసు ఏభై పైనే. మా ఊరు మీదుగా కారులో వెళ్తూ అతను దారిలో మేం భోజనం చేసే రెస్టారెంట్‌లో భోజనానికి ఆగాడు. గతంలో కూడా అతడు ఇలా అనేకమంది కొత్త వ్యక్తులకు చెక్కులు ఇచ్చాడు. వారిలో ఎవరూ మాలా అంత పెద్దమొత్తం నింపలేదు. వాల్‌మార్ట్(సూపర్ బజార్ పేరు) బయట సరుకులతో నింపిన తోపుడు బండితో నిలబడి దాన్ని ఎవరికైనా బహుమతిగా ఇవ్వడం తన హాబీ అని చెప్పాడు. ఓసారి కొత్తవాళ్లకు కారును కూడా కొనిపెట్టానని చెప్పాడు. తనకు మనవళ్లు లేరని, కాబట్టి మాకు పుట్టబోయే బిడ్డ మగపిల్లాడయితే అతని పేరు పెట్టమని వినతించాడు"

ఆ అజ్ఞాత దాత దాతృత్వం వాళ్లకు ఇచ్చిన ఆ చెక్‌తో ఆగలేదు. వాళ్లకు సర్వ్ చేసిన వెయిట్రెస్‌కు వంద డాలర్లు టిప్‌గా ఇచ్చాడాయన.

ఈ సమాజంలో వుండివుండవచ్చు. కానీ మానవుల మంచితనంపట్ల మనం నమ్మక ముంచాలి. ఇతరుల కష్టానికి నిష్కల్మ షంగా స్పందించేవాళ్ళు ఎందరో వున్నారు. ఎందుకు మనం అందరికీ దూరంగా పోవాలి? నువ్వు నెగిటివ్‌గా ఆలోచించటం మానుకోవటం మంచిది. అని కాసేపు ఉపన్యాసం ఇచ్చేవాడు సుహాస్.

సుహాస్ మాటల్లోని వాస్తవం కూడా తరువాత కాలంలోనే నేను గ్రహించాను. కుబుద్ధితో ఇతరుల సమస్యలకు ఆనం దించే శాడిస్ట్ స్వభావం గలవాళ్ళు కొందరు వుంటే వుండచ్చు. కానీ ఇతరుల కష్టాలకు మనఃపూర్వకంగా సానుభూతి చూపేవారు ఎందరో వుంటారు. కాని ఒక్కో మానసిక స్థితిలో ఆ నిజాయితీని మనం సందేహిం చటం కూడా సహజంగానే జరుగుతుంది. మనిషిలోని ఈ మంచితనమే క్లిష్ట సమ యంలో మనకు కొంత ధైర్యాన్ని కలిగిస్తుంటుంది.

మా అమ్మకు, నాన్నకు నేనొక్కతెనే సంతానం. వాళ్ళ కుటుంబం చాలా పరిమి తమైంది. ఇప్పుడు అమ్మ కూడా లేకపోవ టంతో నాన్న ఒంటరివారైపోయారు. ఎప్పుడో ఒకసారి వచ్చి మమ్మల్ని పలక రించి వెళ్ళిపోయేవారు. 'మీ అమ్మ అదృష్ట వంతురాలమ్మా. ఇదంతా చూడకుండా వెళ్ళిపోయింది' అనేవారు పాపను చూసి దిగులుగా. కానీ సుహాస్ కుటుంబం పాడి కుండలాంటిది. అతని తోడపుట్టినవాళ్ళు, వాళ్ళపిల్లలతో నిండుగా వుండేది. ఎవరో ఒకరు అక్కడ్నించి తరచు పాపను చూట్టా నికి వస్తుండేవారు.

కౌముదిని వేసుకుని మా యాత్ర ప్రారంభమైంది. సుహాస్ లాంగ్ లీవ్ తీసుకున్నాడు. అప్పటికింకా ఆశ పూర్తిగా చావని రోజులు. బిడ్డకు బాగు చెయ్యగల డాక్టరు ఎవరో ఒకరు, ఎక్కడో అక్కడ తప్పక వుండి తీరుతాడన్న నమ్మకంతో దేశం నలుమూలలా పిల్లను తీసుకుని తిర గసాగాం. ఇందువల్ల ఫలితం ఎలా వున్నా మాలాంటి దురదృష్టవంతులు, మా కన్నా మరీ అదృష్టవంతులైన కొందరు పేరెం ట్స్‌ని కలుసుకోగలిగాం. అందులో చాలా మంది నిర్ధనులు. కొందరు నిరక్షరాస్యులు కూడా! ఎవరో ఇచ్చిన సలహా పట్టుకుని అందినంత అప్పుచేసి పిల్లను తెచ్చి డాక్టరు కాళ్ళమీద పడేసేవారు. వాళ్ళు మా కంటే అనుభవశూన్యులు, అజ్ఞానులు. డాక్టరంటే కేవలం దేవుడని, ఆయన కనికరిస్తే చాలు పిల్లాడికి నయమైపోతుందని అమాయ కంగా అనుకునేవారు. డాక్టరు మంచివాడు కావచ్చు, చెడ్డవాడు కావచ్చు. ఏదో వెర్రి ఆశతో వాళ్ళ చుట్టూ తిరుగుతూంటారు. ఏమైనా ఆశ చావదు. వారి ప్రయాణం ఆస్పత్రి మెట్లు ఎక్కేదిగా దిగేదిగా సాగు తూనే వుంటుంది సర్వశక్తులూ ఉడిగిపో యేవరకూ.

మేం కూడా ఓపికున్నంతవరకూ అలాగే స్పెషలిస్టుల చుట్టూ తిరుగుతూనే వున్నాం. ఏ డాక్టరు కూడా పిల్లకు నయం కాదని స్పష్టంగా చెప్పేవారు కాదు. అందు వల్ల ఏదో ఆశ చిగురిస్తూనే వుండేది. "పూర్తిగా నయంకాదని చెప్పలేం. ఛాన్సెస్ వున్నాయి. కాని చాలాకాలం తీసుకోవచ్చు' ' అనేవారు కొందరు. ఈ మాటలు ఎవరి లోనైనా ఆశలు రేకెత్తించేవిగానే వుండేవి. ఆరిపోతున్న జ్వాల గాలికి భగ్గుమన్నట్లు, అణగారిపోతున్న ఆశ మళ్ళీ రగిలేది. స్పెషలిస్టు ఇచ్చిన రిపోర్ట్సు దగ్గర వుంచు కుని సంవత్సరాల తరబడి తిరుగుతూనే వున్నాం. వాళ్ళు కూడా తమ అసహాయత వ్యక్తం చేస్తూ మరెవరో ప్రముఖ పిల్లల వైద్య నిపుణుడి దగ్గర సంప్రదించ మనేవారు. మళ్ళీ కొత్త ఆశతో ఇంకో ఆస్ప

## కొత్తగాలి...

**తలొంచుకున్నప్పుడు**
**మెడతాడు**
**ఎత్తినప్పుడు**
**అదే ఉరితాడు**

-బద్ధి నాగేశ్వరరావు, అనకాపల్లి

త్రికి, ఇంకో నిపుణుడి దగ్గరకు వెళ్లేవాళ్లం.

సుహాస్‌కి కుదరనప్పుడు అతని తమ్ముడో, తండ్రిగారో మాతో వచ్చేవారు. వాళ్ళందరూ కూడా పాపస్థితికి అమితంగా వ్యథ చెందుతూ వుండేవారు. కౌముదితో వ్యవహారం చాలా సున్నితంగా వుండేది. వాళ్ళెంత దగ్గరి వాళ్ళైనా.. వాళ్లు మాతో ఆసుపత్రికి తిరగటం నాకు ఇష్టమయ్యేది కాదు. 'తల్లిగా తండ్రిగా మాకు తప్పదు. ఇతరులెందుకీ విషాద వాతావరణంలోకి రావటం' అనుకునేదాన్ని. సుహాస్ ఆలోచనలు మరోలా నాకు అసంతృప్తిని కలిగించేవిగా వుండేవి.

"నువ్వు ప్రతీ చిన్న విషయానికీ అతిగా ఆలోచిస్తావెందుకు? వాళ్ళేమన్నా పరాయి వాళ్ళా.. ఈ ఏడాదిలో నా సెలవులు ఎంత వ్యర్థమయ్యాయో నీకేమన్నా తెలుసా? నాకు రావలసిన కాంట్రాక్ట్స్ చాలా పోయాయి. హెవీ లాస్! ఎంత వర్క్ పాడైంది!" అనేవాడు. నా మనసు రగిలిపోయేది. అతను వాడిన పదాలు నన్ను అమితంగా బాధించేవి.

"ఏమిటి.. వ్యర్థమైందా? దాని ఆరోగ్యం కంటే నీకు నీ పనీ, సంపాదనే ఎక్కువా? కాంట్రాక్ట్స్ పోయాయి.. రాబడి తగ్గిపోయిందనే తప్ప దానికి బాగవ్వటం లేదన్న దిగులు నీకేమన్నా ఉందా.. తండ్రిలా ఆలోచిస్తున్నావా నువ్వసలు!" అని అరిచేదాన్ని.

సుహాస్ నా ఆరాటాన్ని అర్థం చేసుకున్నా ఈ నిరంతర అశాంతిని ఓరిమితో సహించే శక్తిని కోల్పోయి తనూ పెద్దగా అరిచేవాడు. "ఆc.. నేను తండ్రిని కాను.. నువ్వే తల్లివి. డబ్బు లేకుండా మనమేం చెయ్యగలమో నీకేమన్నా అర్థమవుతోందా? ఎన్ని లక్షలు ఆస్పత్రి పాలు చేస్తున్నామో తెలుస్తోందా? "

"పిల్ల వైద్యానికి డబ్బు ఖర్చవుతోందని ఆలోచిస్తున్నావా? నీకు అది బరువైపోయిందా? " అని ఏడుస్తున్న కౌముదిని ఎత్తుకుని అక్కడ్నించి వెళ్ళిపోయేదాన్ని. ఈ ప్రపంచమంతా నాకొక శత్రుకూటమిలా తోచేది. నిస్సహాయ వేదనతో మనసు రగిలిపోయేది.

కాస్త మనసు శాంతించిన తరువాత సుహాస్ మాటల్లోని వాస్తవం అర్థమయ్యేది. 'నిజమే, డబ్బు లేకపోతే ఏం చెయ్యగలం? కౌముదిలో లోపం బయటపడిన దగ్గర్నించీ సుహాస్ వెనుకాడకుండా ఎంతెంత డబ్బు వైద్యం కోసం వెదజల్లుతున్నాడో చూస్తూనే అన్నేసి మాటలెలా అనగలిగాను? పాపం నా మాటలకు ఎంత నొచ్చుకున్నాడో' అని పశ్చాత్తాపపడేదాన్ని.

కౌముదిని చూడటానికి అప్పుడప్పుడు సుహాస్ కుటుంబ సభ్యులు వస్తుండేవారు. సుహాస్ తమ్ముడు సుభాష్, అతని భార్య, ఇద్దరు పిల్లలు- సుహాస్ చెల్లెలు సునీత, ఆమె పిల్లవాడు ఎక్కువగా వస్తుండేవారు. వాళ్ళ పిల్లలు కౌముదితో ఆడుకుంటే దానికి కాస్త ఉత్సాహంగా వుంటుందని నేను అనుకునేదాన్ని. సునీత కొడుకు తప్ప సుభాష్ పిల్లలిద్దరూ ఇంచుమించు కౌముది ఈడువారే. వాళ్ళెంత చక్కగా, బంతుల్లా తుళ్ళుతూ ఆడుతూ వుండేవారు.

వాళ్ళముందు మా పాప వికృత రూపం మరింత స్పష్టంగా, అసహ్యంగా కనిపిస్తుండేది. పిల్లలు కల్మషం ఎరుగనివాళ్ళు.

కౌముదిలోని అసహజత్వం వాళ్ళకి అర్థం కాకపోయినా- దాన్ని జాలిగా, దయగా చూస్తుండేవారు. వాళ్ళు కౌముది దగ్గర వున్నంతసేపు వాళ్ళ తల్లులు వాళ్ళని కని పెట్టుకుని, అక్కడే అంటిపెట్టుకుని వుండే వారు. మా అమ్మాయి వాళ్ళ పిల్లల్నేం చేస్తుందోనన్న వెరపు వాళ్ళ కదలికల్లో కని పిస్తుండేది. అది కాస్త కదలితే చాలు చప్పున తమ పిల్లల్ని వెనక్కు లాక్కునే వారు.

నిజానికి కౌముది పిల్లల్ని కొట్టటం, మీదపడి పీకటం, కొరకటంలాంటి పిచ్చిచే ష్టలు ఏమీ చెయ్యదు. ఒక్కొక్కసారి ఏదో చెప్పాలని పెద్దగా మాటల స్వరూపం లేని అరుపులు అరుస్తుంది. ఇప్పుడిప్పుడే నేను ఆ అరుపుల్లోని అర్థాన్ని కొద్దిగా తెలుసుకో గలుగుతున్నాను. భాషలు తెలియని ఆది మానవులు తమ భావవ్యక్తీకరణకు అరు పులు, కూతలు, సైగలు వంటివాటిని ఆశ్ర యించేవారని విన్నాం. మా అమ్మాయి భావప్రకటన తీరు అదేవిధంగా వుండేది. పోనీలే కనీసం ఏదో చెప్పటానికన్నా ప్రయత్నించగలుగుతోందని మేము సంతృప్తి చెందేవాళ్ళం. కాని కొత్తవాళ్ళకి అదంతా పిచ్చితనపు చేష్టల్లా కనిపించి- భయపడుతుండేవారు. చిన్నపిల్లలు సరే.. పెద్దవాళ్ళు కూడా. కళ్ళు పెద్దవి చేసి.. వెనక్కిపోతూ.. "అమ్మో.. కరవదు కదా.. ఎలా అరుస్తోందో" అని గొణుక్కోవటం నాకు బాధ కలిగించేది.

వచ్చిన బంధువులకి పనిమనిషి సాయంతో వంటలు ఏర్పాటు చేస్తున్నాను. వాళ్ళు నలుగురు పెద్దవాళ్ళు, వాళ్ళ పిల్లలు ముగ్గురితోపాటు మేమున్నాం. నా సమ యమంతా కౌముది సంరక్షణలో సరిపో తుండటంతో వంటకు ఎక్కువ ప్రాముఖ్యా మివ్వటం తగ్గిపోయింది. సుహాస్ ఇంట్లో వున్నప్పుడు మాత్రమే కాస్త శ్రద్ధగా నాలుగు రకాలు చేసేదాన్ని. లేకపోతే

## కొత్తగాలి...

**నాకు ఇల్లు**
**'పథకం'లో వచ్చింది**
**వాడికి**
**'పథకం ప్రకారం' వచ్చింది!**

-శైలూషి, శ్రీకాకుళం

సమయానికి ఆకలి తీర్చుకోవటమే! ఇంటికి బంధువులు వచ్చినప్పుడు అలా బాగుం డదు కదా! అందువల్ల ఆరోజు ఉదయం నుండే నేను ఎక్కువ సమయం వంటగ దిలో పనిలో వున్నాను. ఉదయమే కౌము దికి స్పాంజి బాత్ చేయించి, తల దువ్వి తేలిగ్గా వుండే గౌనేసి, పాలుపట్టి బొమ్మల మధ్య పడుకోపెట్టి, అతిథుల పనిలో ప్రవే శించాను. మా తోటికోడలు, ఆడపడుచు వంటగదిలో నా దగ్గర చేరి కబుర్లు చెబు తున్నారు. వాళ్ళందరి మనసుల్లోనూ కౌముది ఒక నల్లని విషాదచ్ఛాయలా ఆవరించి వుంటుందనుకుంటా. మా ఇంటికి వచ్చి మమ్మల్ని చూసేసరికి ఎవరి ముఖాల్లోనూ నవ్వు కనపడదు. ఏదో దించుకోలేని భారం మోస్తున్నట్టు బరు వుగా నిశ్వసిస్తుంటారు. మగవాళ్ళు సుహా స్‌తో దాని ట్రీట్‌మెంట్ గురించి అడిగి తెలుసుకుంటుంటారు. వాళ్ళ హావభా వాలు, సానుభూతి మాటలు, జాలిచూ పులు నా హృదయంలోని వేదనను పదిం తలు చేసేవి.

"మావారి కొలీగ్ ఒకాయన వున్నాడు. వాళ్ళబ్బాయి ఇంతే.. మన కౌముదిలా గానే.. పెద్దవాడు, పది పన్నెండేళ్ళుం టాయి. ఏం చేస్తాడో, ఎప్పుడెలా ప్రవర్తి స్తాడో వాడికే తెలియదు. చాలా బలంగా

వుంటాడు, పిచ్చి బలమట! పిచ్చివాళ్ళు అల్లాగే రాక్షసబలంతో వుంటార్ట.. ఒక్కోసారి వీధిలోకి వచ్చేసి అందర్నీ కొట్టేస్తుంటాడు. కరుస్తాడు కూడా! రాత్రింబవళ్ళు జంతువులా అరుస్తుంటాడు. ఆ అరుపులు వింటే చాలు గుండెలు గడ్డకట్టుకుపోతాయి" సునీత భయపడుతున్నట్లు కళ్ళు మిటకరిస్తూ చెప్తోంది.

"నువ్వు చూశావా కుర్రాడ్ని" అడిగింది మా తోటికోడలు.

ఈ సంభాషణ వినకూడదని ఏదో పని చేసుకుంటున్నాను. అయినా ఆ మాటలు విషంపూసిన బాణాల్లా నా గుండెల్ని తాకుతున్నాయి. 'ఎందుకిప్పుడీ మాటలు..' అని వాళ్ళను వారించటానికి మర్యాద, సంస్కారం అడ్డు వస్తోంది. వాళ్ళు ఫలహారాలు పూర్తిచేసి కాఫీ తాగుతున్నారు.

"ఆc.. వెళ్ళకేం...! అసలు నాకు అలాంటి పిచ్చి పిల్లల్ని చూడాలంటే చచ్చే భయం.. హారిబుల్.. కాని ఈయన వదుల్తారా.. వాళ్ళ కొలీగ్ కదా! ఒక్కసారన్నా వెళ్ళి చూసి రాకపోతే బాగుండదని గోల చేసి తీసుకెళ్ళారు" గడగడ కాఫీ తాగేసి ఆయాసపడుతూ కప్పు బల్లమీద వుంచింది సునీత.

"ఊc .. ఎల్లా వున్నాడప్పుడాపిల్లాడు?" ఆ కుర్రాడి దౌర్భాగ్యస్థితిని మరీ మరీ తెలుసుకోవాలన్న పైశాచిక కుతూహలం..

"ఎలా వుంటాడు పాపం.. ఏదో పసరు మందు పోయిస్తున్నారట. ఆస్పత్రుల చుట్టూ తిరిగి తిరిగి వున్నదంతా వదుల్చుకున్నాక తెలిసింది. అది తగ్గే రోగం కాదని! ఎవరో మూలిక వైద్యానికి తగ్గుతుందని చెప్పారు. ఇక అందులోకి దిగారు. కాళ్ళు చేతులు గొలుసులతో కట్టేసి ముక్కుల్లో పసరు పోస్తుంటే అబ్బ.. భయం కొరమనుకో.. వాడి ఏడుపు.. అరుపులు.. పాపం.. బోనులో బంధించి వున్న మృగం బాధతో బయటపడలేక అరుస్తున్నట్టే.. నా గుండె లదిరిపోయాయి. క్షణం అక్కడ నిలవలేకపోయాను. అమావాస్య, పౌర్ణమలకు మరీ ఎక్కువవుతుందట పిచ్చి. పాపం ఇంటిల్లిపాదీ ఆ పిచ్చిపిల్లాడితో ఎంత అవస్థపడుతున్నారో వదినా! వాడ్ని చూస్తుంటే నాకు మన కౌముదే గుర్తు వచ్చిందనుకో.. పాపం.. ఎంత దిగులనిపించిందో."

నేను చర్రున వెనక్కి తిరిగి "ఏం ఆ పిల్లాడ్ని చూస్తే నీకు మా పాప ఎందుకు గుర్తు రావాలి.. అదేం పిచ్చి పిల్లకాదే!" అని వెర్రి ఆవేశంతో పెద్దగా అరిచాను. క్షణంలో నా తీరు మారిపోయింది. సభ్యత, సంస్కారం, తెచ్చిపెట్టుకున్న

## గణిత బోధన



యూనివర్సిటీల్లో గణితాన్ని బోధన వృత్తిలోనివారికోసం చెబితే, వారు కూడా దాన్ని మళ్లీ అలాంటి విశ్వవిద్యాలయాల్లోనే బోధించేవారికోసం చెబుతుంటారు. ఈ చక్రభ్రమణం ఎలాంటి మార్పు లేకుండా ఇలాగే కొనసాగుతుంటుంది. అయితే అరుదుగా ఈ భ్రమణం నుంచి విడిపడ్డ సందర్భాలూ కనిపిస్తుంటాయి. ఆర్కిమెడిస్ గణితాన్ని రోమన్లను చంపేందుకు ఉపయోగించాడు. గెలీలియో టస్కనీ సైన్యానికి ఉపయోగపడే ఆయుధాలకోసం, అలాగే ఆధునిక భౌతిక శాస్త్రవేత్తలు మానవాళిని రూపుమాపేందుకు దాన్ని ఉపయోగించారు. అందువల్లనే సాధారణ ప్రజలు దీన్ని రాజ్యం మద్దతుగల శాస్త్రంగా భావిస్తుంటారు అని ఓ సమావేశంలో సరదాగా చెప్పాడు రస్సెల్.

సంయమనం వీగిపోయి తుఫానులో చిగురుటాకులా నా శరీరం కంపించిపోయింది. కళ్లు ఎరుపులెక్కి మాట కీచుగా గద్గదికంగా మారిపోయింది. "మీరెందుకు వచ్చారిక్కడికి? ! ఇటువంటి సానుభూతి మాకవసరం లేదు! ఎవరితో ఎప్పుడు ఎలా మాట్లాడాలో తెలియనివాళ్లు మీరు.. ఇందాకట్నించి వింటున్నాను. గ్రహించరేం.. మా ఇంట్లో ఎవరో పిచ్చి కుర్రాడి విషయాలెందుకు వర్ణించి వర్ణించి చెప్పటం.. ఎక్కడ ఏం మాట్లాడాలో తెలియదా సునీతా మీకు.." అంటూ పెద్ద గొంతేసుకుని విరుచుకుపడ్డాను.

ఈ అరుపులకి బయట లాన్‌లో కాఫీ తాగుతూ కబుర్లు చెప్పుకుంటున్న మగవాళ్లు గలగల లోపలికి వచ్చారు. సునీత వాళ్లు అనుకోని సంఘటనకు బిత్తరపోయారు. నేనిలా అకస్మాత్తుగా అవుట్ బరస్ట్ అవటం వాళ్లందరికీ భయాన్ని, విస్మయాన్ని కలిగించింది. ఎందుకంటే నేను చాలాసాఫ్టుగా, నెమ్మదిగా వుంటాను. పెద్దగానే కాదు, ఎక్కువగా మాట్లాడటం కూడా నా స్వభావానికి విరుద్ధం.

"ఏం జరిగింది అరూ.. ఎందుకంతగా అరిచావు!? " సుహాస్ నా ముఖం చూసి బిత్తరపోతూ "ఆర్ యూ ఆల్ రైట్..? " అన్నాడు. తీవ్రమైన భావావేశంతో నేను నిలువెల్లా వణికిపోతున్నాను. నాకే తెలియని విధంగా కళ్లలోంచి నీళ్లు కారిపోతున్నాయి. "అరూ.." అంటూ సుహాస్ నా భుజంమీద చెయ్యేసి నన్ను మామూలు మూడ్‌లోకి తీసుకురావాలని ప్రయత్నిస్తున్నాడు. క్షణకాలం తరువాత నేను తెప్పరిల్లాను. ఆ మూడ్‌లోంచి తేరుకుని నిశ్శబ్దంగా కౌముది గదిలోకి వెళ్లిపోయాను. నన్ను చూసి ఏమనిపించిందో ఏమో.. కౌముది దేక్కుంటూ నా ఒళ్లో చేరి, కష్టం మీద తన చిన్ని చెయ్యి పైకి లేపి నా ముఖం మీద తట్టసాగింది. ఏవేవో అర్థం

## కొత్తగాలి...

**కష్టపడే వాడే**
**పైకొస్తాడు**
**నిజమే ఐతే**
**రిక్షావాడి లాగుడాగలేదే**

– పేరూరు బాలసుబ్రమణ్యం, తిరుపతి

లేని మాటలు ఊఁ.. ఊఁ.. అంటూ గొంతులోంచి వస్తున్నాయి. దాని కళ్లలోంచి నీరు కారుతోంది. దాని స్పర్శ, ఆ అమాయకపు చేష్టలు, ఆరాటం నన్నాసాంతం కుదిపివేశాయి. దాన్ని గుండెలకు పొదువుకుని అల్లాగే శిలలా ఎంతోసేపు వుండిపోయాను. 'నేను బాధపడుతున్నానని దానికి అర్థమైందా.. దానికి అన్నీ తెలుస్తున్నాయా? మాటల్లో వ్యక్తం చెయ్యలేకపోయినా తన పద్ధతిలో నాకు ఓదార్పునివ్వాలని ప్రయత్నిస్తోందా? ' అంత వేదనాభరితమైన మానసిక స్థితిలోనూ ఆ ఆలోచన నాకెంతో స్వాంతననిచ్చింది.

"ఎవరన్నారు నా కూతురు మానసికంగా ఎదగలేదని.. వెర్రిదని! దానికి అన్నీ తెలుస్తున్నాయి. అర్థం చేసుకునే శక్తి దానికి ఉంది" అని పెద్దగా అరిచి చెప్పాలనిపించింది. కానీ ఇదేమీ ఇతరులకు చెప్పవలసిన పనిలేదు. ఇతరులకేం నిమిత్తం? సుఖమైనా, కష్టమైనా అవి పూర్తిగా మావి.. మాకే చెందినవి! ఈ వింత అనుభూతిని అర్థం చేసుకోగల శక్తి వాళ్లకెక్కడ వుంది? 'అయ్యో.. అయ్యో' అని పెదవి విరుపు సానుభూతి ప్రకటించటం తప్ప హృదయపు లోతుల్లోకి చూడగల వివేకం వాళ్లకెక్కడ? బేలచూపులతో, వ్యర్థమైన జాలిని ప్రదర్శిస్తారంతే..!

"సారీ వదినా! నీ మనసును నొప్పించాను. నువ్వలా రియాక్టవుతావనుకోలేదు"



అంది సునీత తరువాత.

"ఫరవాలేదు సునీతా.. నా ఫీలింగ్స్ నువ్వే కాదు, ఎవరూ అర్థం చేసుకోలేరు. కానీ ఎవరి బాధలు వారివి. ఇటువంటి పిల్లలు దురదృష్టవశాత్తు కొందరికి ఉంటారు. ఒకళ్లతో ఒకళ్లని అలా పోలుస్తూ వర్ణిస్తూ చెప్పటం ఏ తల్లీ సహించలేదు. మీరందరూ గ్రహించినా, గ్రహించకపోయినా కౌముది పిచ్చిపిల్ల కాదు!" అన్నాను. ఇప్పుడు నా మనసులో ఇందాకటి ఆక్రోశం, ఆవేశం ఏమీ లేవు. నిబ్బరంగా, స్పష్టంగా చెప్పగలిగాను. ఇది నా కూతురు చూపిన చిన్న గెస్చర్.. అను కంపన వల్ల నాకు కలిగిన శాంతి.. ధైర్యం.

అతని మనసూ బాధపడినట్లుంది. ఆరోజు సుహాస్ చాలాసేపు కౌముదిని ఆడిస్తూ గడిపాడు. చాలాసేపు గార్డెన్‌లో పెరాంబ్యులేటర్లో కూర్చోపెట్టి తిప్పుతూ గడిపాడు. నేను నన్ను గురించే ఆలోచిస్తున్నాను. ఇటువంటి సన్నివేశాలు సుహాస్ ఎన్ని ఎదుర్కొంటున్నాడో.. పైకి చెప్పడు.

"నేను కాన్వెంటు ప్రిన్సిపాల్‌తో మాట్లాడాను. రేపట్నుంచి దీన్ని నువ్వు కాసేపు కిండర్‌గార్డెన్‌కి తీసుకెడుతుండు. అక్కడ పిల్లల్ని చూస్తుంటే ఏమన్నా మార్పు వస్తుందేమో!" అన్నాడు సుహాస్. నేను వెంటనే అమలు పరిచాను. అంతమంది పిల్లల్ని ఒక్కచోట చూసి మా అమ్మాయి ఒకటే అరుపులు. నా చేతుల్లోంచి జారిపోయి వాళ్లలో కలిసిపోవాలని ఆరాటపడింది. నేను కిందికి దింపి దాని వెనకే నించున్నాను. తక్కిన పిల్లలు వాళ్లకి భయం తెలియదు. దీనిలోని లోపం తెలియదు. వాళ్లంతా అన్నెం పున్నెం ఎరుగని అమాయక పిల్లలు.. మా కౌముది చుట్టూ చేరి కేరింతలు ప్రారంభించారు. ఎవరో కొత్త స్నేహితురాలు వచ్చిందని మాత్రమే సంబరం.

ప్రిన్సిపాల్ వచ్చి "ఏమీ ఫరవాలేదు. ఎంతసేపైనా ఉంచండి. ఇది ప్లే స్కూలే! ఆడుకునే పిల్లల్ని చూస్తుంటే మీ బేబీకి ఆనందంగా ఉంటుంది. మీరు దగ్గరే ఉండండి. ఒంటరిగా మాత్రం వదలకండి" అని అక్కడ పిల్లల్ని ఆడిస్తున్న ఆయాలకీ టీచర్లకీ నన్నూ, పాపని పరిచయం చేశారు. నాకూ అదే ఆశ.. కొంతకాలం కాసేపు అలా పిల్లలతో కలిసి తిప్పితే ఏమన్నా మార్పు వస్తుందేమో.. సాయంత్రాలు పార్కుకో, బీచ్‌కో తీసుకెళ్లేదాన్ని. ఆ ఆనందాన్ని అది ఎంతమటుకు రిసీవ్ చేసుకోగలుగుతోందో నాకు తెలియదు. ఒక్కసారి పెద్దగా అరుస్తుంది. దారిన పోయేవారు ఉలిక్కిపడి వెనక్కితిరిగి చూసి అదోలా జాలి చూపులు ప్రసరిస్తూ వెళ్ళిపోయేవారు. ఒక్కోసారి పెద్ద పెట్టున ఏడుస్తుండేది. అప్పుడూ అంతే, కొందరు ఆగి 'ఏమైంది? పాపకేమన్నా బాధా..?' అని దయతో పరామర్శించేవారు. కొందరు మరిన్ని వివరాలు తెలుసుకోవాలని కుతూహలంతో ప్రశ్నలు ప్రారంభించేవారు.

కాలం గడిచేకొద్దీ నేను గుండె రాయి చేసుకున్నాను. పాపను గురించి నా ఎదుటే ఎవరే విధంగా కామెంట్ చేసినా నిగ్రహం పాటించటం అలవరుచుకున్నాను. పిల్లతోపాటు ఎదుగుతున్నకొద్దీ నంగి మాటలు, చిలిపి చేష్టలు, అసహజమైన చర్యలు మరింత స్ఫుటంగా కనపడసాగాయి. ఎవరికైనాసరే చూడగానే దాని స్థితి తెలిసిపోతుంది. అయినా ఎవరో చూస్తున్నారని, ఏదో అనుకుంటారని, సిగ్గుపడటం, సంకోచపడటం మానేశాను. మనిషిలో ఏ లోపం వున్నా- అది ఎందుకు ఏర్పడిందా అన్న సహజ దృష్టితో చూసే వాళ్ళూ ఎవరో ఉంటారు. ఈ ప్రపంచంలో నిత్యం ఎంతోమంది అవిటివాళ్లని

చూస్తున్నాం. కుంటివాళ్లు, చూపులేని వాళ్ళు, మాట్లాడలేని వాళ్లు, వినలేనివాళ్ళు, వికలాంగులు, వెర్రివాళ్ళు, పిచ్చివాళ్ళు ఎందరో కనిపిస్తూ వుంటారు. వాళ్ళు సమాజంలో భాగమే. నలుగురితో జీవితం గడపవలసినవాళ్ళే. అయినా వాళ్ళ అశక్త తని సమాజం మర్చిపోదు. వాళ్ళకు తల్లి దండ్రులు ప్రేమతో పెట్టిన పేరు వున్నా, కుంటోడనో, మూగోడనో, గుడ్డోడనో.. ఎగ తాళి చేస్తుంటారు. 'ఎర్రటమ్మాయి.. నల్ల టమ్మాయి.. బండోడు..' ఇలా వాళ్ళ శరీ రాకృతులను పేర్లుగా ఉపమోగించటం జరుగుతుంది. అది తప్పు కాకపోవచ్చు. వాళ్ళ యోగమది. ఒక అవకారాన్ని గౌర వంగా స్వీకరించటం.. అది భగవతుండి చ్చింది తప్పించుకో వీలులేనిది కావటం వల్ల మంచిది. ఈ అవగాహనకు రావటా నికి నాకు తక్కువ కాలమేమీ పట్టలేదు. ఎంతో వ్యథ. ఎన్నో బాధాకరమైన అనుభ వాల సారంగా ఈ వివేకం నాకు కలి గింది.

"పిల్లను కన్నావు కానీ.. దాని కర్మను నువ్వు కనలేదమ్మా.. ఏదీ మన చేతిలో లేదు. పూర్వజన్మ కర్మానుసారం మన జీవి తాలు సాగుతుంటాయి. అదే కాకపోతే ఇందరి మనుషుల్లో ఇన్ని బాధలు ఎందుకు ఇలా పెట్టి పుట్టాం, అనుభవి స్తున్నాం. ఇందులో ఆ చంటిదాని తప్పు కాని, మీ నేరం కానీ ఏమి లేదు" అంటుం డేది అత్తగారు. ఎప్పుడూ అవిడింకో మాట చెప్పుండేది, "ఎవరిలోనైనా ఏదైనా అవయ వంలో లోపం పెడితే, ఆ లోపాన్ని మరో విధంగా ఆ దేవుడు పూడుస్తాడు. చూపు లేని వాళ్ళకి అద్భుతమైన గ్రహణశక్తి వుంటుంది. మన కౌముది తల్లి పైకి ఇలా వున్నా గొప్ప లోకాతీతమైన జ్ఞానం కలిగే వుంటుంది. ఏదో శాపవశాన నేటికిలా పుట్టి పెరుగుతోంది" ఆవిడ కపటంలేని మాటలు నన్ను సముదాయించేవి. కాని

## కొత్తగాలి...

**అమ్మాయిపైట పడమటి గాలితో మాయం**

-బద్ధి నాగేశ్వరరావు, అనకాపల్లి

ఈ లోకంలో బతకాల్సి వచ్చినప్పుడు దీనికి మాత్రం ఏవో లోకాతీతశక్తులు ఎందుకు? వాటివల్ల దానికేం ప్రయోజనం? అందరి పిల్లల్లాగే సహజంగా, సాదాగా పెరిగితేనే కదా.. సాటి మనిషిగా లోకం గుర్తించేది. అది లోకవిరుద్ధంగా, ఆడ్ గర్ల్‌గా ఉండిపో తున్నందువల్ల మాకెంత అశాంతి..

ఒకసారి కౌముదిని తీసుకుని మా ఇంటికి దగ్గర్లో వున్న పార్కుకి వెళ్ళాను. ఎవరో వృద్ధుల జంట అక్కడ నాకు తార సపడ్డారు. ఆ సమయంలో కౌముది కిందకు జారిపోయి ఎందుకో చప్పట్లు కొడుతూ పెద్దగా అరవసాగింది. ఆ వృద్ధ దంపతులు దాని అరుపులు విని మా దగ్గ రకు వచ్చి, పాప చెయ్యి పట్టుకుని ప్రేమగా "ఏం పాపా.." అని పలకరిం చారు. అది ఏమనుకుందో మరింత సంతో షంగా కేరింతలతో అరవసాగింది. తన బోసినోరు తెరిచి ఆవిడ బిగ్గరగా కౌము దికి తెలిసేలా నవ్వింది. దాని సంతోషం కోసం ఆమె అలా చేస్తోందని నాకు తెలుసు. అటువంటి మంచి సన్నివేశాలు నేనిప్పటికీ మరిచిపోలేదు. తరువాత ప్రేమగా దాని బుగ్గ నిమిరి వెళ్ళిపోతూ "అమ్మాయ్.. కొందరు పిల్లలకి మనోవి కాసం అలస్యంగా వస్తుంది. దిగులు పడ కమ్మా. నువ్వు సహనంతో వేచివుండు. అంతా మేలు జరుగుతుంది" అంది. భవి ష్యత్తులో మా అమ్మాయి మెదడు ఎప్పుడు

వికసిస్తుందో, దాని జ్ఞాననేత్రం ఎప్పుడు విచ్చుకుంటుందో నాకు అగమ్యగోచరమే కాని ఆ పెద్దామే పలుకులు నాలో గొప్ప ఉత్సాహాన్ని నింపాయి. ఆశ అనేది చచ్చే మనిషిని కూడా చివరివరకూ ఉత్సాహంగా బతికిస్తుంది. అయితే ఇందుకు వ్యతిరేకంగా కొందరు అది కనిపిస్తేనే చాలు.. ఏదో దెయ్యాన్నో, భూతాన్నో చూస్తున్నట్లు, దానివైపు తలతిప్పి చూడటమే తమవల్ల కాదన్నట్లు భుజాలు కుంచించుకుని 'అబ్బ' అని ముఖం వికారంగా చేసుకొని తొలగి పోయేవారు. మనిషి అందాన్ని కోరుకుంటాడు. అందమైన వస్తువులను కోరుకుంటాడు. ఆనందాన్ని కోరుకుంటాడు కాని అందవిహీనతను, విదారకమైన వైకల్యాన్ని ఎంతమాత్రం సహించలేడు. బాహ్యా సౌందర్యాన్ని తప్ప మనిషిలోని అంతః సౌందర్యాన్ని తెలుసుకోగలవాళ్ళు చాలా తక్కువ వుంటారు. బిడ్డ ఎటువంటిదైనా, ఎంత అందవిహీనురాలైనా, అంగవికలురాలైనా దాన్ని గుండెల్లో దాచుకోగలిగేది తల్లి దండ్రులొక్కరే.. మరీ తల్లి ఒక్కటే అని చెప్పవచ్చు.



ప్లేస్కూల్ కి కౌముదిని అప్పుడప్పుడు తీసుకువెడుతుండేదాన్ని. దాని సుఖం కోసం, ఆనందం కోసం ఎంత ఖర్చు చెయ్యటానికైనా వెనుకాడేవాడు కాదు సుహాస్. అక్కడ పిల్లలతో నాకేం సమస్య ఎదురయ్యేది కాదు. పిల్లలు దాని దగ్గరకు వచ్చినప్పుడు నేను దాన్ని నా ఒళ్ళో కూర్చో పెట్టుకుని ఇతర పిల్లల పరిచయం కలిగేట్టు చేసేదాన్ని. అందువల్ల పిల్లలు దాన్ని చూసి భయడేవారు కాదు. కొందరు ధైర్యంగా దగ్గరకు వచ్చి దాన్ని ముట్టుకొని హాయ్ చెప్పేవారు. అక్కడ అంతమంది పిల్లల్ని చూస్తున్నపుడు దాని ముఖంలో సంతోషంలాంటి చిన్న మెరుపు నా కంట పడి నన్ను సంతృప్తి పరిచేది.

కానీ ఈ సంతోషం కూడా నిలవలేదు. స్కూలు ప్రిన్సిపాల్ ఒకసారి బాధపడుతూ



అన్నాడు 'మీ పాపను మరో స్కూల్లో చేర్పండి' అని. ఎంతో ఉపోద్ఘాతం ఇచ్చాక నా ముఖంలో ప్రస్ఫుటమైన వేదనా ఛాయను గమనించి బరువుగా చెప్పాడు- "నేను నిస్సహాయుణ్ని తల్లీ.. కొందరు పేరెంట్సు ఇటువంటి పిల్ల, తమ పిల్లల మధ్య వుండటానికి ఒప్పుకోవటం లేదు. నేను నచ్చచెప్పాలనే ప్రయత్నించాను. నిజానికి మీ పాప చాలామంది అల్లరి పిల్లల కంటే బుద్ధిగా వుంది. ఆ అమ్మాయి వల్ల ఎవరికి ఏమీ ఇబ్బంది కలగటంలేదు. కానీ వాళ్ళు ఇష్టపడటంలేదు. తమ పిల్లల్ని వేరే స్కూలుకి మారుస్తామంటున్నారు"

ఆ ప్రిన్సిపాల్ ఏం చేస్తాడు పాపం. తను మంచివాడే కానీ నిస్సహాయుడు. ఒక్కపిల్ల కోసం తన స్కూలు పిల్లల సంఖ్య పాడుచేసుకోలేడు కదా? ఇదంతా నేను ఊహించనిదేమి కాదు. నేను కౌముదితో ప్లే స్కూలుకు రావటం కొందరు పిల్లల తల్లులు ఇష్టపడటం లేదని వాళ్ల చూపులవల్ల గ్రహించే వున్నాను. అయినా కోపం అణుచుకోలేకపోయాను.

"ఏమండీ.. మా పాప చేసిన నేరమేమిటి? ఎందుకు నలుగురు దాని వయస్సు పిల్లల మధ్య అది ఆడుకోకూడదు? అది కూడా అందరిలాంటి పిల్లే. బడికి వెళ్ళే హక్కు దానికీ వుంది. అదేదో మహాపరాధం చేసినట్టు చూట్టం న్యాయమా? "

ఆయన కౌముదిని జాలిగా చూశాడు. చేతుల్లోకి తీసుకొని లాలనగా తల నిమిరాడు. "ఎంత మాత్రం కాదమ్మా. కానీ చెప్పాను కదమ్మా.. నిజానికి వికలాంగులు వాళ్లు తల్లీ. నన్ను క్షమించమని మాత్రం వేడుకోగలను. ఇక్కడ నా పాత్ర పరిమితం కదమ్మా" అంటూ ప్రాధేయపూర్వకంగా చూశాడు. ఇక ఆయనతో తర్కించకుండా నేను మా అమ్మాయిని తీసుకొని వచ్చేశాను.

దానికి కొద్దిపాటి ఆనందాన్ని కూడా ఇవ్వలేకపోతున్నామే అని సుహాస్‌కి చెప్పి బాధపడ్డాను. సుహాస్ కూడా ఉద్రేకపడ్డాడు- "డర్టీ సొసైటి. వాళ్లకిలాంటి బిడ్డ వుంటే అప్పుడు తెలుస్తుంది" అన్నాడు. ఇటువంటి అవమానాలను, పరిహాసాలను వింటూ తట్టుకోగలశక్తి మాకు కాలమే ఇచ్చింది. చివరకు మా కౌముదికి తన ఈడు పిల్లలం, స్నేహితులం, తల్లితండ్రులం అన్నీ మేమే అయ్యాం.

ఒకసారి మా ఇంటికో మధ్యతరగతి భార్యాభర్తలు వచ్చారు. 'మీ పాపను ఒకసారి చూసి వెళదామని వచ్చామమ్మా? ' అన్నారు. 'ఎందుకు? ' అన్నాను అనుమానంగా. 'మాకు ఒక దురదృష్టవంతుడు వున్నాడు. మీ నుంచి మాకేమన్నా ఆసరా దొరుకుతుందేమో'నని వాళ్ళ పిల్లవాడి లక్షణాలు వివరించారు. నా గుండెల్లో గుచ్చుకున్నట్లైంది. అటువంటి పిల్లలు తల్లితండ్రుల గుండెల మీద కుంపటే కదా. వాళ్ళు కాస్త ఊరట కోసం వచ్చారని అర్థం చేసుకున్నాను. నేను మొదటిసారిగా ఏవిధమైన బిడియం, సంకోచం లేకుండా వాళ్ళకి చూపించాను. వాళ్ళు నాలాగా బాధపడుతున్నవారేనన్న సానుభూతి నన్ను కదిల్చివేసింది. పేరంటల్ అఫెక్షన్‌తో ఆ తల్లి కౌముదిని వాత్సల్యంగా దగ్గరకు తీసుకొని ముద్దు చేసింది. అనేక విషయాలు మేం మా పిల్లల గురించి కలబోసుకున్నాం. వాళ్ళు వెళ్ళేముందు నన్ను వాళ్ళింటికి పాపను తీసుకొనిరమ్మని ఆహ్వానించారు.

కౌముదిని తీసుకుని ఒక ఆదివారం సుహాస్, నేను మా కొత్త మిత్రుల ఇంటికి వెళ్లాం. నేను కౌముదిని తీసుకుని ఎవరింటికైనా వెళ్లటం ఎప్పుడో మానేశాను. తప్పనిసరి పరిస్థితుల్లో మా కుటుంబసభ్యుల ఇళ్లకు మాత్రం చాలా అరుదుగా వెళ్లవలసి వస్తుంది. ఆ కార్యక్రమం జరిగే

వేళకు హాజరై వెంటనే తిరుగు ప్రయాణమైపోతాను. ఇతరులతో మేము ఇమడలేకపోతున్నాం. ఎంత వద్దనుకున్నా ఏదో న్యూనతాభావంతో మనసు కుంచించుకుపోతుండేది. వాళ్లకు కూడా మా ఉనికి అసంతోషకరంగా, ఇబ్బందిగా వుండుండవచ్చు.

అందుకే వాళ్లు మాలాంటి సమస్యతోనే బాధపడుతుండటంవల్ల నిస్సంకోచంగా వాళ్ళింటికి వెళ్ళగలిగాం. వాళ్ళ అనుభవం నుంచి మాకు, మా అనుభవాల నుంచి వాళ్ళకు కొంత ప్రయోజనం వుండవచ్చునన్న ఊహ మా చొరవకు కారణం కావచ్చు. మమ్మల్ని చూడగానే ఆమెకు గొప్ప ఆనందం కలిగింది. ముఖం నవ్వుతూ ఉద్వేగంతో వెలిగింది. చిన్న పాడుపడిపోయినట్టున్న పాత ఇంట్లో వుంటున్నారు.

"ఈ ఇల్లు దొరకటమే మాకు చాలా కష్టమైంది. ఇంటివాళ్లు ఉద్యోగరీత్యా మరో చోట వుంటారు. దీనిమీద ఎవరికీ శ్రద్ధ లేదు. మా అదృష్టంకొద్దీ మావారి మిత్రుడొకాయన ఈ ఇల్లు మాకు కుదిర్చిపెట్టాడు. వీడి గొడవ భరించలేక ఎక్కడ చేరినా వెంటనే ఖాళీ చెయ్యమనేవారు. ఇప్పుడు కాస్త ధైర్యంగా ఉండగలుగుతున్నాం. పక్కన ఎవరులేరు కదా!" అని విచారంగా నవ్విందామె. ఇటువంటి పిల్లలున్నవాళ్ళకు అద్దెకు ఇవ్వడానికి కూడా ఇష్టపడరన్నమాట. సమాజం కొందరిపట్ల ఎంత నిర్దయగా వుంటుంది? ఆ అనుభవం మాకూ వుంది కనుక పెద్ద వింతగా అనిపించలేదు. మా అనుభవాలు వాళ్ళ అనుభవాలు కలబోసుకున్నాం.

"వీడు మా మొదటి సంతానం. వీడు కడుపులో వున్నప్పుడు నాకు చాలా జబ్బు చేసింది. దాని ప్రభావం బిడ్డమీద పడిందన్నారు. తరువాత ఇద్దరు అమ్మాయిలు వాళ్లు బాగానే ఉన్నారు" అంటూ ఐదారేళ్ల

## కొత్తగాలి...

**లేదన్నా పోదు మనసు**
**సరేలే అన్నా నిలవదు వయసు**
**కడలి వరకు నడచే నదికి**
**తుదివరకు పరుగే జీవితానికి**

- వై.కె.మూర్తి, విజయవాడ

వయసున్న ఇద్దరు ఆడపిల్లల్ని చూపారు. సరైన పోషణ లేకపోవటంవల్ల వాళ్లిద్దరూ బలహీనంగా వున్నప్పటికీ అవయవాలన్నీ సక్రమంగానే ఉండి మానసికంగా పరిపూర్ణ ఆరోగ్యంతోనే ఉన్నారు. అంతవరకూ ఆ తల్లిదండ్రులు అదృష్టవంతులే. వాళ్ల ధైర్యానికి నాకు ఆశ్చర్యమనిపించిది. మానసిక రోగగ్రస్తుడైన కొడుకుని ఒళ్ళో వుంచుకుని ఆమె మరో ఇద్దరు పిల్లలకి ఏ ధైర్యంతో జన్మనిచ్చిందో కదాని గుండె జలదరించింది. ఇలా జీవితాన్నే చాలా సామాన్యంగా తీసుకుని గడిపేవారిని నేను చాలామందినే చూశాను. సమస్య సమస్యే, జీవితం జీవితమే అనుకుంటారు. దైహికక్రియలు వాటంతటవే మనోభావాలకు సంబంధం లేకుండా జరిగిపోతూ ఉండవచ్చు. ఆ పిల్లలు భయం లేకుండా మా అమ్మాయిని ఎత్తుకుని ఆడించసాగారు. దాని కర్థమయ్యేలాగా నోటితో శబ్దాలు చేస్తున్నారు. చప్పట్లు చరుస్తూ డాన్స్ చేస్తున్నారు. అటువంటి పిల్లల్ని, అంత నిర్భయంగా దానితో ఆడుకునేవాళ్ళని నేను చూడలేదు. మా వాళ్ళ పిల్లలు కూడా 'అదేం చెయ్యదు, భయంలేదు' అని నేనెంత ధైర్యం చెప్పినా దూరదూరంగా నుంచొని భయం భయంగా చూసేవారే తప్ప దగ్గరకు చేరేవారు కాదు. 'అదేం చేస్తుందో' ఒక్కోసారి దానికే తెలియదు..



వద్దమ్మా దాన్నిటివ్వండి' అన్నాను. వాళ్ళు చాలా తేలిగ్గా నవ్వేశారు. ఫరవాలేదాంటీ.. మా అన్న కూడా అంతే. కోపమొస్తే ఊరికే అరుస్తాడంతే ఏమీ చెయ్యడు.. పాప బాగుందాంటీ.. రోజూ మేం మీ ఇంటికి వచ్చి మీ పాపతో ఆడుకోమా? " అన్నారు.

"వీడి పేరు రవి! పుట్టిన దగ్గర్నించీ ఇట్లాగే వున్నాడు. ఎన్నో వైద్యాలు చేయించాం. ఎక్కడెక్కడో తిరిగాం. ఇక మా వల్ల కాక ఊరుకున్నాం. వాడి ఖర్మ కాకపోతే ఏమిటి చెప్పండి. మా వంశంలో ఎవరూ ఇలాంటివారు లేరు. వాళ్ళకూ అంతే. వీడొక్కడే ఇలా.. అంతా మా దౌర్భాగ్యం" అందామె బాధగా.

రవి నేలమీద దేకుతున్నాడు. తల పెద్ద దిగా వుంది. కళ్ళు పెద్దవిగా, కనుగుడ్లు ముందుకు ఉబ్బివున్నాయి. శరీరమంతా సన్నగా పాలిపోయివుంది. తలమీద జుత్తు లేదు. చర్మం ఎండిపోయి ముడ తలుపడి వుంది. కౌముదిని తీసుకుని అనే కచోట్ల వైద్యం కోసం తిరగడం వల్ల, ఎంద రెందరినో నిపుణులను కలవటం వల్ల కొంతవరకూ వ్యాధి లక్షణాలు మాకు తెలు స్తున్నాయి.

"మీ అబ్బాయికి థైరాయిడ్ సమస్య అయివుండవచ్చు. మా బేబిని చూసిన గ్రాండ్ స్పెషలిస్ట్ అడ్రస్ ఇస్తాను. వెళ్లి సంప్రదించండి" అని సుహాస్ వాళ్ళకి నిపు ణుడి వివరాలు చెప్పి, అడ్రస్ ఇచ్చాడు. నిజానికా వైద్యం మా కౌముదికి ఉపయో గపడలేదు కాని కొంత కాలం అక్కడ చికిత్స చేశారు.

"తగ్గిపోతుందంటారా? " ఆయన అను మానంగా అడిగాడు.

"పూర్తిగా తగ్గుతుందో లేదో.." అన్నాడు సుహాస్.

తరువాత మేం వచ్చేశాం. వాళ్లు రవిని స్పెషలిస్టు దగ్గరికి తీసుకువెళ్ళలేదు. ఇంక అతనిమీద ఏమాత్రం డబ్బు ఖర్చు చేసే పరిస్థితిలో ఆ కుటుంబం లేదని అర్థమైపో యింది.

"వాడి ఖర్మ.. నా ఖర్మ. తప్పదు కదమ్మా.. ఏనాడో పాపం చేసుకున్నాను.. అనుభవిస్తున్నాము. అంతంత మాత్రపు సంపాదన. ఆస్తిపాస్తులేమి లేవు. ఆదుకునే వాళ్ళసలే లేరు. బంధువులం దరూ ఎప్పుడో వదిలేశారు. ఉన్నది కాస్తా వీడి వైద్యానికే తగలేశాం. ఇంకో ఇద్దరు ఆడపిల్లలు.. వాళ్ళ గతేం కావాలో అర్థం కావటం లేదు. ఇంకా ఎంత కాలమో.. ఇలా వీడితో. ఇటువంటి పిల్లల కోసం వేరే హోమ్ వుంటుందట కదా. మీకే మన్నా తెలిస్తే చెప్పండమ్మా. జీవితంలో ఈ బరువు నన్ను తినేస్తోంది."

ఆ మాటలు నన్ను బాధించాయి. అటు వంటి పిల్లలను జీవించినంతకాలం భరిం చటం నిజంగా అసాధ్యమనిపించే విష యమే. అయితే భరించక తప్పేదే ముంది? మానసిక స్థిమితం ఎదుగుదల లోపించిన వికలాంగులకు కొన్ని స్వచ్ఛంద సంస్థలు, ప్రభుత్వ సంస్థలు ఆశ్ర యమిస్తున్నాయట. నిజమే కాని చాలా మంది తల్లిదండ్రులు పిల్లల్ని తమ దగ్గరే వుంచుకోవాలనుకుంటారు. ఆ సంస్థల్లో పిల్లల పట్ల ఆదరణ, శ్రద్ధ ఏమేరకు వుంటుందన్న అనుమానం కొంత. ఏమీ తెలియని అమాయకుల్ని అనాథలుగా చేయటానికి అంతఃకరణ అంగీకరించక కొంత. ఇంకా భయంకరమైనవి అను మానం, భయం. ఒక్కో సందర్భంలో అది అత్యంత దయనీయమైన ఆశ కూడా కావచ్చు- వాళ్ళు ఎక్కువకాలం జీవించబో రని, లేత వయసులోనే మరణిస్తారేమో నని. ఏదిఏమైనా విధి నిర్దేశించిన విధంగా జరగబోయేదానికి ఏ తల్లి

# నీరు - మనం




ఈ భూమిపై ఏ జీవీ నీరు లేకుండా మనలేదు. ప్రతీ చెట్టు బరువులో 80 నుంచి 99 శాతం దాకా ఉన్నది నీరే. అనేక జంతువుల బరువులోని 75 శాతం నీరే.

ప్రపంచంలోని 97 శాతం నీరు సముద్రాల్లో వుంది. అందులో 46 శాతం పసిఫిక్ మహాసముద్రంలోనే వుంది. ఆర్కిటికాలో నీరు కేవలం 3.7 శాతం మాత్రమే. భూగర్భ జలంగా 1.6, గాలిలో తేమగా, మేఘాల్లో 0.001 శాతం నీరు వుంది.

అమెరికాలోని గ్రేట్‌లేక్స్ అతిపెద్ద సరస్సుల సముదాయం. దీని విస్తీర్ణం 94230 చదరపుమైళ్ళు. ఇది న్యూయార్క్, న్యూజెర్సీ, కనెక్టికట్, రోడ్ ఐలండ్, మసాచుసెట్స్, వెర్మౌంట్ రాష్ట్రాల విస్తీర్ణం కన్నా ఎక్కువ. నిజానికి ఒకదానితో ఒకటి అనుసంధానమైన అయిదు సరస్సులని గ్రేట్‌లేక్స్ అంటారు. అతిపెద్ద సరస్సు కూడా ఇదే.



నీటి ద్వారానే పచ్చకామెర్లు, డయేరియా, టైఫాయిడ్, రింగ్‌వార్మ్‌లాంటివి వ్యాపిస్తాయి. నీటిని మంచులా మార్చి, కరిగిన నీటిని వడపోస్తే స్వచ్ఛమైన నీరు లభిస్తుంది. అయితే గడ్డకట్టడం, తిరిగి కరగడం నెమ్మదిగా జరగాలి. ఈ నీరు అర్థరో స్క్రిరోసిస్‌కి చక్కని మందని కనుగొన్నారు. ఏభైదాటిన వారు మంచు నుంచి కరిగిన నీటిని తాగితే, శరీరం ముడతపడదని కూడా వారు కనుగొన్నారు. నీటి ప్రాముఖ్యం గుర్తించి మార్చి 22 ను వాటర్‌డేగా జరుపుకుంటున్నారు. కొన్ని ఆధునిక దేశాల్లో ఓసారి ఉపయోగించిన నీటిని శుద్ధిచేసి, తిరిగి ఇళ్ళకి సరఫరా చేయడం జరుగుతోంది.

ప్రపంచంలో చాలాచోట్ల నీటిఎద్దడి ఏర్పడడంతో ప్రాంతీయ ప్రభుత్వాలు నీటి వినియోగం మీద అనేక పరిమితులు విధించాయి. పంపుగొట్టం మందం, పంపులోంచి నిముషానికి పడే నీటికొలత, టాయ్‌లెట్స్‌లో ఓసారి ఉపయోగించే నీరు మొదలైన వాటి మీద పరిమితులు ఉన్నాయి. అమెరికాలోని 28.5 కోట్ల జనాభాలో 24 కోట్లమంది పంపులోని నీటిని వాడుతున్నారు. మిగిలినవారు నదులు, బావుల్లోని నీటిని మాత్రమే వాడుతున్నారు.

ఒక అంగుళం వర్షం పడితే, అరెకరంలో 13577 గాలన్ల నీరు చేరుతుంది. ఈ నీటిని పట్టుకోగలిగితే దాదాపు 271 రోజులు ఆ నీరు ఓ కుటుంబం అవసరాలకి సరిపోతుంది. దీని బరువు 56 టన్నులుంటుంది. ఇంత నీటిని నిలవ చేయడం అసాధ్యం.

నీటిలో సాఫ్ట్‌వాటర్, హార్డ్‌వాటర్ అని రెండు రకాలు ఉంటాయి. కాల్షియం, మెగ్నీషియం తక్కువగా ఉన్న నీరు సాఫ్ట్‌వాటర్, ఎక్కువగా ఉన్న నీరు హార్డ్‌వాటర్. హార్డ్‌వాటర్‌తో చేతికంటిన సబ్బుని కడుక్కోడానికి ఎక్కువ నీరు అవసరమవుతుంది. భూగర్భజలాల్లో సల్ఫైడ్‌గాస్ గనుక చేరివుంటే, ఆ నీరు కుళ్ళిన కోడిగుడ్ల వాసన వేస్తుంది.

ఆధునిక యుగంలో నీటిఎద్దడి వల్ల, నీటి పంపకంలో రాష్ట్రాలు, దేశాల మధ్య గల సంఘర్షణలని రాజకీయ నాయకులు ఉపయోగించుకోవడాన్ని 'వాటర్ పాలిటిక్స్' అంటారు. ఈ ప్రపంచంలో నీటిని కొనే ఏకైక దేశం సింగపూర్. పొరుగున ఉన్న మలేషియానించి ఆ దేశం తన అవసరాల కోసం నీటిని కొంటోంది.



అయినా ఒడి కట్టి సిద్ధమవక తప్పదు.

"ఈ పిల్లల్ని స్కూళ్ళలో చేర్చుకోరు. ఇరుగుపొరుగు వీళ్లను తమ పిల్లల మధ్య వుంచటానికి ఒప్పుకోరు. హీనంగా చులకనచేసి మాట్లాడుతుంటారు. ఏం చెయ్యాలి? ఈ పిల్లల్ని తీసుకొని ఈ సమాజాన్ని విడిచి ఎక్కడికి పోవాలి? వీళ్లు మనుషులే కదా. ఆమె పరిపరి విధాల బాధపడుతోంది. కుర్రాడ్ని ఏదన్నా వికలాంగుల ఆవాస కేంద్రంలో వుంచితే బాగుండునన్న ఆలోచనకు వాళ్లు వచ్చేశారు. మా మనసులో మాత్రం అటువంటి ఊహలేదు. ఇంతవరకు ఎవరు మాకు అటువంటి సూచన నియ్యలేదు. ఒకవేళ ఎవరైనా చెప్పినా మా అమ్మాయిని ఎక్కడో వదిలిపెట్టడానికి సిద్ధంగా లేం. కర్మో, ప్రారబ్ధమో, కష్టమో, నష్టమో ఏమైనా కాని భరించటానికి సిద్ధపడుతున్నాం. సమస్య ఒకటే అయినా దానిని ఎదుర్కొనే మానసిక స్థాయి మనిషి మనిషికి ఒక్కోవిధంగా వుంటుంది. ముఖ్యంగా అది వాళ్ల ఆర్థిక వ్యవస్థమీద ఆధారపడి వుంటుంది.

ఎప్పటికప్పుడు నిరాశ ఎదురవుతున్నా దాన్ని మరిపిస్తూ అంతలోనే మళ్లీ మెరుపులా ఏదో ఆశ మమ్మల్ని ముందుకు నడిపిస్తూనే వుంది. ఇంచుమించు పిల్లల మనోవికాస సమస్యకు చెందిన అన్ని క్లినిక్‌లను సందర్శించటం జరిగింది. అంతూ దరిలేని రకరకాల పరీక్షలతో రోజులు గడిచిపోతున్నాయి.

టెస్టులు జరుగుతుంటే తరువాత ఫలితం తెలుస్తుందని, అప్పుడు చేయవలసింది కూడా చెప్తారని ఎప్పటికప్పుడు కొత్తగా ధైర్యం కలుగుతుండేది.

పెద్ద సూపర్ స్పెషాలిటీలో పిల్లల చికిత్సా విభాగంలో చీఫ్ డాక్టరు మా అమ్మాయి మెడికల్ రిపోర్ట్సు శ్రద్ధగా పరిశీలిస్తుంటే మేమిద్దరం ఆశ నిరాశల మధ్య ఊగిసలాడుతూ కూర్చున్నాం. అంతవరకు జరిపిన ఎన్నెన్నో పరీక్షల కారణంగా మా పాప బాగా అలిసిపోయింది. నా మీద వాలిపోయి సేద తీరుతోంది. దాన్ని ఒడిలోకి తీసుకుని నిశ్శబ్దంగా లాలిస్తూ చీఫ్ చెప్పబోయే దాని కోసం ఆత్రుతగా ఎదురుచూస్తున్నాను. ఆయన చురుకైనవాడు. మంచివాడు. తెలివైనవాడు. వ్యాధి నిర్ధారణలో ఘటికుడని చాలామంది చెప్పగా విన్నాం. మనిషి చూపులకు కూడా అలాగే కనిపించాడు. మా అమ్మాయికి సంబంధించిన రిపోర్టులన్నీ పరీక్షిస్తూ ఒక నిర్ధారణకు వచ్చాడు. కరుణ ఉట్టిపడుతున్న మెల్లని మాటలతో మీ పాప శారీరకంగా అవయవాలు బాగానే వున్నాయి. మనోవికాసం పూర్తిగా దెబ్బతింది. అంతు తెలియని లోపంతో బాధపడుతున్నప్పటికి కొన్ని మంచి లక్షణాలు కూడా వున్నాయి.

"ఎందువల్ల మా అమ్మాయికి లోపం వచ్చింది?" సుహాస్ దిగులుగా ప్రశ్నించాడు. ఆయన తలపంకించి "పుట్టడానికి ముందో లేక ఆ తరువాతో, ఎక్కడో, ఏదో లోపం ఏర్పడి పెరుగుదల ఆగిపోయింది. అది ఏమిటన్నది చెప్పలేం" అన్నాడు.

"ట్రీట్‌మెంట్ లేదంటారా.. ఏమీ బాగయ్యే అవకాశం లేదంటారా?" అతి కష్టం మీద గంభీరతను నటిస్తూ అడిగాడు మళ్ళీ సుహాస్.

కుంగిపోతున్న మనసుతో పాపను గట్టిగా హృదయానికి హత్తుకుని నేనలాగే రాయిలా కూర్చున్నాను.

"తగ్గదని చెప్పలేం. వైద్యం చేయించగా చేయించగా.. ఎప్పటికైనా బాగుపడవచ్చు ప్రయత్నం మానకూడదు" అనేసి ఇంకేమీ లేనట్లు సీట్లోంచి లేచాడు. సుహాస్ ఆయనకు 'థ్యాంక్స్' మర్యాదపూర్వకంగా చెప్పాడు. రోగిని మభ్యపెట్టాలని కాకపో

యినా, ఏ డాక్టరైనా ఖచ్చితంగా ఈ వ్యాధి నివారించబడుతుందనే ఆశనే కలిగిస్తాడు. కొద్దిసేపట్లో మరణిస్తాడని తెలిసినా రోగికి తగ్గుతుందని చెప్పి మానసిక స్థైర్యాన్ని కలిగించాలనే చూస్తారు. అది వాళ్ళ వృత్తి ధర్మం. మానవత్వం కూడాను. ఈ డాక్టరు కూడా అదేవిధంగా చెప్పాడు.

అమ్మాయిని మా మధ్య వుంచుకుని చెరో చెయ్యి పట్టుకుని నిదానంగా నడిపించుకు కారిడర్‌గుండా బయటకు వస్తుంటే కనిపించాడొక వ్యక్తి. మమ్మల్ని పలకరింపుగా చూసి దగ్గరగా వచ్చి- "ఏమన్నారు సార్ చీఫ్? " అన్నాడు.

అతన్ని నేనే గుర్తించాను. అక్కడి అసిస్టెంట్. దగ్గరుండి డాక్టర్ రాసిన టెస్టులవీ చేయించాడు. బహుశ ఏమన్నా డబ్బులడుగుతాడేమో ననుకున్నాను.

డాక్టరు ఏమన్నాడో ఒక్కమాటలో చప్పున బదులు చెప్పలేకపోయాం. తగ్గుతుందన్నాడా.. లేదు. తగ్గదు, ఆశ వదులుకోమన్నాడా.. అదీ చెప్పలేదు. ఒక సందిగ్ధ స్థితిలో మమ్మల్ని వదిలి ఊరుకున్నాడు. అయినా ఈయనేం చెప్పదలుచుకున్నాడోనని ఆగి "తగ్గదని మాత్రం చెప్పలేదు" అన్నాను. సుహాస్‌కు ఉత్సాహం తగ్గిపోయింది. ఈ అనవసర పరామర్శలవల్ల ఉపయోగమేమిటని అసహనంగా చూస్తున్నాడు.

"అమ్మా మీరు నన్ను తప్పుగా అర్థం చేసుకోవద్దు. నిజాన్ని అంగీకరించక తప్పదు. నిత్యం నేను ఇటువంటి పిల్లల్ని ఎందరినో చూస్తుంటాను. వాళ్లు మామూలు స్థితికి రావటమనేది జరగదు. అది అసాధ్యం. వైద్యానికి అంతుచిక్కని మానసిక రుగ్మత! మిమ్మల్ని మీరు మోసం చేసుకుని ప్రయోజనంలేదు. వ్యర్థంగా, ఆసుపత్రుల చుట్టూ తిరగటంతోనే మీ జీవితం గడిచిపోతుంది"

నేను దిగ్భ్రాంతితో వింటున్నాను. నయమవుతుందని చెప్తే అతనికి ఎంతో కృతజ్ఞత చెప్పేదాన్ని- కాన్నీ చాలా స్పష్టంగా, అది అసంభవమని చెప్తున్నాడు.

"అనవసరమైన ఆశలతో మీ సమయాన్ని, శక్తినీ, డబ్బును వృథా చేసుకోవద్దు. అమ్మాయికి సుఖంగా వుండే ఆశ్రమాలున్నాయి. ప్రైవేటు సంస్థలు నడిపేవి. శిశు సంక్షేమశాఖ నడిపేవి. అక్కడ ఎందరో మీ అమ్మాయికి తోడుగా వుంటారు. లేకపోతే జీవితాంతం ఈ బిడ్డ భారం మీకు తప్పదు.. తనపని తను చేసుకోవటం నేర్పించండి.. అది సరిపోతుంది, ప్రయాస పడకండి.."

సుహాస్ ముఖం ఎర్రబడింది "ఆయాచితంగా వచ్చి గొప్ప సలహా ఇస్తున్నారే.. అయిందా? " అన్నాడు.

సుహాస్ కోపాన్ని ఆయన పట్టించుకోలేదు. చాలా శాంతంగా చెప్పాడు.. "బాబూ! తల్లిదండ్రుల మనసు నేనర్థం చేసుకోగలను. నా మాటలు మీకు హితవు కాకపోవచ్చు. ఇటువంటి పిల్లల్ని చాలా మందిని చూసిన అనుభవం వల్ల చెప్తున్నాను.. మీ ఇష్టం.." అని వెళ్లిపోయాడు. ఈ విధమైన సలహాలు, మాటలు కాస్త అటు ఇటుగా వింటుండడం వల్ల అయన మాటలు నన్నంతగా వేధించలేదనే చెప్పాలి. అందరూ ఇదే చెప్తున్నారే. ఇక దీనికి నయమయ్యే ఆశ లేదా? మా జీవితాలకింక వెలుగే లేదా అన్న నిస్పృహ

## కొత్తగాలి...

**దేశమంతటా**
**కాలువ నీరు**
**తెలంగాణాకు**
**కన్నీరు**

– పెరుకరాజు, నర్సింగాపూర్, కరీంనగర్

## కొత్తగాలి...

**పెళ్లి- ఆర్భాటం**
**శోభనం- ఆవేశం**
**బారసాల- ఆవేదన**
**వెరసి జీవితం చెరసాల**

–మల్లాది నరసింహమూర్తి, హైదరాబాద్

ఆవరిస్తున్నా, దాని వెనుక ఇక ఇంతే.. ఆరాటపడి ఇక్కడికి, అక్కడికి పరుగులు తీసి ప్రయోజనం లేదన్న చిట్టచివరి తెలివి కొద్దిగా స్థిమిత పరుస్తోంది. ఆస్పత్రిలోని బాధ్యత గల వైద్యుని ద్వారా విన్న మాటలు, సమస్యలోని తీవ్రతను, ఏంచేసినా లాభం లేదన్న అంతిమ సత్యాన్ని విన్న తరువాత 'ఇక ఇంతే మా కర్మ' అన్న మొండి ధైర్యంతో కూడిన నైరాశ్యం మమ్మల్నావరించింది. ఎవరికి వాళ్ళం మా ఆలోచనల్లోనే తర్కించుకుంటూ వుండిపోయాం. అతడెంత బాధపడుతూ మాతో మాట్లాడాడో అర్థం చేసుకున్నాను.

అక్కడితో మా ప్రయత్నాలు పూర్తిగా విరమించుకున్నామని కాదు. కాకపోతే అంతిమ నిర్ణయాన్ని అంగీకరించకలిగిన మనోనిబ్బరం పెంచుకోగలిగాం. ఎప్పటికీ విశ్రాంతి లేని ఒక కఠిన స్థితిని ఎల్లకాలం భరిస్తూ వుండటం ఎవరూ ఊహించలేని అయోమయ ప్రపంచం. ఏదో మా తృప్తి కోసం కౌముదిని వైద్యంనిమిత్తం తిప్పుతూ వున్నా అనవసరమైన శ్రమ అని తెలిసిపోతూనే వుంది. నిరంతరం రెండు సమస్యలు నన్ను వేధిస్తూనే వున్నాయి. అవి ఎంత కాలమైనా ఎటువంటి పరిష్కారం దొరకనివి. శారీరకంగా వయసు పెరుగుతున్నప్పటికీ పసిపిల్లలా మానసిక ఎదుగుదల లేక నిస్సహాయ స్థితిలో ప్రతి అవసరానికి ఇతరులపైన ఆధారపడే పిల్లను కాపాడుకోవటమెలాగ? సాధారణంగా ఈ లోకంలో జీవులన్నీ పసిప్రాయంలో కొంతకాలం మాత్రమే తల్లిపై ఆధారపడి అవసరాలు గడుపుకుంటాయి. వ్యక్తం తెలిసిన తరువాత ఇతరులపై ఆధారపడకుండా స్వావలంబన సామర్థ్యం దానికదే ఏర్పడుతుంది. కానీ జీవితాంతం కౌముది నిస్సహాయ స్థితిలో పడివుండాలని దైవం రాసిపెట్టిందే! ఈ వేదన క్రమంగా నా జీవితాన్ని కూడా హరిస్తుందేమో.. ఇప్పటికే జీవితంలోని అన్ని వెలుగులు పోగొట్టుకుని గాఢమైన తిమిర సదృశ నైరాశ్యభావనలో మగ్గిపోతున్నాం. ఎవరెంత కాలం ఈ భూమి మీద వుండగలరో ఎవరం చెప్పలేం. సుహాస్ కుటుంబం ఆయుఃప్రమాణం ఎక్కువగా వున్నదే. ఇక నా విషయానికొస్తే మా వంశం చాలా పరిమితమైంది. భార్యా, భర్త, ఒకరిద్దరు సంతానంతో కుదించబడిపోయింది. నియంత్రణ అంటూ పాటించకపోయినా మా అమ్మా నాన్నల వంశం ఎందువల్లనో విస్తరించ లేదు. పైగా శతాధిక వయోవృద్ధులు ఎవరూ ఉన్నట్టు లేదు. మా అమ్మ తన ఏభయ్యవ ఏటే మరణించింది. ఇదంతా పరిశీలించి చూస్తే నేను చిరకాలం నా కూతురి కోసం ఈ భూమిమీద జీవించి వుండకపోవచ్చు. ఒకవేళ జీవించినా అంతులేని దుఃఖం, భయం నన్ను కృంగదీస్తూనే వుంటాయి. నేనూ క్రమంగా ఒక జీవచ్ఛవమైపోతానేమో! కాని అభం శుభం తెలియని అమాయకురాలైన కౌముదికి ఏ దిగులు, భారము తెలియదు. ఏ భావాల ప్రభావము సోకనప్పుడు నేనున్నా లేకపోయినా తేడా ఏముంటుంది? ఎంత ఎక్కువ కాలం వుంటే మాత్రం ఏముంది? దానికన్నా తను ముందుపోతే.. అమ్మచాలు నాకొచ్చిదంటే కౌముది యవ్వనకాలంలోనే తను దూరమైపోవచ్చు.





దీనికోసం నేనెన్ని సంవత్సరాలు జీవించగలను?

పరిపూర్ణంగా కాకపోయినా కొంతమేరకన్నా దానిలో అభివృద్ధి, వికాసం కలిగితే ఎంత బాగుండును అనుకునేదాన్ని. దాని అమాయకపు చేష్టలు, వెర్రి అరుపులు, కేరింతలు చూస్తుంటే అంత విచారంలోనూ ఏదో శాంతి కలిగేది. భగవంతుని సృష్టిలో ఇంతకన్నా అమాయకులెవరన్నా వున్నారా? జీవితంలో ఎదురయ్యే కష్టాలేమీ దానికి తెలియవు. వేళకు తిండి వంటివి, కప్పడానికిగుడ్డ, బయటి ప్రపంచం నుండి రక్షణకోసం ఒక ఆశ్రయం, కాస్తంత కరుణ ఇవే నేను దానికి ఇవ్వవలసినవి. సుహాస్ హోదా, డబ్బు, ఆస్తి ఐశ్వర్యం ఇవేవి దానికి అవసరంలేదు. వాటి విలువా, ఆనందం అది అనుభవించలేదు.

వైద్యం ఆశ అలా ముగిసిపోయాక మా అత్తగారు కౌముది జాతకాన్ని తీసుకుని కనపడిన దైవజ్ఞులందరికీ చూపటం ప్రారంభించారు. ఆవిడ ఉద్దేశం ఏదన్నా గ్రహశాంతి జరిపిస్తే పరిస్థితి కాస్త మెరుగుపడవచ్చునని. సుహాస్‌కి అటువంటి ప్రయత్నాల మీద నమ్మకం లేదు. వైద్యానికి లొంగని రోగం ఏ మహనీయుల మహిమ వల్లనైనా లొంగకపోతుందా అని అత్తగారి ఆశ. ఆవిడ ఆశను బలపరుస్తూ ఎవరో ఒకరు ఏదో ఒక ఉదంతం చెప్పుండేవారు. కొంతమటుకు సుహాస్‌కు తెలియకుండా



ఆవిడ తన ప్రయత్నాలు సాగించేవారు. పిల్ల ఆరోగ్యం కోసం ఏవేవో మొక్కులు, పూజలు చేయించేవారు. మా అదృష్టవశాన మహానుభావుడెవరైనా తటస్థపడి మా కష్టం తీరిపోకూడదా లేక మేము కొలిచే దేవి దేవతలెవరైనా కరుణించి మా పాపకు ఆరోగ్యం ప్రసాదించకపోతారా అని నేను వెర్రిగా తపన పడేదాన్ని. సిద్ధ పురుషులు, మహాత్ములు, యోగిపుంగవులు, సాధువులు, సన్యాసులు ఎవరు మా ప్రాంతానికి వచ్చినా మా అత్తగారు పిల్లను, నన్ను తీసుకొని అక్కడికి చేరుకునేవారు. బిడ్డను వాళ్ల పాదాల ముందు వుంచి తరుణోపాయం చెప్పమని ప్రార్థించేవారు. చాలామంది స్వామీజీలు పాపను దయగా చూసి, శిరస్సుమీద చెయ్యి వుంచి ఆశీర్వదించేవారు. మంత్రించిన కుంకం ఇచ్చి రోజూ ఉదయం, రాత్రి నొసటదిద్దితే ఉపశమనం కలగవచ్చునేవారు. కొందరు "ఈ పాప కర్మావశేషం అనుభవించటానికే ఈ జన్మ ఎత్తింది" అనేవారు. "పరమం పవిత్రం బాబా విభూతం" అంటూ బాబా దాన్ని ఊది పాప నొసట వుంచి, కాస్త నోట్లో వేసేవారు. తన ప్రసాదంతో బాబా తనను నమ్మిన భక్తులెందరినో భయంకరమైన రోగాలనుండి కాపాడిన కథలున్నాయి. "ఆయన్ని మనసారా నమ్ముకో, పారాయణ చేసుకో, మేలు జరుగుతుంది" అనేవారు కొందరు. ఆ నమ్మిక నాకు కొండంత బలాన్నిచ్చేది.

ఒకసారి మా అత్తగారు ఎక్కడికో వెళ్లి, ఎవర్నో కలిసి మంత్రించిన కొబ్బరికాయ, నిమ్మకాయలు తెచ్చి కౌముది తలక్రింద వుంచారు. ఇవన్నీ ఏమిటండీ.. సుహాస్ చూస్తే కేకలేస్తాడు అన్నాను. ఆమె నా ముందుతరం మనిషి. పూర్తిగా ఆధునికీకరణం కాలేదు. కనపడని దైవీశక్తి ఏదో మానవ జీవితాన్ని శాసిస్తుందని ఆమె పూర్తిగా నమ్ముతోంది. ఆ దైవబలం మనిషికి తోడు లేకుంటే మానవ ప్రయత్నాలేవీ ఉపయోగపడవని ఆవిడ ప్రగాఢమైన విశ్వాసం. నేను కూడా ఈ సిద్ధాంతానికేమీ వ్యతిరేకిని కాను. కాని ఎవరేం చెపితే అది చెయ్యటంవల్ల పిల్లకు శ్రమ, వృధా ప్రయాసేకదా! "దీనివల్ల నష్టమేమిలేదు. దుష్టశక్తులేమన్నా ఆవహించి వుంటే తొలగిపోతాయి.. ఏమో ఏ పుట్టలో ఏ పాముందో.. ఆయన ఇలా ఎందరో పిల్లలకి నయం చేశారని చెప్పుకుంటున్నారు. తెల్లారి కాలువలో కలిపేస్తే సరిపోతుంది" అనేవారు. నేనేం చెప్పలేకపోయేదాన్ని. ఎర్రనీళ్ల దిష్టి తీసిపొయ్యటం, నిమ్మకాయలు దిగదూడ్చి పారెయ్యటం, మంత్రించిన అక్షంతలు మంచం చుట్టూ జల్లుతూ నల్లతాడు కట్టటం గ్రహశాంతికి ప్రదక్షిణలు, తైలాభిషేకం, తిలాదానాలు, శాంతి హోమాలు.. ఒకటేమిటి ఎవరేది సూచిస్తే అది చేసేవారు. మొక్కులు, ముడుపులు సరేసరి. ఎన్నిసార్లు తిరుపతికి వెళ్ళి ఆపదమొక్కులవాడిని ప్రార్థించి వచ్చారో లెక్కలేదు. ముక్కోటి దేవతలలో ఏ ఒక్కరైనా తమ మొర అలకించకపోతారా అన్న ఆశ ఆవిడ్ని ఎప్పుడూ ఈ పనులకు ప్రేరేపించేది. అప్పుడప్పుడు నిరాశ నిస్పృహలకు లోనై ఒకటి రెండు రోజులు నిర్లిప్తంగా ఊరుకున్నా మళ్లీ ఎవరో వచ్చి ఏదో సలహా చెప్పటం 'ఇది తప్పక మేలు చేస్తుందేమో.. ఇన్ని చేశాం. ఈ ఒక్కటే చూట్టం వల్ల నష్టమేముంది? వాళ్ల నోటి మాట పుణ్యమాని పిల్ల ఆరోగ్యం కుదుటపడుతుందేమో ఏమో ఎవరు చెప్పగలరు?' అనే ఆశకు లోబడి పోయేవాళ్లం. మా ఆరాటం గమనించి సుహాస్ "ఎందుకమ్మా మీరు అనవసరంగా శ్రమపడతారు. లేనిపోని ఆశలే తప్ప వీటివల్ల ఫలితం ఏమీ వుండదు. దాన్ని అలా

ప్రశాంతంగా వుండనివ్వండి. మీ ఆరాటంతో దాన్ని ఆయాసపెట్టకండి" అనేవాడు.

ఒకసారి నా మరిది తన కుటుంబంతో అదే ఊళ్లో ఉన్న వాళ్ల సన్నిహితులైన వారింటికి ఏదో కార్యక్రమానికి వెళ్లవలసి వచ్చింది. మా కౌముది ప్రస్తావన రాని విషయమేదీ ఇందులో ఉండదు. ఎందుకంటే ఈ కథంతా దానికి సంబదించినదే, దానిదే. మా మరిదికి కౌముది అంటే జాలితో కూడిన వాత్సల్యం ఉండేది. తన పిల్లలు సాధ్యమైనంత వరకు కౌముదితో దానికి సంతోషాన్ని కలిగిస్తూ గడపాలని కోరుకునేవాడు. తను దగ్గరుండి వాళ్ళను ఆడిస్తూ వుండేవాడు. నేను, సుహాస్ తరువాత కౌముది గుర్తించే వాళ్ళల్లో అతను కూడా ఒకడు. ఆరోజు పార్టీకి తన పిల్లలతో కౌముదిని కూడా తీసుకువెళతామన్నాడు. నేను ముందు అంగీకరించలేదు.

"అదెందుకు సుభాష్, మీకు ఇబ్బంది! అది తిన్నగా వుండదు." అన్నాను.

"ఏమీ పరవాలేదు. నేను దాన్ని నా దగ్గరే ఉంచుకొంటాను. నువ్వేమీ దిగులు పడకు వదినా" అన్నాడు. అతని భార్య కూడా ఏమీ అనలేదు. ఆమెకూ కౌముదంటే ఇష్టమే. అందువల్ల కావచ్చు భర్త ప్రతిపాదనని వ్యతిరేకించలేదు. నేనో సుహాసో లేకుండా ఇంకెవరన్నా దాన్ని తమతో బయటకి తీసుకువెళ్లటమన్నది ఇంతవరకూ జరగలేదు. నాకు చాలా ఆనందమనిపించింది. వెంటనే అందమైన మంచి ఫ్రాక్ వేసి, తలదువ్వి చక్కగా తయారుచేశాను. కారులో బాబాయి పక్కన బుద్ధిగా కూర్చొని బయటకు వెళుతున్న మా అమ్మాయిని చూస్తుంటే టాటా చెప్పి సంబరపడిపోయాను.

అయితే ఈ సంబరం ఎక్కువసేపు నిలవలేదు. "వచ్చేశారా.. ఇదేమి అల్లరి చేసి మిమ్మల్ని ఇబ్బంది పెట్టలేదు కదా?" అంటూ భుజాలమీద పడి నిద్రపోతున్న కౌముదిని తీసుకున్నాను.

సుభాష్ నవ్వి "ఏంలేదు వదినా, నిద్రపోయింది" అని వెళ్లిపోయాడు.

తరువాత వాళ్ళ పిల్లాడు వచ్చి కౌముదితో ఆడుకుంటున్నప్పుడు అన్నాడు "నిన్న కౌముది పార్టీలో అల్లరి చేసింది పెద్దమ్మా. అన్నమంతా చిందరవందర చేసి పడేసింది. పెద్దగా అరుపులు. మమ్మీ ఇక మీద ఈ పిచ్చిపిల్లను తీసుకొస్తే ఊరుకోనని డాడీ మీద అరిచింది" పసిపిల్లలు దైవ స్వరూపాలు. వాళ్ళకి కల్మషం తెలియదు. ఉన్నది ఉన్నట్లుగా చెప్పడం తప్పని వాళ్లకి తెలియనంత నిర్మల హృదయులు. నేనేమి మాట్లాడలేదు. వాడా మాట నాతో అననట్లే గడిపాను. నా మనసులో ఒక అగాధం ఏర్పడింది. ఇటువంటిదేదో జరుగుతుందని నేను భయపడక పోలేదు. అయినా దానికి కాస్తంత ఆనందం లభించవచ్చని ఆశపడ్డాను. పైకి ఏమీ అనుకోకపోయినా వాళ్ళకి, నాకు మధ్య సన్నని బీట ఏర్పడింది. వాళ్లు నా పిల్లని ప్రేమించాలని, తమ పిల్లలతో సమానంగా చూడాలని, దాని వెర్రిపనులు పట్టించుకోక సహనంగా ఉండాలని నేను వాళ్లనుండి ఆశించివుంటాను. అది అన్యాయమో న్యాయమో, సహజమో అసహ

## కొత్తగాలి...

**శ్రీరామ నామాలు**
**శతకోటి**
**అవినీతి రూపాలు**
**అనంతకోటి**

*–జి.మోహన్ వెంకట రత్నాజీబాబు,*
*హైదరాబాద్*



జమో నన్న మీమాంస, ఆలోచన నాకు లేదు. నా కూతురు విషయంలో నేను చాలా స్వార్థపరురాలిని. అందరూ దా న్నలాగే ప్రేమించాలని ఆశపడతాను. అది ఎంత అసాధ్యమో నాకు తెలుసు. అయినా దాని శరీరాన్నే చూడాలా.. అంద మైన పసిమనసును చూడకూడదా అనిపి స్తుంది.

"బయటి సమాజంలో నీ కోరిక తీరదు. ఏదన్నా సంస్థలో చేరిస్తే అక్కడ మనం అనుకున్నట్లు కొంత స్నేహబంధం దొరుకు తుంది. అక్కడ అందరూ అటువంటి పిల్లలే వుంటారు కనుక" అన్నాడు సుహాస్.

అలా చేస్తే బాగుంటుందనుకుంటు న్నావా నువ్వు! అతని మాటల్లో దాన్ని ఏ సంస్థలోనన్న చేర్చి వదుల్చుకునే సంకల్పం వుందేమోనని అనుమానించాను. అతను కౌముదిని అమితంగా ప్రేమించే తండ్రి, అయినా నా కూతురి విషయంలో ఎప్పుడూ ఎవరి ఆలోచన ఎలా ఉంటా యోనన్న భయమే నాకు!

"నేనా ఉద్దేశంతో అనలేదు. నిజానికి నాకు అటువంటి సంస్థల మీద భరోసా లేదు. నిస్సహాయులైన పిల్లల్ని మనమే ఇంట్లో జాగ్రత్తగా చూసుకోవాలి కాని ఎంత మంచివారైనా కరుణార్ద్ర హృదయం కలవారైనా పరాయివాళ్లు దాన్ని మనలా చూస్తారని నమ్మలేం. అయితే ఒకటి. అక్కడ పిల్లలు ఇష్టాలు, అభిరుచులు గ్రహించి తగిన శిక్షణ ఇస్తారు. అది వాళ్ల మానసిక ఎదుగుదలకు దోహదపడు తుంది. తనవంటి పిల్లల సహచర్యంలో ఉండటం వల్ల స్నేహం, ప్రేమ, ఆనందం దొరుకుతాయి."

"చాలా ఖర్చువుతుందేమో? !" ఏదో ఆలోచిస్తూ అన్నాను.

"ఖర్చు విషయం కాదు, దాన్ని ఎక్కడో వదిలి మనం వుండగలమా.. అది ఆలో చించు ముందు."

"మన తరువాత దీని గురించి శ్రద్ధ తీసుకునే వాళ్లెవరుంటారు? వాళ్ళకు ఇది లేనిపోని భారంగా తయారవుతుంది కదా? ఎవరి బరువు బాధ్యతల్లో వాళ్లు సతమతమవుతున్నారు"

సుహాస్ నావంక అదోలా దిగులుగా చూశాడు. "ఇప్పుడా ఆలోచన ఎందుకు చెప్పు" అని మాత్రం అనగలిగాడు.

"నిజమే ఇప్పుడా అవసరం లేదనుకో.. కాని మన పిల్లను గురించి దూరం ఆలో చించాలికదా" సుహాస్ కెందుకో నా మాటలు నచ్చలేదు. నిశ్శబ్దంగా బయటకు వెళ్ళిపోయాడు.

రవిని చేర్చటం కోసం అతని తండ్రి ఎన్నో స్కూల్సు, సంస్థల వివరాలు సేకరిం చాడు. కొన్నింటికి వెళ్ళి చూసి వచ్చాం కూడాను. మాలాంటివాళ్ళు ఆ వివరాలు తెలుసుకోవటం మంచిదని నేను కౌము దిని తీసుకుని వాళ్ళతో వెళ్ళాను. మంచి భవనం, పెద్ద ఆటస్థలం వుంది. పిల్లల ఆటలకు తగినవన్నీ అందంగా అమర్చివు న్నాయి. మేం ఒక రోజంతా అక్కడ గడిపాం. మా ఇద్దరు పిల్లల్ని, రవిని, కౌముదిని అక్కడ చేరుస్తారనుకుంది అక్కడి పిన్సిపాల్. ప్రతి ఒక్కటీ మాకు వివరంగా చూపించింది. పిల్లలకు ఆహారం ఎక్కువగానే ఇస్తున్నారు. ఆయాలు శ్రద్ధ గానే వాళ్ళ అవసరాలను కనిపెట్టి చూస్తు న్నారు. ఆ బిల్డింగ్‌లోనే ఒక డాక్టరు. ఒక సైకియాట్రిస్టు కూడా వున్నారు. చాలా మంది పరిచారకులే వున్నారు. అంతా శుచిగా శుభ్రంగానే వుంది. పిల్లలకు కొందరు టీచర్స్ చిన్న చిన్న చేతిపనుల్లో శిక్షణ ఇస్తున్నారు. కొందరు వచ్చీరాని పిచ్చిగీతలు గీస్తున్నారు. రంగులు పూస్తు న్నారు. కొందరు ఏవేవో అర్థం కాని మాట



లతో పాడుతున్నారు. కొందరు పిల్లలు అక్షరాలు దిద్దుతున్నారు. కొందరు క్యారమ్స్, బంతిలాంటి ఆటలు ఆడుకుంటు న్నారు. అడుగడుగునా పిల్లల్ని సిబ్బంది కంట్రోలు చేస్తూనే వున్నారు. వాళ్ళ చేతుల్లో సన్నని బెత్తాలుండటం నాకు నచ్చలేదు. పిల్లలు ఆడుకుంటున్నారు. కానీ అందులో స్వేచ్ఛ కనపడటంలేదు. మేం చూస్తుండగానే కొందరు పిల్లలు దెబ్బలు తిని గోలగోలగా ఏడవటం ప్రారంభిం చారు.

"వీళ్ళతో ఇదేనండి సమస్య! వున్నట్టుండి సడన్‌గా అల్లరి ప్రారంభిస్తారు. ఎప్పుడే విధంగా ప్రవర్తిస్తారో చెప్పలేం. ఒకసారి బుద్ధిగా ఆడుకుంటారు. ఒక్కోసారి భయంకరంగా కొట్టుకుంటారు. అందుకని మరీ ఫ్రీగా వదిలెయ్యడానికి లేదు" అంది ప్రిన్సిపాల్.

ఇంతలో కొందరు పిల్లల్ని ఇద్దరు అసి స్టెంట్స్ లోపలకు తీసుకువచ్చారు. ఆ పిల్లల్ని వాళ్ళు బయట తిప్పి తీసుకువచ్చి నట్టున్నారు. వాళ్ళు అలసిపోయినట్టు న్నారు. తలలు వేలాడేసి ఒగురుస్తూ వస్తు న్నారు. ఆమె వాళ్ళని ఆపి "ఇట్రండి పిల్లలూ.. కొత్తవాళ్ళు కనిపిస్తే విష్ చెయ్య మని చెప్పానా?" అంది విష్ చెయ్యట మంటే ఏమిటో మళ్ళీ వాళ్ళకు చేతులు జోడించి నమస్కారంచేసి చూపిస్తూ. పిల్లలు బుద్ధిగా తలలూపి నమస్తే అంటూనే చేతులు జోడించారు. చాలా మందికి ఆ మాట పలకటం సరిగా కుద రలేదు. కొందరికి నమస్కారం చెయ్యటం చాత కాలేదు.

"ఎప్పుడూ నవ్వుతూ వుండాలని చెప్పానా.. ఏమిటట్లా ఏడుపు ముఖాలేసు కుని వున్నారు?" అందావిడ. వాళ్ళు నిర్లి ప్తంగా చూశారు. పువ్వు వికసించినట్టు సహజమైన ఆనందలాస్యం పసిహృద యాలలోంచి రావాలికాని.. మర్యాదపూర్వ కంగా నవ్వు తెచ్చుకోవటం ఆ వెర్రిపిల్ల లకేం తెలుస్తుంది? గార్డ్ చేతుల్లో వున్న బెత్తాలు వాళ్ళని జడిపిస్తున్నాయనిపిం చింది.

ఎక్కడికి తీసుకువెళ్తారు.. రోజూనా.. అప్పుడప్పుడా..? " ఆవిడ నావంక సహ నంగా చూసింది. మేం వచ్చిన కారు. ఇద్దరు పిల్లలు చేరవచ్చుననే ఆశ, ఆవిడ్ని శాంతంగా అంతసేపు మా ప్రశ్నలకు జవా బులు చెప్పనిచ్చివుండవచ్చు.

"ముందే చెప్పింది. పైవాళ్ళనెవళ్ళని లోపలికి రానీయం.. రూల్స్ ఒప్పవు. పేరెంట్స్ నెలకో సండే వస్తారు. కావా లంటే వాళ్ళతో బయటికి తీసుకువెళ్ళచ్చు. మళ్ళీ సాయంత్రానికి తెచ్చి దింపెయ్యాలి"

"నెలకోసారా?!" ఆశ్చర్యపోయాను.

"అంతకాలం తల్లిదండ్రుల్ని చూడకుండా పిల్లలు వుండగలరా, బెంగపడరూ"

"అలవాటు పడిపోతారు. కొత్తలో అమ్మా నాన్న కావాలని పేచీ పెడతారు కొందరు. తిండి, నీళ్ళు ముట్టకుండా హఠం చేస్తారు. మెల్లిగా వాళ్ళే దారిలోకి వస్తారు. అస్తమానం పేరేంట్స్ కనిపిస్తుంటే వాళ్ళి క్కడ వుండడం కష్టం. వాళ్లతో వెళ్ళిపోతా మని గోల చేస్తారు. ఇక్కడ వుండే పిల్లలం దరూ పెద్దవాళ్ళ పిల్లలు. వాళ్ళకి మంచి మ్యానర్స్ నేర్పటం కోసం ఇక్కడ వుంచు తారు. ఇక్కడందరూ ట్రైన్డ్ టీచర్సే. ఇటు వంటి పిల్లల్ని ఎడ్యుకేట్ చెయ్యాలంటే ఎంతో ఓర్పు, నేర్పు కావాలి"

నేను అడిగిన ప్రశ్నకు ఆమె ఎంతో సంజాయిషీ ఇచ్చింది. ఆమె చెప్పిందీ నిజమే! తరచూ తలిదండ్రులు వచ్చిపో తుంటే చిన్న పిల్లలు వాళ్ళను విడిచి వుండటానికి ఇష్టపడరు.

తానుగా ఆహారం తీసుకోవటం, బట్టలు వేసుకోవటం, దైనికావసరాలు వాళ్ళకు

వాళ్ళే చేసుకోగలగటం, బొమ్మల పుస్తకాలు చూడటం, అంకెలు, అక్షరాలు నేర్చుకోవటంలాటి అత్యవసరమైన విషయాలు నేర్పటం వాళ్ళకి చాలా అవసరం. ఇంటి దగ్గర కూడా అవి నేర్పించాలనే ప్రయత్నిస్తారు. అయితే స్కూల్లో సుశిక్షితులైన వాళ్ళు నేర్పే విధానం, కుశలత మామూలు వాళ్ళకి వుండవు. పిల్లలు కాస్త సుఖంగా గడపటానికి- తోటి మిత్రులలో స్నేహ వాతావరణంలో పెరగటానికి అనువైన స్థలం ఆ స్కూలే. ఇల్లు కాదు. అయినా బతికి వున్నంతకాలం వాళ్ళు అక్కడే వుండాలన్నది క్రూరమైన ఉద్దేశం. వాళ్లందర్నీ అలా చూస్తున్నప్పుడు హృదయవిదారకమైన అనుభూతికి లోనయ్యాను. ప్రతి బిడ్డ వెనుక కానరాని హృదయవేదన, బాధ, కన్నీరు, నిరాశనిస్పృహలు స్పష్టంగా నాకు ద్యోతకమై నా మనసు చలించిపోయింది. ప్రతి ఒక్కబిడ్డలోనూ మా కౌముదే నాకు కనిపించసాగింది. వాళ్లంతా జీవించి వున్నంతకాలం ఇక్కడ నేరం చెయ్యని ఖైదీలే. కొందరు పిల్లలు మా దగ్గరకు పడుతూ లేస్తూ వచ్చి ఏదేదో చెప్తున్నారు, నవ్వుతున్నారు.

ఒకమ్మాయి చాలా ఎత్తుగా, నల్లగా, బాగా లావుగా వుంది. వదులుగా అంగీలా మడమల మీదకు జారుతున్న ఆకుపచ్చ రంగు ఫ్రాకు వేసుకుంది. తలంతా పల్చగా క్రాపు చేసివుంది. "నా పేరు సరస్వతి. మా అమ్మవాళ్ళు నన్నిక్కడ వదిలేశారు.. నాకు బాగుండదు కదా. నేను చచ్చిపోదామనుకున్నాను.." అని ఆగి పెద్దగా నవ్వి.. మళ్లీ పదేపదే అదే చెప్పసాగింది. నోట్లోంచి చొంగ కారుతోంది. మొద్దు పెదాలు ఉమ్మితో తడిసిపోతున్నాయి. మాటలు అర్థమవుతున్నా స్పష్టత లేదు. ఒక చెయ్యి, కాలు ఆడవు.

"ఈ పిల్లని పదేళ్ళ క్రితం ఇక్కడ వదిలేశారు. మునుపు అప్పుడప్పుడు చూసిపోయేవారు. ఇప్పుడు ఎవరూ రావటం లేదు. వదిలేసుకొని నిశ్చింతగా ఉన్నారు. అలాంటివారు కూడా ఉంటారు" సిబ్బంది ఎవరో చెప్పారు.

వెంటనే అందుకుంది ఆ అమ్మాయి. చెయ్యి తిప్పుతూ, ఉద్రేకంగా "రారు. ఎవరూ రారు. నేను చచ్చిపోవాలనుకున్నాను" ఒకేమాట పదేపదే చెప్తోంది. కాసేపు చూసి ఆయా బెత్తం ఝళిపిస్తూ లోపలికి లాక్కెళ్లింది

"ఈ అమ్మాయికి నాలుగో ఏట పోలియో వచ్చి కాలు, చెయ్యి చచ్చుబడిపోయింది. మెదడు దెబ్బతింది. ఇంకా ఇప్పుడు చాలా నయం. తన పనులు చేసుకోగలదు. ఇది చాలా ముఖ్యం. అందులో ఆడపిల్లలకు మరీ బాధ. బుర్ర మాత్రం పనిచెయ్యదు. మాట్లాడితే అదేపనిగా చెప్పిందే చెప్తుంది. ఒక్కోసారి చాలా మొండిగా వుంటుంది. చాలా బలంగా వుంటుంది. చూశారుగా ఆడపిల్లలకి ఇక్కడ చాలా భద్రత వుంటుంది. బయటి ప్రపంచంలో ఇటువంటి పిల్లలకు క్షేమం, రక్షణ దొరకదు. అందుకే ఇక్కడ చేర్చిపోయారు" అంది మాట్రిన్.

రవిని అక్కడ వదిలేసి తిరుగుప్రయాణమయ్యాం. తల్లిని చుట్టుకుని రవి కదలనియ్యలేదు. తల్లి కన్నీరు ఆపుకోలేకపోతోంది. ఇంతవరకు వాళ్ల పిల్లవాడ్ని ఎడ

## కొత్తగాలి...

**కడుపు**
**నిండితే తేన్పు**
**పండితే కాన్పు**

– బద్ది నాగేశ్వర రావు,
అనకాపల్లి



బాసి వుండలేదు. కానీ ఇక తప్పదు. కుర్ర వాడు సుఖంగా కాలం గడపటానికి అది అనువైన స్థలమనే వాళ్లు భావించారు. మాట్రిన్ వచ్చి నేర్పుగా కుర్రవాణ్ణి విడదీసి దగ్గరకు తీసుకొంది. వాడి అరువులు, ఏడుపు వినిపించుకోకుండా వెంటనే మేం ఆగది వదిలి బయటికి వచ్చేశాం. గేటు దగ్గర వరకు మమ్మల్ని అనుసరించి వచ్చిన ప్రధానోపాధ్యాయురాలు మళ్లీ చెప్పింది "ఇక్కడ మీ అబ్బాయి సంతోషంగా వుంటాడు. కష్టం కాని, దుఃఖం కాని వాళ్ళకు తెలియవు. ఇక్కడ పిల్లలకు తగిన రక్షణ వుంటుంది. వాళ్ళ శక్తికి మించిన పనులు ఏమీ చెప్పం. అతనికి మనసుకి నచ్చిన ఒకరిద్దరు స్నేహితులు కూడా ఇక్కడ వుంటారు. వాళ్ళతో అతని కాలం సుఖంగా గడిచిపోతుంది. ఒంటరితనం వుండదు. అయితే ఒకటి గుర్తుంచుకోండి. ఒక నెలరోజులు దాటితే కానీ మీరు మీ పిల్లల్ని చూడటానికి అనుమతించం" అన్నారు.

ఇక తోవ పొడవునా రవి తల్లి బాధపడుతూనే వుంది. తరువాత అప్పుడప్పుడు ఆమె పిల్లలతో కలిసి మా యింటికి వస్తూ వుండేది. కౌముదిని చూస్తూ తన కొడుకుని తలచుకొని దిగులుపడేది. "ఇక వాడి గతి అంతే! ఎవరూ ఏమీ చేయలేరు. క్రితంసారి వెళ్ళినప్పుడు మరీ బాధనిపించిందమ్మా. వాడికి పిచ్చి పెరిగి పోయిందంటున్నారు. తోటిపిల్లల్ని కొడుతున్నాట్ట చాలా గోల చేస్తున్నాట్ట. మరీ అదేమిటో ఇక్కడ మందంగా పడుండేవాడు. అక్కడెందుకల్లా చేస్తున్నాడో.. గొలుసులేసి కట్టేశారు. ఒకసారి పారిపోవాలని ప్రయత్నించాట్ట." అంది.

నేను మళ్ళీ రవిని చూట్టానికి వెళ్ళలేదు. మానసిక ఆరోగ్యంలేని అంతమంది పిల్లల్ని ఒకేచోట చూసి వచ్చాక నన్ను నేను సంబాళించుకోవటానికి చాలా సమయం పట్టింది. ఏడుస్తూనో, అరుస్తూనో, బాధపడుతునో మత్తుగా జోగుతూనో ఆ పిల్లలు వివిధ రూపాల్లో పదేపదే గుర్తువచ్చి మానసిక అశాంతికి గురయ్యాను. ఇప్పుడు రవి విషయం వింటుంటే మనసు జలదరించింది. పాపం తల్లికి, తండ్రికి, ప్రేమించే చెల్లెళ్లకు దూరంగా ఎంత బాధ పడుతున్నాడో. చేరదీసి అక్కున చేర్చుకొని సేదతీర్చే ఆప్యాయత, అనురాగం కరువై అమాయకుడు ఎంత అలమటిస్తున్నాడో. పిల్లాడ్ని అక్కడ చేర్చి తప్పు చేశారనిపించింది.

"ఎంతో కష్టపడి డబ్బు కట్టాం. వాళ్ళేం చేసినా వాడి మంచి కోసమే. వాళ్ళేమన్నా వాడి శత్రువులా! గుండె గట్టి పరుచుకోవాలి. తీసుకొచ్చి ఇంట్లో వుంచుకొని మనం మాత్రం ఏంచెయ్యగలం" అంటున్నారాయన.

"మీ పిల్లని చూస్తుంటే వాడ్ని చూసినట్టే అనిపిస్తోంది. నేను బతికినకాలం ఈ కోత తప్పదమ్మా" ఆమె బాధ అర్థం చేసుకోగలను. ఓదార్చటానికి మాటలే దొరకవు. లేవసలు. ఒకవేళ ఏమన్నా చెప్పగలిగినా అవి ఒక్కోసారి వాళ్ల వ్యధను పెంచేవిగానే ఉంటాయి. ఏ ఆశాలేని ఆ నిర్భాగ్యులను ఊరడించడానికి సున్నితమైన మాటలు, మభ్యపెట్టే మాటలు దొరకవు. మానసికంగా ఏదో కారణంగా దెబ్బతిన్న పిల్లల సంఖ్య తక్కువగానే ఉంటుంది. అయితే వాళ్లవల్ల జరిగే గందరగోళం, అశాంతి మాత్రం ఎక్కువే. వాళ్ల తల్లిదండ్రులు కూడా శాంతంతో వారిని భరించలేరు. భగవంతుని సృష్టిలో వాళ్లకన్నా అమాయక, నిస్సహాయ ప్రాణులెవరూ ఉండరు. అయినా ఎవరూ వీరిని క్షమించి సహించలేరు.

మా కౌముది బడిలో మిగతా పిల్లల్లా

పాఠాలు నేర్చుకోలేకపోతోందని, వాళ్లలా సహజంగా, చక్కగా ప్రవర్తించలేకపోతోందని, కనీసం సరిగా మాటలన్నా పలకలేకపోతోందని అవమాన భారంతో కృంగిపోయేదాన్ని. బయటకు తీసుకువెడితే అందరూ దాన్ని వింత జంతువును చూసినట్టు చూస్తుంటే గుండె దహించుకుపోయేది. 'పిల్లలో ఏదో తేడా ఉంది. వెర్రిపిల్లలా ఉంది' అన్న తేలిక మాటలు కూడా చెవిన పడేవి. మనసంతా దుఃఖం ఆవరించేది. నా బాధ ఏమిటో అర్థం చేసుకోలేక అది వింతగా, అయోమయంగా నా ముఖంలోకి చూస్తుంటే చిన్ననవ్వు నవ్వి 'ఏమీ లేదమ్మా' అని దగ్గరికి తీసుకుని సముదాయించలేకపోయేదాన్ని. సుహాస్, నేను దానిపట్ల ఎంతటి ప్రేమానురాగాలు వ్యక్తం చేస్తున్నప్పటికీ అది దిగులుగా ఒక మూల ముడుచుకుపోయేది. ఏదో తీర్చలేని దురదృష్టం తన్ను పట్టి పీడిస్తోందని గ్రహించినట్లనిపించి నా మనసునెవరో మెలివేసినట్లయ్యేది. అది ఎంత గాఢమైన అజ్ఞానంలో ఉంటే అంత మంచిదనుకునేదాన్ని. దాని స్థితి దానికే తెలియని దశలో ఉన్నందువల్ల జీవితభారం దాని మీంచి తొలగిపోయి నాపైన ఉండటంవల్ల దాన్ని ఎలా భరించాలో నేర్చుకోసాగాను.

"కర్మగతిని ఎవరు తప్పించగలరు? ఏ జన్మలోని పాప ఫలమో ఇప్పుడా పిల్లని పట్టిపీడిస్తోంది. దానికోసం మీరలా బెంగ పడుతూ కూర్చుంటే ఏం కార్యం... గుండె దిటవుపరచుకోవాలి. పిల్లలందరూ ఇల్లాగే ఉంటారని భయపడక్కర్లేదని డాక్టర్లు కూడా చెప్తున్నారు. పిచ్చిపిల్ల, దానికీ ఒక తోడుండాలి కదా. ఎందరున్నా రక్తసంబంధం విలువ వేరుకదా.. కష్టమో, సుఖమో భగవంతుడు ప్రసాదించిన దాన్ని స్వీకరించక తప్పదు కదా. మీరిద్దరూ ఇంకా చిన్నవాళ్లు. ఎంతో జీవితం ముందుంది" ఇలా కొందరు ఉద్బోధించే

## కొత్తగాలి...

**ఆక్సిజన్ ఇస్తాయి**
**ఆయుస్సు పోస్తాయి**
**పచ్చని చెట్టుపై వేటు**
**పర్యావరణానికి చేటు**

**– మేడిచర్ల సూర్య ప్రకాశరావు,**
రామరాజులంక

వారు. ఆ మాటల అర్థం నన్ను మరింత కృంగదీసేది.

"నీ గురించే ఆలోచిస్తున్నావు.. వాడి గురించి కూడా చూడు మరి. ఎలాంటి మనిషి ఎలా అయిపోయాడో నీకేమన్నా తెలుస్తోందా.. ఎంతసేపు దానితో గదిలో తలుపులు బిగించుకుని కూర్చుంటే ఎలా.. బాధ ఉంటుంది. అందరికీ ఉంటుంది. మాకు లేదా?! అయినా బతుకు ఆగిపోయిందా.. లేదే.. సాగాలి కదా.."

వాళ్లే ఉద్దేశంతో మాట్లాడినా అటువంటి మాటలు నా గుండెల్ని శూలాలతో పొడిచినట్లుండేవి. మనసు లేకుండా, మనసును చంపుకుని మామూలుగా ఏమీ లేనట్లు, అంతా సవ్యంగానే జరిగిపోతున్నట్లు గడపటమెల్లాగో నా వంటి వాళ్లకు అర్థంకాని విషయం. అలా అని నా అంతరంగాన్ని ఎవరి ముందు విప్పి చూపలేను. మనిషి శరీరానికి తగిలిన గాయాల్నే చూడగలరు కాని మనసు గాయాన్ని చూడగలగటం కష్టం. 'నీ కష్టం నీ ఒక్కడిదే. నీ సంతోషం మాత్రం నీతో ఉన్న నలుగురుదీ' అంటారు పెద్దలు. అందుకే లాగుంది. నిజమే, మా కౌముది ఎలా ఉన్నా మా జీవితం ఆగిపోలేదు. సాగిపోతూనే ఉంది. కాని సాగిపోవటమంటే రోజులు, నెలలు గడిచిపోవటమేనా... అదే అయితే మేం జీవించి ఉన్నట్టే లెక్క.



కాని ఉన్నాం, ఉన్నామన్నా పేరుకి! ఎప్పటికీ జీవితాంతం కోలుకోలేని హృదయాఘాతంతో మా మనసులు రక్తసిక్తమై ఉన్నాయి. అంతూ దరీ లేని విషాదాన్ని తప్ప మరే విధమైన సుఖసంతోషాల్ని నా నుంచి సుహాస్ ఆశించటం లేదని నాకు తెలుసు. నా మనసంతా బండబారిపోయి అన్యమైన భావావేశాలేమీ తాకలేని రాయిలా మారిపోయిందని అతనీసరికి గ్రహించే ఉంటాడని, కావాలని అతను కోరుకుంటే ఆ స్వేచ్ఛను, ఆనందాన్ని కావాలనుకుంటే నేనెంత మాత్రం ఆటంకపరచనని కూడా అతనికి తెలుసు. కాని సుహాస్ ఈ ప్రపంచంలోని అందరు మగవాళ్ల లాంటివాడు కాదు. అతనిది చాలా అరుదైన వ్యక్తిత్వం. అటువంటి భర్తలు స్త్రీలకు దొరకటం అసాధ్యం. కానీ ఆ అదృష్టానికి నేనిప్పుడు మురిసిపోవటంలేదు. అలా కాకుండా సుహాస్ చాలామంది మగవాళ్లలా ఇంకోలా ఉంటే నా మనోభారం కొంత తగ్గేదేమో! అతనిలో కూడా అంతులేని దిగులు గూడుకట్టుకుని ఉందని ఆ చూపులే చెప్పేవి. రోజూ అతను కంపెనీ నుంచి వచ్చాక ఒకటి రెండు మాటలు.. ప్రశ్నలు.. కౌముది గురించి అంతే! నన్ను నా మానాన వదిలేసి నిశ్శబ్దంగా తన పనులు చేసుకుపోయేవాడు.

కౌముది మాకు కాస్త దూరంగా ఉంటే నేను మారవచ్చని మా అత్తగారి అభిప్రాయం కావచ్చు. ఒకసారి బయటపడిపోయింది. "పిల్ల గురించే ఎప్పుడూ ఆలోచించి తన మనసు కూడా పాడుచేసుకుంటోంది. ఒరే.. సుహాస్.. పిల్లకు ఎక్కడ సుఖంగా ఉంటుందో చూసి అక్కడ చేర్చటం మంచిదనిపిస్తోంది" ఆ మాటలు కఠినంగా తోచినప్పటికీ నిజానికామె బాధపడుతూ చెప్పినవని నాకు తెలుసు. కొత్తలో అయితే ఇటువంటి సలహాలకు నా స్పందన అతి తీవ్రంగా ఉండేది. క్రమంగా వాస్తవానికి అలవాటుపడి నా మనసు గట్టిపడసాగింది. విపరీతంగా చూసేవాళ్లను పట్టించుకోవటం మాని కాస్త ఆదరంగా పలకరించేవాళ్లు తటస్థపడితే బలం పొందుతున్నాను. ఎవరేం చెప్పినా, ఏం ప్రయోజనంలేదని నిర్లిప్తంగా విని వదిలెయ్యటం కాకుండా, అవి మా అమ్మాయికెంత సహాయపడతాయని ఆలోచించసాగాను. అపరాధం చేసినట్లు మా పిల్లతో తలుపులు మూసుకుని గదిలో కూర్చోవటం మాని తల ఎత్తుకు తిరగటం అలవాటు చేసుకున్నాను. దానిపైన నేను పెట్టుకున్న ఆశలను, అతిశయాలను, సంకోచాలను, సంశయాలను వదిలి వాస్తవాన్ని ఉన్నది ఉన్నట్లు అంగీకరించగల స్థైర్యాన్ని సాధించుకోగలిగాను. కించిత్తు ఆశ లేకపోయినా ఏమన్నా మార్పు ఎప్పుడో మెరుపులా రాకపోతుందా అన్న ఆశ నన్ను ఉత్సాహపరుస్తూ జీవశక్తిని ప్రేరేపిస్తూ ఉండేది. ఈ కారణాలవల్ల మా కౌముదిని దానికి తగిన మంచి సంస్థలో చేర్చాలన్న ప్రతిపాదన నన్నేమీ పెద్దగా కదల్చలేదు. నా మనసులో నేను కూడా అందుకు సమాయత్తమవుతున్నాను. ఒకవేళ సుహాస్ కూడా అదే మంచిదని భావిస్తే అలాగే చెయ్యటానికి కావలసిన స్థైర్యాన్ని అలవరుచుకుంటున్నాను. మేము శాశ్వతం కాదు. కాని అది మా తరువాత ఎంతో కొంతకాలం జీవించవచ్చు. అటువంటి పరిస్థితుల్లో దాన్ని ఆలనా పాలనా చూసే బాధ్యత ఎవరు తీసుకుంటారు? ఇక్కడ మనోభావాలకు, సున్నితమైన సెంటిమెంట్స్‌కి తావివ్వకుండా సహజంగా ఆలోచించటం చాలా అవసరం. సుహాస్, నేను దాని భవిష్యత్ గురించి ఎన్నో రాత్రుళ్లు చర్చించుకునేవాళ్లం. "చూద్దాం. మనం మన బేబీని

గురించే ఆలోచిస్తున్నాం. ఇంతకన్నా దయనీయమైన స్థితిలో కొందరుంటారు. శరణాలయాల్లో వీరికెంత ఆదరణ, ఆప్యాయత లభిస్తుందో చెప్పలేం. ప్రభుత్వం నడిపే ఆశ్రమాలలో కంటే మంచి ప్రైవేటు సంస్థ చూద్దాం. ఇప్పుడేం తొందరలేదు! చిన్నపిల్ల అమ్మని, నాన్నని వదిలి ఉండ లేదు" అని తల తిప్పుకుని వెళ్లిపోయేవాడు సుహాస్. 'ఈ వయసులోనే మంచిది. క్రమంగా మార్పుకి అలవాటు పడిపోతుంది. పెద్దైతే మరీ కష్టం...' అనుకున్నాను. అయినా అంతా సుహాస్ ఇష్టం. కౌముది విషయం అతనెంత తీవ్రంగా ఆలోచిస్తున్నాడో నేనెరుగుదును.

కౌముదిని వుంచటం కోసం, తగిన సంస్థ కోసం మేం ఎన్నోచోట్ల తిరిగాం. ఈ విషయంలో మా పరిచయస్తులు, స్నేహితులు, బంధువులు అప్పుడప్పుడు అక్కడొక మంచి శరణాలయం ఉందని, నిర్వహణ బాగుందని చెప్తుండేవారు. 'కేవలం సంస్థకు చెల్లించే ఫీజువల్లే దాని సామర్ధ్యాన్ని, పిల్లలకు అక్కడ లభించే ఆనందాన్ని అంచనా వెయ్యలేం. డబ్బు ఎంతైనా చెల్లించగలం. కానీ దానికి సంతోషాన్నిచ్చే వాతావరణం కావాలి. పెద్ద పెద్ద భవనాలు, తోటలు, ఆటస్థలాలు ఇవి కాదు మనం చూడవలసింది. ప్రేమతో పిల్లల్ని కనిపెట్టి ఉండే పరిచారకులు వున్నారో లేదో మనం తెలుసుకోవాలి. ఇటువంటి శ్రద్ధ, మానవత్వం వాళ్లనుంచే పిల్లలకు లభించాలి. ఎప్పుడూ వాళ్లని జాగ్రత్తగా సంరక్షించేది వాళ్లే' అనుకునేవాళ్లం. మా జీవితాల గురించి, ఇతర సమస్యల గురించి ఆలోచన ఎప్పుడో మర్చిపోయాం. కౌముది గురించే మా నిరంతర వ్యధ, తపన. నేను, సుహాస్ తప్ప దానికీ ప్రపంచంలో మరో స్నేహస్పర్శ ఏర్పడలేదు. స్నేహపూరితమైన వాతావరణంలో ఉంటే బాగుంటుందన్న ఆలోచన నాకు కలిగింది. ఏ వయసులోనైనా ఆ వయసువాళ్ల స్నేహం మనిషి కోరుకుంటాడు. కౌముది ఆరోగ్యవంతులైన పిల్లలతో కలిసి మెలసి గడపగలదన్నది ఒట్టిమాట. తనవంటి పిల్లలతోనైనా సంతోషంగా గడపగలుగుతుందేమో. ఈ విషయమై నేను, సుహాస్ ఎన్నో రోజులు, ఎన్నోసార్లు తర్జన భర్జనలు చేసి దాన్ని శిక్షణాలయంలో చేర్పటమే మంచిదనే నిర్ణయానికి వచ్చాం. 'పిల్లను నీకన్నా ఎక్కువగా అర్థం చేసుకుని ప్రేమను పంచగలవారెవరూ వుండరు. నీకన్నా మంచి చెయ్యగలిగేవాళ్లు కూడా వుండరు. ఆ బాధ్యత నీది, తరువాత నాది. ఇద్దరిదీ అనుకో.. ఎవరికి ఎక్కువ, ఎవరెంత భరించగలరు అన్నది కాదు. దాని ఒంటరితనం, నిస్సహాయత సరే. ఇది ఎవరూ మార్చలేని స్థితి.. విడిచిపెట్టేది కాదు.. మనం ఈ దుఃఖానికి అలవాటు పడిపోవాలి. ఇదే మన ప్రధాన మనోభావమైపోయింది. ఈ ప్రపంచం బలహీనులకు, నిస్సహాయులకు అనువైంది కాదు. మన తరువాత కౌముది పరిస్థితి ఏమిటి.. ఒక కొత్త పరిస్థితికి ఎప్పుడో ఒకప్పుడు అకస్మాత్తుగా వచ్చిపడే మార్పులను తట్టుకుని ఉండగలిగే స్థిరచిత్తం బేబీకి ఎల్లా ఉంటుంది? నువ్వో, నేనో లేకపోతే దాన్ని ప్రేమగా సాకే పనిమనిషో లేకుండా ఉండగలగటం ఒక్కసారిగా కష్టమవుతుంది.

### కొత్తగాలి...

**ఎందుకైనా మంచిది**
**మీ అమ్మాయికి తోడెళ్లు!**
**లేకుంటే పొట్టన పెట్టుకుంటాయి**
**తిరుగుతున్న మగ తోడేళ్లు.**

– మాధవీ సనారా, అనకాపల్లి







మనల్ని విడిచి దాని ప్రపంచంలో బతకడానికి మెల్లిగా అలవాటుపడాలి. మన సహాయంతోనే మెల్లగా అక్కడ ఉండగలిగేట్టు ఇప్పుడే చూడటం మంచిది' సుహాస్ మాటలు ఇలా ఉండేవి.

దానికి మన ప్రపంచంలోనే దాని బాహ్య స్వరూపాన్ని చూసి అసహ్యించుకుని దూరంగా పోయేవాళ్లు కాకుండా ఆదరించే అర్థం చేసుకోగల మిత్రుల్ని వెదకాలన్నా మా ప్రయత్నాలు ఫలితాలినివ్వలేదు. అందరూ హేళన చేసేవాళ్లు, తిరస్కరించేవాళ్ళే కాకపోయినా ఎక్కువ మంది దూరదూరంగానే ఉండేవారు. కొందరు కొద్ది రోజులు ప్రయత్నించినా ఏదో నిరాసక్తతతో దూరంగా తొలగిపోయేవారు. ఎదుటివాళ్లను చూడగానే వాళ్ల మనసు గ్రహించి స్నేహభావాన్ని ప్రకటించగలిగే శక్తి మా కౌముదికి ఉండేది కాదు. అది ఒక కారణం కావచ్చు తమతో కబుర్లు చెప్పటం ఆడటం, పాడటం, పరుగులు తియ్యటం వంటివి ఏమీ లేకుండా శాపగ్రస్తలా ఎటో చూపు నిలిపి అయోమయావస్థలో ఉండే మా అమ్మాయి తోటి పిల్లల్ని ఎలా ఆకర్షించగలదు? ఒక్కొక్కసారి దాని భావ ప్రకటన విధానం పిల్లల్ని భయపెట్టేది. దానివల్ల ఎవరికీ ఏవిధమైన హాని ఉండదని, భయపడవద్దని ఎందరికో ఎంతో చెప్పి చెప్పి అలసిపోయాను. దాని మూడ్స్ అర్థం చేసుకుని స్నేహం చెయ్యాలన్న చిన్న కోరిక ఆ పిల్లలకుండేది కాదు. వాళ్లు హాయిగా ఆడుతూ పాడుతూ ముద్దు ముద్దు మాటలతో అలరించేవారు. వాళ్లను చూస్తుంటే ఏనాటి పాపమో మా అమ్మాయికాభాగ్యం లేదుక దాని కృంగిపోయేదాన్ని. "ఇక ఇంతే.. విధి నిర్ణయం జరిగిపోయింది. ఎవరూ ఏమీ చెయ్యలేరు. ఇలా రోజులు వెళ్లమార్చాల్సిందే" అని నన్ను నేను సముదాయించుకునేదాన్ని. మా నిర్ణయాన్ని కొందరు సమర్థించారు. అదే అందరికీ మంచిదన్నారు. వాళ్ళలో మా దగ్గర బంధువులున్నారు. అలాగైనా మా నిరంతర వేదన కాస్త మారుతుందని కావచ్చు. కొందరు మిత్రులు చాలా బాధపడ్డారు. 'ఏమీ తెలియని అమాయకులైన పిల్లల్ని, నిస్సహాయులైన వృద్ధుల్ని కుటుంబంలో వుంచుకుని సంరక్షించటం మన ధర్మం. ఎంత మంచివారి ఆధ్వర్యంలో నడుపబడుతున్నా, ఎంత పెద్ద శరణాలయమైనా తమవాళ్ళు పంచే ప్రేమాభిమానాలు వాళ్ళకు అక్కడ దొరక్కపోవచ్చని వాళ్ళ అభిప్రాయం. ఇటువంటి మానసిక క్షోభంతా ఎంతో అనుభవించాకే ఒక నిర్ణయానికి వచ్చాం. ఎంతైనా ఖర్చు చెయ్యగలం అన్న ధీమా

## దురవస్థకు కారణం



ఈ ప్రపంచంతో వచ్చిన పెద్ద చిక్కేమిటంటే మూర్ఖులు, ఉన్మాదులు తమ గురించి తామెంతో కచ్చితంగా వుంటే, మరోవైపు బుద్ధిమంతులు ఎప్పుడూ సంశయాలతో ఉంటారు.

### అశ్లీలతకు అర్థం?

'అశ్లీలత' అనే పదానికి కచ్చితంగా సరిపోయే వివరణ చట్టపరిభాషలో దొరకడం కష్టం. అయితే జడ్జీని షాక్‌కు గురిచేసేది ఏదైనా దానిని అశ్లీలతగా పరిగణించడం న్యాయస్థానాలకు పరిపాటి అయింది.

వున్నా దానికి తగిన ఆర్జన మార్గాలు కూడా వెతుక్కోవల్సిన అవసరం వుంది. మా అమ్మాయికోసం ఆర్థిక సహాయం చేసేవాళ్ళు కూడా ఎవరూ మాకు లేరు. ఎవరో సాయం చేస్తారని ఆశ పెట్టుకోవడం అవివేకం. నేనూ సుహాస్- కౌముది కోసం జీవితమంతా ఎంతైనా శ్రమించటానికి సిద్ధంగానే వున్నాం. కౌముదిని మాతో వుంచుకున్నంతకాలం నేనేమీ చెయ్యలేను. నా సమయమంతా తెల్లవారింది మొదలు- రాత్రి మందులు వేసి దాన్ని నిద్రపుచ్చేవరకూ దాని సేవలోనే గడిచిపోతుంది. ఒక్కరోజు ఒక్క గంటైనా దాన్ని విడిచి నేను బయట గడపటానికి కుదరదు. దాన్ని ఏదన్నా మంచి ఆశ్రమంలో చేరిస్తే నేను కూడా ఆర్జనావకాశాలు వెతుక్కోవచ్చు. ఇంతకాలం అత్యవసరమైన, ఇంటికి సంబంధించిన పనులు తప్ప నా సమయంతా కౌముదితోనే గడిపాను. అది చేయగల పనులేమున్నాయో తెలుసుకోవాలని ప్రయత్నించేదాన్ని. అక్షరాలు దిద్దించటం, చిన్న చిన్న మాటలు నేర్పించటం చేసేదాన్ని. అదేం చెయ్యగలదో తెలుసుకోవాలంటే ఏం చెయ్యలేదో తెలుసుకోవటం అవసరమనిపించేది. ఒక్కోసారి దాని ప్రతిస్పందన 'ఇది నార్మల్ ఛైల్డే'నన్న ఆశ కలిగించేది. అది క్షణికమే. మరు నిమిషం అంతక్రితం తను చేసి చూపిందే గుర్తు చేసుకోలేకపోయేది. ఏదో నేర్పించాలని ప్రయత్నించటం, దాని ప్రయాసకు బాధపడి విరమించుకోవటం.

ప్రభుత్వ ఆధ్వర్యంలో నడుస్తున్న ఒక సంస్థను ఎవరో సూచించగా వెళ్ళాను. అంతకుమునుపు కొన్నింటిని చూశాం. అందులో మా పాత మిత్రులు వాళ్ళ బ్బాయి రవిని చేర్చింది కూడా వుంది. అటువంటి సంస్థల గురించి పేపర్లలో వచ్చే సంగతులు కూడా శ్రద్ధగా చదివేదాన్ని. ఒకచోట అనేకమంది మానసిక రోగులు అగ్ని ప్రమాదంలో నిస్సహాయంగా ఆర్తనాదాలు చేస్తూ ఆహుతైపోయిన ఉదంతం నన్ను కలచివేసింది. అటువంటి వ్యక్తులపట్ల కొన్ని సంస్థలు ఎంత నిష్కృతిగా వ్యవహరిస్తాయో తెలిసి తీవ్రమైన వేదన కలిగింది. వాళ్ళంతా పారిపోకుండా ఒకరికొకర్ని కలిపి గొలుసులు వేసి బంధించేవారని, అదొక ప్రైవేటు సంస్థ నడిపే అనాథ వికలాంగుల శరణాలయమని, మంటలు చెలరేగి చుట్టుముట్టిన వాళ్ళు గొలుసుల్తో బంధించి వుండటం వల్ల తప్పించుకోలేక హాహాకారాలు చేస్తూ సజీవ దహనమైపోయారని చదివినప్పుడు ద్రవించని మానవ హృదయం వుండదు. సహాయం కోసం, భయంతో వాళ్ళందరూ పెద్దపెట్టున చేసిన ఆక్రందనలు చుట్టుపక్కల వున్నవారికి పిచ్చివాళ్ళు చేసే గోలగా అనిపించటం- తెల్లవారి జరిగింది తెలుసుకుని వాళ్ళు బాధపడటం.. ఇదంతా చదివాక నాకు అటువంటి సంస్థలపైన ఏర్పడుతున్న ఆశ, సదభిప్రాయం తుడిచిపెట్టుకుపోయింది. దిగ్భ్రాంతులు, సంతాప సందేశాలు, దుర్ఘటన జరిగిన తీరుపై విచారణలు- అవన్నీ కేవలం నిరర్థకం. నిర్లక్ష్యమో, ప్రమాదమో భూమికి భారమైపోయిన కొందరు దౌర్భాగ్యులకు ఆవిధంగా విముక్తి లభించింది. ఆ ఉదంతం నా హృదయాన్ని కలిచివేసింది.

మేం వెళ్ళిన సంస్థ పిల్లలతో కిక్కిరిసి వుంది. అటువంటి స్థలాలు చూస్తుంటే మన సమాజంలో ఇంతమంది మానసిక వికలాంగులున్నారా అని ఆశ్చర్యం కలిగేది. వాళ్ళు సభ్యసమాజంలో ఎప్పుడో కాని కనపడరు. జైలులాటి శిక్షణాలయాల్లోనూ, అటువంటివే గృహ నిర్బంధాలలోనూ, బోనులో బంధించబడిన క్రూర

**కొత్తగాలి...**

**నాన్న ఆర్థికం**
**అమ్మ హార్దికం**
**నేను 'ఆహా'ర్థికం!**

–జి.వి.యస్.ప్రియంవద,
లుంబినీవనం, ఆరసవిల్లి

మృగాల్లా పడి వుంటారు. అక్కడ అడ్మిషన్ దొరకటం కష్టమే. దరఖాస్తులు పంపుకుని క్యూలో నిరీక్షిస్తున్న వాళ్ళు ఇంకా కొందరు వున్నారు. కొందరు పిల్లలు జైలు గోడల్లాంటి ఇనుపచట్రాలు బిగించిన విశాలమైన గదుల్లో బెంచీలమీద కూర్చుని వున్నారు. వాళ్ళందరి వంటిమీద వదులైన నీలిరంగు నిక్కర్లు, చొక్కాలున్నాయి. చాలామందికి తలలు బోడిచేసి వున్నాయి. ఒకరిద్దరి కాళ్ళకు చేతులకు నేరస్థులు పారిపోకుండా వేసే బేడీల వంటి ఇనుప గొలుసులున్నాయి. వాళ్ళు అటు ఇటు కదిలినప్పుడల్లా అవి గలగల శబ్దం చేస్తున్నాయి. వాళ్ళు గందరగోళం చెయ్యకుండా మ్యాట్రిన్లు చేతిలో లాఠీల వంటి కర్రలతో ఖైదీలను కాపలాకాసే జైలర్లలా పచార్లు చేస్తున్నారు. ఈ మానసిక రోగులకి, నేరస్థులకీ తేడా ఏమీ వుండదన్నట్లుంది అక్కడ వాళ్ళ ప్రవర్తన. వాళ్ళే నయం. శిక్షాకాలం పూర్తయ్యాక విడుదలై వెళ్ళిపోగలరు. వీళ్ళకి విముక్తి అన్నది లేదు. వున్నా అది మరణించాకే.

"వాళ్ళంతా ఎందుకక్కడ కూర్చున్నారు.." అని ఒక మ్యాట్రిన్‌ని అడిగాను.

"ఏముంటుంది! ఊరికే అలా కూర్చుంటారంతే.." అన్నాడాయన అదోలా నావంక చూసి. నా ప్రశ్న అతనికి నచ్చలేదు. 'వాళ్ళంతా మతిస్థిమితం లేని వాళ్ళు.. కూర్చోమని లైన్లో కూర్చోబెడితే అలా కూర్చుంటారు. ఎందుకు కూర్చోవడమంటే ఏం చెప్తారు, వాళ్ళకీ కాలం గడవాలి కదా' అన్నట్లుంది అతని చూపు.

వాళ్ళంతా యాంత్రికంగా వుంటున్నట్లుంది. పేరుకు జీవిస్తున్నామంతే అన్నట్లున్నారు. కొందరు రెప్పవాల్చకుండా ఇనుప ఊచల్లోంచి కళ్ళు చీల్చుకుని బయటకు చూస్తున్నారు. వాళ్ళ చూపుల్లో ఏదో నిరీక్షణ.. ఎందుకోసమో గంటలతరబడి అక్కడ కూర్చుని ఆశగా ఎదురు చూస్తున్నట్లుంది. కొందరి చూపుల్లో ఏ భావమూ తోచని గాఢమైన శూన్యం వుంది. కాసేపు బయటి ప్రపంచం చూపించాలని వాళ్ళనక్కడికి చేర్చి వుంటారు. కాని అక్కడ్నించి వాళ్లకు ఆనందాన్ని కలిగించే రంగుల లోకం ఏదీ కనపడదు. కోటగోడల వంటి కొండరాళ్లతో కట్టిన పటిష్టమైన శరణాలయం ప్రహరీగోడ తప్ప.

"పిల్లల్ని చూట్టానికి ఎవరన్నా వస్తుంటారా?"

"ఎందుకు రారు.. వస్తుంటారు. అప్పుడప్పుడు ఒకరో ఇద్దరో.. సాధారణంగా ఇక్కడ చేర్చాక చాలామంది పిల్లల్ని మర్చిపోతారు.. వాళ్ళని చూసుకోవటానికి మేమున్నాంకదా. మీ అమ్మాయిని చేర్చాలని వచ్చారా.. మీలాటి వాళ్లకి ప్రైవేటువైతే బాగుంటాయి కదా."

నేను అటు ఇటు కాకుండా తల ఊపాను. నా కూతుర్ని అక్కడ పొడవైన పీలికలాటి వరండాలో కొయ్య బెంచీలమీద ఒకరికొకరు ఆనుకుని, ఏమీ పట్టని మౌనయోగుల్లా కూర్చున్న పిల్లలలో ఒకదానిగా పోల్చుకుంటున్నాను. వాళ్ళు ఊరికే అలా కూర్చున్నారని చెప్తున్నా, వాళ్ళు దేనికో ఆశగా నిరీక్షిస్తున్నారన్న అనుమానం నాకు కలిగింది. ఊరికే కట్టేసిన కాళ్ళు చేతులతో వాళ్ళలా కూర్చోటంకాక, వాళ్లింకేదో కావాలని ఆశపడుతున్నారన్నది ఆ చూపుల్లో నాకు తెలుస్తోంది.

"ప్లేగ్రౌండ్ బాగుందిగా, ఆడిస్తారా? "

చాలా ప్రయత్నంమీద సహనం తెచ్చుకుని "ఎందుకాడించరు..? మేం ఆడుకోవాలి చెడుగుడు, వీళ్ళతో ఆడించాలంటే"

"బయటికి ఎప్పుడు తీసుకెళ్తారు? "

"తీసుకెడతారమ్మా అప్పుడప్పుడు. ఒక్కొక్కరికి ముగ్గురేసి కాపలా వుండాలి. వీళ్ళలో ఎవడన్నా మంద తప్పిపోయాడంటే మా ప్రాణాలమీదికొస్తుంది. రోజూ కాసేపు బయటికి తీసుకువచ్చి ఈ రోడ్డుమీద ఒకటి రెండుసార్లు తిప్పుతాం. ఇళ్లలో వీళ్ళ అమ్మ నాన్నలు ఏళ్ల తరబడి తాళ్ళు కట్టి గదిలో పడేసి తాళం వేసేవారు" అన్నాడు అదోలా.

ఇంతకన్నా ఏదో సంతోషకరమైందేదో వాళ్లకు కావాలని నాకు తెలిసింది. అదేమిటో వాళ్లకు తెలియకపోవచ్చు అదేమిటో వాళ్లు నోరు విప్పి చెప్పలేకపోవచ్చు మనసనేది ఉంటుంది. బాధకాని, ఆనందంకాని, దుఃఖంకాని, సుఖంకాని దాన్ని అనుభూతి పొందలేని మనసంటూ వుండదు. మాటల ద్వారా తమ అనుభూతిని వ్యక్తీకరించలేని మూగప్రాణుల నుంచి ఇటువంటి మానవజన్మ ఎత్తిన వాళ్లవరకు అనుభూతులకు ప్రతిస్పందించే హృదయం వుంటుందన్న విషయం చాలామంది గ్రహించలేరు. మనోవికాసం లేకపోయినా మనందరిలాగే వాళ్లకూ మనసు, మానవత్వం వుందని తెలుసుకోగలిగితే వాళ్లకు నిజమైన ప్రేమ మనం అందించగలిగినట్లే. ఆ పిచ్చిపిల్లల మనసు తెలుసుకుని తదనుగుణంగా వాళ్లకి కొద్దిపాటి ఆనందాన్ని అందించాలనుకునే స్థితి ఇటువంటిచోట మనకు లభిస్తుందా? అసంభవమనే అనిపించింది. యాంత్రికమైన శిక్షణ, యాంత్రికమైన అభ్యాసం, యాంత్రికమైన దినచర్య, పగలు- రాత్రి చక్రక్రమంలో జీవితకాలం గడిచిపోవటమే. ఆ పసివాళ్లకు అత్యవసరమైన మానసిక వికాసం ఎక్కడ లభిస్తుంది? ఎవరివ్వగలరు? నేను మా కౌముదిని అక్కడ ఊహించుకోలేకపోయాను.

మనం పునరాలోచించుకోవలసిన అవసరం వుందనిపిస్తోంది. ఇంచుమించు అన్నింటి పరిస్థితి ఇలాగే వుంది. కొన్ని చోట్ల పిల్లల్ని మాసిన పట్టాలమీద అనారోగ్యకరమైన వాతావరణంలో వుంచుతున్నారు. నిర్వహణ ఏమీ బాగాలేదు. కొందరు పిల్లలకి నేలమీదే అన్నం పెడుతున్నారు. ఒక్కోచోట అనవసరంగా వాళ్లని బెదిరిస్తూ భయపెడుతున్నారు. వాళ్లకి కనీస స్వేచ్ఛ కూడా వుండటంలేదు. ఒక చోట కొందరు పిల్లల్ని పారిపోవడానికి ప్రయత్నిస్తున్నారని గొలుసులతో కట్టేసి వుంచుతున్నారు. కొందరికి మత్తు ఇంజక్షన్లు ఇచ్చి మత్తులో వుంచుతున్నారు. వాళ్లు తోటిపిల్లల్ని కొట్టి గందరగోళం చేస్తున్నారట. సుహాస్! మన కౌముదికి మన ఇంటికన్నా సురక్షితమైన స్థలం ఎక్కడా దొరకదనిపిస్తోంది. దానికి మనమేమి ట్రైనింగ్‌లాంటిది ఇప్పించలేకపోయినా కనీసం అమ్మానాన్నల దగ్గర వున్న ఆనందమన్నా దొరుకుతుంది. మనం వుండీ దాన్ని అనాథలా అక్కడ వుంచటం నాకు అంత బాగాలేదు.

నేను కౌముది కోసం తగిన సంస్థను వెతకాలని ఒకరకంగా తొందర పడినప్పటి మానసికస్థితి, స్థిరత్వం.. అవన్నీ చూసివచ్చాక మారిపోయింది. అప్పుడు నేను, సుహాస్ అనేక రకాలుగా మంచి, చెడులు నిర్ణయించుకునే ప్రయత్నాలు ప్రారంభించాం. అయితే నేను మళ్లీ మొదటికి వచ్చానని అర్థం చేసుకున్నాడు సుహాస్. దాన్ని హోంలో చేర్పటం మానెయ్యటం. ఈ ఆలోచనలన్నీ ఎక్కువగా




నావైపు నుంచే వచ్చేవి. సుహాస్‌కీ విషయంలో పెద్ద పట్టు ఏమీలేదు.

"నీ ఇష్టం కానీ మనం ముందు ఆలోచించినవన్నీ మర్చిపోయినట్లున్నావు. అక్కడ ఎంతోమంది పిల్లలుంటారు. అచ్చంగా మన దగ్గర వున్నట్లే కౌముది అక్కడ వుండాలనుకుంటే కుదరదు. అందరితో పాటే అదీ. వాళ్లందరిని క్రమశిక్షణలో పెట్టాలి కదా. కొంత కంట్రోలు చెయ్యవలసివస్తుంది. అందువల్ల వాళ్లు స్వేచ్ఛగా లేరని, బందీల్లా



వున్నారని మనకు అనిపించవచ్చు. నిజానికి దీనివల్ల కొంతమేరకు ఇబ్బంది తగ్గుతుంది కూడా. ఇష్టం వచ్చినట్లు పిల్లల్ని వదిలేస్తే నిర్వహణ ఎలా జరుగుతుంది. ఆ కట్టడి వల్ల కొంతలాభం కూడా ఉంటుంది. క్రమశిక్షణ, ప్రవర్తనా నియమావళి ఆ పిల్లలకి నేర్పటం వాళ్ల ప్రధాన కర్తవ్యం. స్నేహితులు ఏర్పడతారు. సమూహంలో ఉంటారు. కనుక కొన్ని సాధారణ పద్ధతులు, మంచి అలవాట్లు నేర్చుకోగలుగుతారు. పదిమందితో కలిసి ఉన్నామన్న సంతోషం ఉంటుంది. అవన్నీ మన కౌముదికి కావాలనుకుంటున్నాం కదా. అక్కడ వాళ్ళ ఇష్టాన్ని గమనించి సంతోషంగా నేర్చుకోగల విషయాలు చెప్తారు కాని ఇష్టం లేనివి బలవంతంగా నేర్పే ప్రయత్నం చెయ్యరు. కొంతమందిలో కాస్త పాజిటివ్ ఛేంజ్ వచ్చిందని అంటున్నారు.

సుహాస్ ఇంత చెప్పినా నా మనసు అంగీకరించటంలేదు. "ఇదంతా మనం అనుకుంటున్నదే.. నన్ను ఒప్పించాలని చెప్తున్నావా మళ్లీ! చెప్పుకోవడానికి అంతా బాగానే ఉంది. ఆ సంతోషకరమైన వాతావరణమే కనపడటంలేదు. తరువాత వచ్చే మార్పు సంగతి అటుంచు. ముందు అది అక్కడ పదిరోజులన్నా వుండగలదంటావా? అట్లాంటిచోట దాన్ని వదిలి మనం నిశ్చింతగా వుండగలమా...? "

సుహాస్ ఇక ఆ చర్చ పొడిగించలేదు.



అప్పటికి కౌముదిని ఎక్కడికైనా పంపా లన్న యోచన పక్కన పెట్టేశాం.

అవన్నీ చూసివచ్చాక నేను మాత్రం నా మనసులో నా కూతుర్ని ఒక అనాథను చేసి అక్కడకు పంపనే కూడదనుకున్నాను. ఎప్పుడో ఏదో జరగబోతుందని, అప్పుడు దాని గతి ఏమవుతుందోనని, ముందుగానే ఏవేవో ఊహించుకుని ఆ పసిదాన్ని బాధించటం అన్యాయమనుకున్నాను. భగవంతుడు ఇచ్చిన దురదృష్టానికి తోడు మేం కూడా దానిపట్ల నిర్దయగా ప్రవర్తించగలమా.. చూస్తూ, చూస్తూ మేం జీవించి వుండగానే దాన్ని అసంతోషకర వాతావరణంలోకి ఎలా గెంటెయ్యగలం? ఇలా ఆలోచిస్తుంటే నా మనసుకి ఏదో శాంతి కలిగేది. దాన్ని వదిలి వుండటానికి నేను నా అంతరాంతరాళాల్లో సంసిద్ధంగా లేనని నాకనిపించింది. 'ఇక అది వుండటమన్నది అసలే సాధ్యంకాని విషయం. నా ఆలోచన స్థిరంగా వుండేది కాదు. ముందు నేను కోరుకున్నట్లు మా తరువాత దానికి ఒక సురక్షితమైన స్థలం ఎప్పటికైనా కావాలి కదా? పెద్దదవుతున్నకొద్దీ దాని సమస్య జటిలమవుతుంది. మంచి స్థలం చూసి మెల్లమెల్లగా ఇప్పట్నించీ ఒంటరిగా తన వంటి వారి మధ్య గడపటం అలవాటు చెయ్యాలనుకున్నానే.. మరి మళ్ళీ ఇదేమిటి? అనవసరంగా భయపడుతున్నానా?" అస్థిరమైన ద్వైదీభావాలమధ్య నా మనసు వూగిసలాడేది. అస్థిరమైన ఆలోచనలతో కాలం గడిచిపోతోంది.

## స్వేచ్ఛ?

స్వేచ్ఛలేకపోతే సృజన వికసించదు. అయితే మితిమీరిన స్వేచ్ఛ అరాచకత్వంవైపు తీసుకెళు తుంది.

పుస్తక పఠనానికి రెండు ఉద్దేశాలు ఉంటాయి. ఒకటి మీరు దాన్ని చదవడంవల్ల అమితమైన ఆనందం పొందవచ్చు. మరొకటి ఫలానా పుస్తకం చదివానని గొప్పలు చెప్పుకోవచ్చు.

ఏ తాత్వికవేత్తకయినా అత్యంత కష్టమైన పనేమిటంటే ఏదేని సమస్యను దానికి పరిష్కారం సూచించేలా ప్రజల ముందుంచడం.



అప్పుడప్పుడు రవి అమ్మ, చెల్లెళ్ళు వస్తుండేవారు. ఆ చిన్న పిల్లలిద్దరూ మా అమ్మాయికి కంపెనీ ఇవ్వాలని తాపత్రయపడుతూ దానిని ఆడించాలని, నవ్వించాలని ఎంతో ప్రయత్నం చేసేవారు. తరచు చూస్తుండటం వల్ల అది వాళ్ళను గుర్తించగలిగేది. వాళ్ళు దగ్గరకి వచ్చి. 'కౌముది' ... అని పలకరిస్తే చిన్న నవ్వులాంటి మెరుపు దాని ముఖంలో కనపడేది. వాళ్ళున్నంత సేపు దాని కదలికల్లో కాస్త చైతన్యం కనిపించేది. దానిని చూస్తూ వాళ్ళు రవిని గుర్తు చేసుకునేవారు. "మా అన్న ఇప్పుడు బాగా వుంటున్నాడాంటీ. ఈసారి మా నాన్నగారు మమ్మల్ని కూడా తీసుకెళ్ళి అన్నను చూపించారు. మమ్మల్ని గుర్తుపట్టాడు, నవ్వాడు" అని ఇద్దరూ వంతులు వేసుకుని మళ్ళీ చెప్పారు.

"ఎలా వున్నాడు.. బాగున్నాడా.. ఏమన్నా మార్పు వచ్చిందా.." అని తల్లిని అడిగాను.

ఆవిడ బరువుగా నిట్టూర్చింది "ఏమి మార్పు వస్తుంది తల్లీ.. ఈ జన్మకింతే.. ఏనాడో పాపం చేసుకు పుట్టాడు! ఒకసారి

వున్నట్టు మరోసారి వుండడు. వైద్యం చేస్తున్నారు, కరెంటు పెడుతున్నారట..” ఆవిడ కన్నీరు ఒత్తుకుంటూ ‘అటువంటి రోగాలకి అదే చికిత్స చేస్తారట... ఆ పిల్ల అప్పుడు మనం వెళ్ళినప్పుడు కనపడిందే సరస్వతి అన్నపిల్ల.. పాపం, అది వెళ్ళిన ప్పుడల్లా మమ్మల్ని పట్టుకుని వదలదు. ఇక వాడు ఈసారి కాస్త మనుషుల్లోనే వున్నాడు. బిస్కట్లిస్తే తిన్నాడు. పక్కవా ళ్ళకి ఇచ్చాడు. చెల్లెళ్ళని చూసి నవ్వాడు. వీళ్ళు అది తలుచుకుని తలుచుకుని మురి సిపోతున్నారు”

“పోనీలెండి.. వైద్యం చేస్తున్నారుగా.. తగ్గిపోతుందేమో నిదానంగా. మా అమ్మా యినీ చేర్పించాలని కొన్ని చూశాం. కానీ నా కంత సంతృప్తికరంగా లేవు. అది వుండలేదేమో అక్కడని...”

“పోనీలేమ్మా.. అక్కడంతా వేరుగా వుంటుంది. ఒక్కోసారి కఠినంగా ప్రవర్తి స్తారు. లేకపోతే వీళ్ళు లొంగరంటారు. మన దగ్గర వున్నట్టు ఎప్పటికీ వుండరు. ఎంత పెద్ద హోం అయినా సరే.. మావాడ్ని గుండె రాయి చేసుకుని వదిలి వచ్చాం. పగలూ రాత్రీ వాడే కళ్ళలో వుంటాడు. ఎప్పుడూ వాడిదే ఆలోచన. తిండి సయించదు. రాత్రిళ్ళు నిద్ర పట్టదు ‘అమ్మ.. అమ్మ’ అని వాడు పిలుస్తున్నట్టే వుంటుంది”

“ఎందుకండీ. మా అమ్మ ఎప్పుడూ ఇలా ఏడుస్తూ వుంటుంది? మా నాన్న చెప్తారు. ఎన్నోసార్లు మా అన్నని వాళ్ళు శ్రద్ధగా చూస్తున్నారని. ఏడాదికో పదేళ్ళకో బాగైపోతుందని, ఇంటికి తెచ్చేసుకోవచ్చని. మా అమ్మ వినిపించుకోదు...!” అంది అమాయకంగా చిన్నపిల్ల. ఆ మాటలు నన్నెంతో బాధించాయి. చిన్నపిల్లలు ఒకరి కొకరు తోడుగా ఆడుతూ పాడుతూ కలిసి మెలిసి ఒక గూటిపక్షుల్లా ఆనందంగా గడ పవలసిన వాళ్ళు దూరమైపోయిన అన్నను

**కొత్తగాలి...**

**స్థానాన్నిబట్టి విలువలు**
**గణితంలో**
**విలువన్నిబట్టి స్థానం**
**జీవితంలో**

-రుక్మిణి, హైదరాబాద్

తలచుకుని ఎంత దిగులుపడుతున్నారో ఆ పసిమాటలే చెప్తున్నాయి.

ఏదో మోస్తరుగా సాగిపోతున్న మా జీవితంలో మళ్లీ ఒక సంచలనం ఏర్ప డింది. గాఢనిద్రలో ఉన్న మనిషిని వెనుక పాటుగా పొడిచినట్లుగా అనూహ్యమైన రీతిలో ఆ దుర్ఘటన మమ్మల్ని దిగ్భ్రాంతికి గురిచేసింది. ఒక తెల్లవారుజాము మూడు గంటల ప్రాంతంలో ‘మా మామగారికి సీరియస్‌గా ఉందని వెంటనే బయలుదేరి రమ్మని ఫోన్ కాల్ వచ్చింది. సుహాస్ గాబరా పడి, ఏవేవో ప్రశ్నలడిగి నిజం తెలుసుకున్నాడు. ‘మనం వెంటనే వెళ్లాలి. నాన్నగారికి బాగా లేదట..’ అతని కళ్లలో నీళ్లు కమ్ముకొచ్చాయి. వెంటనే సిద్ధ మయ్యాం. అప్పుడు గుర్తు వచ్చింది కౌముది ‘దీన్ని తీసుకువెడదామా’ అన్నాడు సుహాస్. ‘మరి తీసుకెళ్లకపోతే ఎలా? ’ ఆశ్చర్యంగా అడిగాను.

“కౌముదిని ఈ పరిస్థితిలో అక్కడికి తీసుకువెళ్లటం మంచిది కాదు. దాన్ని తోవలో కస్తూర్బా సేవాసదనంలో వదిలేసి వెడదాం” అన్నాడు ప్రయాణానికి సిద్ధమ వుతూ.

“కస్తూర్బా సేవాసదనమంటే రవి ఉన్న దేగా.. అందులోనా.. ఇంత సడెన్‌గా... ఎందుకలా.. మనతో తీసుకెళ్లొచ్చుగా” విస్మయంగా అడిగాను. ఒకపక్క మావగా రికేమైందో.. ఎలా ఉన్నారోనన్న ఆత్రుత

మరొకపక్క సుహాస్ ఆకస్మిక నిర్ణయం తో గాబరాపడిపోతున్నాను.

"ఆం.. అక్కడే వుంచుదాం.. మనం రావటానికి కొంతకాలం పడుతుంది. అంత వరకూ అక్కడ ఉంచుదాం. మనం తిరిగి వచ్చాక తెచ్చుకోవచ్చు. ఇప్పుడు దీన్ని మనతో తీసుకెళ్లటం మంచిది కాదు. దాని డ్రెస్సులు కొన్ని బ్యాగ్‌లో సర్దు.. నేను మా ఫ్రెండ్‌కి ఫోన్ చేసి ఆఫీసులో చెప్పమంటాను. త్వరగా కానియ్యి.. మనం లేటు చెయ్యకూడదు. వెంటనే బయల్దేరాలి" త్వరత్వరగా నాలుగైదు కాల్స్ చేసి ఎవరెవరితోనో మాట్లాడాడు. నాకు కాలు చెయ్యి ఆడటంలేదు. సుహాస్ అంత గాబరాగా ఉండటం నేనెప్పుడూ చూడలేదు. "క్విక్.. గెట్ రెడీ" అంటూ త్వరగా అతను నాతో మాట్లాడుతూనే చక చక ప్రయాణమైపోయాడు. పనివాడ్ని పిలిచి జాగ్రత్తలు చెప్పాడు. అతను చాలా టెన్షన్‌లో ఉన్నాడు. మాటి మాటికి.. 'నాన్నా.. అయ్యో.. ఏమైంది నాన్నా మీకు' అని గొణుక్కుంటూ కళ్లు తుడుచుకుంటున్నాడు. నా మనసు ఏదో కీడు శంకిస్తోంది. చర్చలకు, వాదోపవాదాలకు సమయం కాదు. నేను కౌముదిని సిద్ధం చేసేసరికి అతను గ్యారేజ్‌లోంచి కారు తీసి రెడీగా ఉన్నాడు. నేను పనిమనిషి సాయంతో కౌముదిని తీసుకువచ్చి కార్లో కూర్చోపెట్టి లోపల గదులు లాక్‌చేసి వచ్చేసరికి ఇంజన్ ఆన్‌చేసి ఉంచాడు.

"జాగ్రత్తగా చూసుకోండి! మేం ఎప్పుడు వచ్చేదీ ఫోన్ చేస్తాను. పెద్దయ్యగారికి బాగా లేదు. మా ఊరు వెళ్తున్నాం" అని వాళ్లకి చెప్తూనే స్టార్టు చేశాడు. అక్కడికి ఏభై మైళ్ల దూరంలో మా అత్తగారి ఊరికి మేం ఉంటున్న ఊరికి మధ్యన ఉంది సేవాసదనం. తెలతెలవారుతుండగా మేమూ ఆశ్రమ ప్రాంగణంలోకి ప్రవేశించాం. మేం బయలుదేరేముందే సుహాస్ ఆశ్రమానికి ఫోన్‌చేసి మేనేజర్లతో మాట్లాడినట్లున్నాడు. ఇద్దరు అటెండెంట్లతో ఆయన గేటు ముందరే మమ్మల్ని రిసీవ్ చేసుకున్నాడు. ఇదంతా నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది. ఏమిటింత సడెన్ డెసిషన్? కారు వెనుక సీట్లో కౌముది ఇంకా నిద్రలోనే వుంది. ఏదో చెప్పాలని అతని ముఖం చూసి చెప్పలేక ఆగిపోయాను.

"చెప్పానుగా మీకు! అనివార్య పరిస్థితుల్లో మా అమ్మాయిని మీ దగ్గర వుంచి వెడుతున్నాం. ఒక నెలరోజులు దాన్ని మీ రక్షణలో ఉంచుకోవాలి! మా నాన్నగారు పరమపదించారు. ఈ పరిస్థితిలో అక్కడకు తీసుకువెళ్లటం మంచిది కాదని"

"సారీ! మీ పరిస్థితి నాకర్థమైంది.. స్పెషల్ కేసు కింద చేర్చుకుంటాం. ఫీజు కట్టేసి రసీదు తీసుకోండి. మీ అమ్మాయిని గురించి దిగులు పడకండి. ఇక్కడ క్షేమంగా ఉంటుంది" అని ధైర్యం చెప్పాడాయన. వెంటనే కౌముదిని కార్లోంచి దించి, ఎత్తుకుని లోపలకు చేర్చాడు సుహాస్. నాకు చాలా కంగారుగా ఉంది. కౌముదిని అకస్మాత్తుగా ఇలా హోంలో వదిలేసి వెళ్లాలంటే మనసు వెనకాడుతోంది. అక్కడ మామగారు. సుహాస్ నాకుగా చెప్పకుండా దాచినా విషయం తెలిసిపోయింది. కిందటి నెలలో కౌముదిని చూట్టానికి వచ్చినప్పుడు బాగానే ఉన్నారే ఈ మధ్యలో రెండు, మూడుసార్లు ఫోనులో మాట్లాడారు కూడా. ఇంతలో అంత ప్రమాదమేం జరిగింది. భగవంతుడా ఏమిటీ పరీక్షలు.. నేను నిలువెల్లా వణికిపోతున్నాను. మనసంతా స్తంభించిపోయినట్లైంది. అంతా గుడ్లప్ప చెప్పి చూస్తున్నాను విగ్రహంలా. కౌముదిని అక్కడ వుంచవద్దని, మనతో తీసుకెడదామని

కూడా సుహాస్‌తో చెప్పలేకపోయాను. సుహాస్ కొన్ని ఫార్మాలిటీస్ నిమిషంలో పూర్తి చేశాడు. మా ఫోన్ నెంబర్లు ఇచ్చి "ఏమన్నా అవసరమైతే వీటికే చెయ్యండి.. దానికి ట్రీట్‌మెంటు అవసరమేమీ లేదు. మేం తిరిగి వచ్చేవరకూ కాస్త జాగ్రత్తగా చూస్తే చాలు.. ప్లీజ్" అని వచ్చి నా చెయ్యి పుచ్చుకుని "పద.." అన్నాడు. మరోమాటకు తావులేదు. అమాయకంగా నిద్రపోతున్న పిల్లని అలా వదిలేసి పోతున్నామే. తెల్లారి మేం కనపడక ఎంత ఆరాటపడుతుందో.. ఎంత ఏడుస్తుందోనని మనసు విలవిలలాడింది.

"అరూ.. ప్లీజ్.. పరిస్థితి అర్థం చేసుకో.. ఈ సమయంలో దాన్ని మనతో తీసుకెళ్ళటం ఎంతమాత్రం మంచిది కాదు. దిగులుపడకు. వాళ్ళు మనమ్మాయిని బాగానే చూసుకుంటారు.."

మధ్యలో నా ఆలోచనలు గ్రహించినట్లు అనునయిస్తూ చెప్పాడు. హఠాత్తుగా తెలిసిన మామగారి మరణవార్త అతన్ని ఎంతగా కదిలించిందో పాలిపోయిన ఆ ముఖమే చెప్తోంది. ఎప్పుడు లేనిదీ మానసిక క్షోభ అణచుకోవటానికి తోవ పొడవునా సిగరెట్స్ కాలుస్తూనే వున్నాడు.

మేం చేరుకునేసరికి దగ్గర ఊళ్ళలో వున్న బంధువులు, ఊళ్ళో బంధువులు, స్నేహితులు, చుట్టుపక్కల వాళ్ళు అందరూ వచ్చేశారు. సునీత వాళ్ళు కూడా అప్పటికే వచ్చేశారు. మా కోసం ఎదురు చూస్తున్నారు. కౌముదిని హోంలో చేర్చి రావటంవల్ల కొంత ఆలస్యమైంది. మేం వెళ్ళిన కాసేపట్లో సుభాష్, అతని భార్యాపిల్లలు వచ్చారు. ఇల్లంతా విషాదచ్ఛాయలు అలుముకుని వున్నాయి. మా మావగారి తల్లి, తండ్రి వయోవృద్ధులు. వాళ్ళ దుఃఖం వర్ణనాతీతం. మా మావగారి తాతల కాలం నుంచి అక్కడే ఇల్లు, వాకిలీ- భూమి, పుట్రా ఏర్పరుచుకుని స్థిరపడిపోయారు. మేమంతా ఉద్యోగరీత్యా ఎక్కడెక్కడో తిరుగుతున్నా వాళ్ళు నలుగురు మాత్రం ఊరు వదలకుండా అక్కడే వుంటున్నారు. ఊరు ఊరంతా మా ఇంటి ముందే వుంది. కార్డియాక్ అరెస్టన్నారు డాక్టర్లు. నిద్రలోనే ఆయన ప్రాణం పోయింది.

ఎన్నో పనులు, ఏవేవో కార్యక్రమాలు యాంత్రికంగా చేసుకుపోతున్నారు. మా అత్తగారిని సముదాయించటం ఎవరి వల్ల కావటంలేదు. కొడుకులిద్దరూ వాళ్ళు చెయ్యవలసిన అంతిమ క్రతువు శాస్త్రోక్తంగా చేయిస్తున్నారు.

ఎవరూ 'కౌముది ఏదీ' అని ఆ తరువాత కూడా నన్నడగలేదు. దాన్ని గురించి అది మాతో వచ్చిందో లేదో పట్టించుకున్న వాళ్ళు లేరు. ఇల్లంతా బంధుజనంతో నిండిపోయింది. మేం మంచిపనే చేశామని నాకనిపించింది. ఆ రోజంతా రాత్రి పడుకునే సమయం వరకూ కౌముది ఆలోచన అసలు నా మనసులోకే రాలేదు. దాన్ని మరిచిపోయి పూర్తిగా ఒక రోజంతా వున్నానన్న విషయం నన్ను ఆశ్చర్యపరిచింది. తరువాత అది ఎలా వుందో, ఏం చేస్తోందో- ఏమన్నా తిందో లేదో- పేచీ పెట్టి వుండదు కదా అన్న ఆలోచనలు నన్ను కలవరపరిచాయి. రెండో రోజుకి దిగ్భ్రాంతి నుంచి తేరుకుని కాస్త ప్రపంచం

## కొత్తగాలి... 

**చంద్రుడు**
**కిరణాల స్ట్రాలతో**
**చీకటికోలా జల్సా**
**పున్నమి వెన్నెలలో బ్రహ్మాండం**
**ఒక ఖాళీ సీసా**

**-మాధురి, హైదరాబాద్**

## కొత్తగాలి... 

**మంచితనపు**
**విరితోటను**
**స్వార్థం**
**శ్మశానం చేస్తుంది**

– అవుసలి లయ లహరి,
మూసాపేట, హైదరాబాద్

లోకి వచ్చాను. మేం మంచిపని చేశామనే వాళ్ళూ అనుకున్నారు.

ఒకసారి సుహాస్‌తో అన్నాను.. "కౌముది ఎల్లా వుందో ఒకసారి హోంకి ఫోన్ చెయ్యకూడదూ..? అకస్మాత్తుగా వదిలి వచ్చేశాం.. బెంగపెట్టుకుందేమో"

"ఇదిగో కాస్త తీరిక చిక్కాక మాట్లాడదాం చూస్తున్నావుగా..." అన్నాడు. నిజమే, పాపం అతనికి క్షణం తీరిక దొరకటంలేదు. రోజంతా ఎవరో ఒకరు వచ్చి పలకరించి పోతూనే వున్నారు. తదనంతర కార్యక్రమాల హడావుడి వుంటోంది. పుట్టాక ఇన్ని రోజులు కౌముదిని వదిలి నేను ఎప్పుడూ వుండలేదు. దాన్ని తలచుకుంటుంటే నా మనసు ప్రస్తుతం అనుభవిస్తున్న విచారాన్ని మించి వికలమైపోతోంది. మమకారాన్ని చంపుకుని పిల్లను వదిలి వచ్చేసింది నేనేగా అని ఆశ్చర్యంతో కూడిన వేదన నన్ను బాధిస్తోంది. ఫోను చేసి బాగానే వుందని సుహాస్ చెప్పినప్పుడు కాస్త సంతృప్తి చెందినా అది తాత్కాలికమే. ఒక్కరోజు కూడా నన్నెడబాసి వుండని బిడ్డ ఎలా వుందో అక్కడ అని కన్నీటి పర్యంతమయ్యేదాన్ని. ఇరవై రోజులు ఇరవై యుగాలుగా గడిచాయి.

మధ్యలో ఫోన్‌చేసి నేనే దానితో మాట్లాడాలని ప్రయత్నించాను. వాళ్ళు రిసీవర్ దాని నోటి దగ్గర వుంచి మీ మమ్మీ.. మాట్లాడమ్మా. సే.. హలో అనటం నాకు స్పష్టంగానే వినిపించింది. అది ఏదో మాట్లాడాలని ప్రయత్నించింది. కాని ఏవో శబ్దాలు వినిపించాయి. కాని దాని స్వరం వినలేక పోయాను. క్షేమంగానే వుందని చెప్పి ఫోన్ పెట్టేశారు.

ఆ రోజులన్నీ ఎలా గడిచాయో, ఎన్నెన్ని భయంకరమైన శంకలు, అనుమానాలు నన్ను వేధించాయో చెప్పలేను. నా ఆలోచనలకు తగినట్టుగానే ఇల్లంతా నీరవవిషాదంతో దిగులోడుతూ వుండేది. ఇటువంటి సందర్భంలో కేవలం నా కూతుర్ని గురించే నేను దిగులు పడుతుండటం అసమంజసమనిపించేది. అది పెరిగి బాగా పెద్దదయ్యాక నేను లేకపోతే ఏమౌతుంది.. ఇది ఎందుకు వచ్చిందో.. అక్కడ దానికి బాగానే వుందేమోనన్న ఆలోచన నా ఆరాటాన్ని కొంత తగ్గించేది.

అనుకున్న సమయానికన్నా కొద్దిరోజులు ముందే మేం ప్రయాణమయ్యాం. సుభాష్ కుటుంబం, సునీత వాళ్ళు కొంతకాలం వుండదలచారు. వాళ్ళు వెళ్ళాక మళ్ళీ మేమింకొకసారి వచ్చి వుండవచ్చని నిర్ణయించారు. అంత దుఃఖంలోనూ మా అత్తగారు కౌముది గురించే మమ్మల్ని వెళ్ళటానికి అనుమతించారు. ఈసారి మేము దానితో కలిసే రావచ్చు ఇప్పటి పరిస్థితి వేరు.

మేం సేవాసదనానికి వెళ్ళగానే కౌముదిని మా దగ్గరికి తీసుకువచ్చారు. పిల్ల ఇన్నిరోజుల ఎంత బెంగటిల్లిపోయిందో చూడగానే అర్థమైపోయింది. దాని దీనవదనం చూడగానే నా మనసు కదిలిపోయింది. కౌముదిని ఎత్తుకొని అక్కున చేర్చుకున్నాను.

"మీ అమ్మాయి చాలా గోల చేసింది. ఒకటే ఏడుపు. రాత్రింబవళ్లు తిండి తినేది కాదు. ఈ పిల్లతో బాగా ఇబ్బందిపడ్డాం. పారిపోవాలని ప్రయత్నించింది" అంది మాట్రిన్.

"ఇంటి దగ్గర స్వేచ్ఛగా పెరిగిన పిల్ల మమ్మల్ని వదిలి ఎప్పుడూ వుండలేదు. మా కోసం బయటికి రావాలనుకుందేమో" అన్నాను.

"అలా చెయ్యకూడదు. నలుగురితో పాటు వుండాలి" అని ఆమె ఏవేవో రూల్సు చెప్తోంది. అది నా గుండెల్లో తల దాచుకుని పెద్ద పెట్టున ఏడ్వసాగింది. నీరసించిపోయింది. నేను దిగపెట్టినప్పటి ఫ్రాక్ మట్టిమీద నలిగి, మాసి, మరకలతో నిండి వుంది. మలినమైన పసి బుగ్గల మీద కన్నీటి చారలు అట్టలుకట్టి కనిపిస్తు న్నాయి. నా మెడచుట్టూ పెనవేసి వున్న దాని చేతులు భయంతో కంపిస్తున్నాయి. నేను మళ్ళీ ఎక్కడ వదిలిపోతానోనని.. మ్మీ...మ్మీ...ఊ...ఊ... అనీ ఆరాటపడి పోవటం నా కళ్ళ వెంట నీరు ధారగా కార సాగింది.

సుహాస్ కాసేపు నిశ్చలంగా మా వంక చూస్తూ వుండిపోయాడు. తరువాత నిశ్శబ్దంగా నా వెన్నుతట్టి 'పద' అన్నాడు, కౌముదిని నాచేతిలోంచి తను తీసుకొని. అక్కడి వాళ్ళంతా మమ్మల్ని రెప్పవాల్చక చూస్తున్నారు. ఇటువంటి దృశ్యాలు వాళ్ళు తరుచు చూస్తూనే వుంటారు. ఇవన్నీ వాళ్లకు సామాన్యమైన విషయాలుగానే తోచవచ్చు

మేం రవిని చూడాలని వెళ్ళాం. "అతను నడవలేడు. నేలమీద దేకుతాడు. అటు వంటి పిల్లాడికెందుకు గొలుసులేశారు?" అన్నాడు సుహాస్. రవి మమ్మల్ని గుర్తించి గొలుసులు లాక్కుంటూ కాస్త ముందుకు వచ్చాడు.. అంతే.. 'అమ్మే...దీ...' అన్న అర్థం వచ్చేలా ఏదో చెప్పాడు. నా మనసు ఆర్ద్రమైంది. సుహాస్ దగ్గరగా వెళ్ళి అతని తల నిమిరి బిస్కట్ పాకెట్ ఇచ్చాడు. రవి సుహాస్ చెయ్యి గట్టిగా పట్టుకొని చాలా సేపు వదల్లేదు. 'అమ్మ మళ్ళీ వస్తుంది. మేం నిన్ను చూద్దామని వచ్చాం' అన్నాను గద్గద స్వరంతో.

"పారిపోతాడని కాదు. ఇతను పక్కపి ల్లల్ని కొడతాడు. వున్నట్లుండి కోపం వస్తుంది. కంట్రోలు చెయ్యడం కష్టం. చాలా చిన్న పిల్లలు. అసలు కదల్లేని వాళ్ళకి ఇలాంటి పిల్లల వల్ల అపాయం" అంది ఆయా.

సరస్వతి ఈడ్చుకుంటూ ఆయాసప డుతూ వచ్చింది "ఉత్తది వీడు కొత్తడు, ఏ ..ఎత్తడు.. ఎప్పులూను. నా పేరు సర స్వతి.. నాకు బాగుండదు కదా.. నేను చచ్చిపోతా.." పెద్ద గొంతుతో నంగినం గిగా అరుస్తోంది. ఆయా బెత్తం ఆదిలిస్తూ వచ్చింది. 'టాటా ఆంటీ.. అంకులు..' అని సరస్వతి అదేపనిగా అరుస్తోంది. రవి కూడా పెద్ద గొంతుతో టాటా చెప్తున్నాడు. బరువెక్కిన హృదయాలతో కౌముదిని తీసుకొని బయటకు వచ్చేశాం. తోవలో మేం ఒకరితో ఒకరం ఏమి మాట్లాడుకోలే కపోయాం. కౌముది మాత్రం ఆనందంతో కారులోంచి బయటకు తొంగిచూస్తూ కేరిం తలు కొడుతోంది.

సుహాస్ చెప్పిన వార్త నన్ను తీవ్రమైన దిగ్భ్రాంతిలో పడవేసింది. మామూలు పరి స్థితిలోనైతే అదెంతో సంతోషించవలసిన మంచి వార్త. అయితే నట్టనడి సము ద్రంలో ఈత రాక కొట్టుమిట్టాడుతున్న వా డికి చేతికి వున్న అసరా కొట్టుకుపోతున్న ట్లుంది. చప్పున ఏమీ మాట్లాడలేకపో యాను. క్షణం తరువాత మనసు సంబా ళించుకుని 'నువ్వేమనుకుంటున్నావు?' అన్నట్లు అతని ముఖంలోకి చూశాను. ఉద్విగ్నత, ఉత్సాహంలాటి భావాలేవీ లేక అతడు నిశ్చలంగా నా ముఖంలోకి చూస్తు న్నాడు. ఒక్కొక్కసారి నేననుకుంటాను. భావావేశాలకు వేటికీ లొంగని స్థితప్రజ్ఞుడు సుహాసని. తుపానులో చిగురుటాకులా

నేను సంచలించిపోయే ఉద్విగ్న సన్నివేశా లలో సైతం అతడు మౌనంగా, ప్రశాంతంగా ఎలా వుండగలుగుతాడో నా కర్థం కాదు. 'బాధపడి చేయగలిగిందేమన్నా వుంటే.. నేను నీ కన్నా ఎక్కువ బాధ పడతాను. చెప్పు. నీ ఆవేశం, ఆక్రోశం, ఆవేదనల వల్ల ఏమన్నా సాధించగలిగావా? అటువంటప్పుడు ఈ బాహ్య ప్రకటనలెందుకు' అనేవాడు కూల్‌గా. 'నువ్వైతే అన్నింటికీ అతీతుడివి... అందరి మనసూ అల్లా వుండలేదుకదా' అనేదాన్ని.

"జిద్దాలో ఒక కన్‌స్ట్రక్షన్ కంపెనీలో మంచి ఆఫర్ వచ్చింది. మూడేళ్ళు కాంట్రాక్టు ఏమంటావు? మంచి అవకాశం. మనం వద్దనుకుంటే లైన్లో రెడీగా వున్నారు" ఇదీ సుహాస్ చెప్పిన శుభవార్త. ఈ అవకాశం కోసం సుహాస్ ఎదురుచూస్తున్న విషయం నాకు తెలుసు. అతనికీ అందరు ఉద్యోగుల్లాగే ఎన్నో ఫ్యూచర్ ప్లాన్సు వున్నాయి. అయితే ఇప్పుడు.. ఈ పరిస్థితిలో అతను వెళ్ళిపోతే నేను వంటరిగా.. కౌముదితో "ఎల్లాగ సుహా.. ఇప్పుడు.. పాప" అంటూ అతని ముఖంలోకి చూస్తూ సంకోచంగా ఆగిపోయాను. అతని చూపుల్లో స్థిరనిశ్చయం కనిపిస్తోంది. సుహాస్ వెళ్ళాలని నిర్ణయించుకున్నాడని అర్థం చేసుకున్నాను.

"ఇది మనకొక మంచి అవకాశం అరూ..! నేను ఇక్కడే వుండి ఇప్పుడు చెయ్యివలసిందేమీ లేదు. చెయ్యగలిగిందీ లేదు. మనకు దయ చూపేవాళ్ళు వుండవచ్చు కానీ సాయపడేవాళ్ళు లేరు. మన విషయం చాలా నయం. మన కౌముది లాంటి అమాయకులెందరో వున్నారు. భగవంతుడనుకూలిస్తే నా మనసులో ఒక ఆశయం ఉంది. ఇప్పుడు మనకు డబ్బుకు లోటు లేదు. సౌకర్యవంతమైన జీవితం గడపటానికి కావలసిన హంగులన్నీ వున్నాయి. కానీ మనకు మనం సుఖపడటానికి మాత్రమే పరిమితం అవన్నీ.. మనం ఒకడుగు స్వార్థం వదిలి ముందుకు వేస్తే పదిమంది మన వెనుక తప్పక అనుసరిస్తారని నా నమ్మకం. నా ఆశయానికి ఇది ఒక పునాదిరాయి. నన్ను వెళ్లనీ.."

నా పిచ్చి పిల్లతో నన్నొంటరిగా వదిలేసి తనదారిన తాను పోతున్న స్వార్థపరునిలా అతను కనిపించాడు. "ఏమిటి నువ్వనేది. మమ్మల్ని ఇలా ఎలా వదిలిపోవాలనుకుంటున్నావు? నువ్వు లేకుండా నేను దానితో ఎలా? నా వల్ల కాదు. అసలు నీకు బాధ్యత లేదా.. అసలు నువ్వొక తండ్రిగా ఆలోచిస్తున్నావా?"

"నువ్విల్లాగే అంటావని నాకు తెలుసు. ఒకటి చెప్పు. నేను లేకుండా నువ్వు మానేజ్ చేసుకోలేవా.. నువ్వేం చదువు, సంధ్యాలేని మూర్ఖురాలివి కావే. అదీకాక నేను నీకొక పెద్ద బాధ్యతను అప్పగించాలనుకుంటున్నాను" అన్నాడు.

"ఇప్పుడు అప్పగించింది చాలదా? నేనేమీ అదనపు బాధ్యతల్ని మొయ్యలేను" అనేశాను, అతను చెప్పబోయే బాధ్యతలేమిటో తెలుసుకోవాలనే కుతూహలం కూడా చూపకుండా! సుహాస్ కూడా ఆ విషయం మళ్ళీ ప్రస్తావించలేదు. అతని విషయం నాకు బాగా తెలుసు. మనిషి మితభాషి. ఎవరు సహకరించినా, సహకరించకపోయినా తను అనుకున్నది సాధించే తత్త్వం. నా మూలంగా, నన్ను వివాహం చేసుకున్నందువల్ల కౌముది అనే అపస్వరం అతని జీవన రాగాన్ని శృతి తప్పించింది తప్ప సుహాస్ ఓటమి ఎరుగనివాడు. ఏ తప్పూ లేకుండానే అతన్ని విమర్శించటం, అతనివల్లే నాకీ దుస్థితి కలిగిందని నిర్హేతుకంగా అనుమానించటం, అతన్ని న్యూనతపరిచి తరువాత 'అయ్యో' అని బాధపడటం నాకు మామూలైపో



యింది. కాలక్రమంలో నా జన్మ గత సంస్కారాన్ని, వివేకాన్ని ఎంతో అభ్యాసంతో నిలబెట్టుకోగలిగాను.

అనుకున్న ప్రకారం తన కొత్త అసైన్‌మెంట్ మీద జిద్దా వెళ్ళిపోయాడు సుహాస్. అతను వున్నప్పుడు చూసుకునే కొన్ని వ్యవహారాల బాధ్యత కూడా నాపైన పడింది. ఇంట్లో కౌముదిని చూసుకుంటూ బయటి పనులు చేసుకోవటానికి మెల్లగా అలవాటు పడ్డాను. నాకు ఆసరాగా పనివాళ్ళుండేవారు.

మొక్కులు, పూజలు, గ్రహశాంతులు అన్నీ అయ్యాయి. అత్తగారి నమ్మకం వమ్మైంది. ఆవిడ కూడా ఇక కర్మ సిద్ధాంతాన్ని నమ్మి చేతులు ముడుచుకు కూర్చున్నారు. రోజులు గడుస్తున్నాయి. ఎంత కాలం గడిచినా కాని నా కూతురికి తనను గురించి తనకే ఏమీ తెలియదు. బిడ్డ ఎప్పటికీ పసిదానిలాగే వుంటే అదోరకం కానీ దానిలో శారీరక ఎదుగుదల కనిపిస్తోంది. ఇతరుల్లా తాను లేనన్న సత్యాన్ని కూడా తెలుసుకోలేకపోతోంది. దానికి పూర్తిగా ఏమీ తెలియకుండా వుంటేనే నయం కదా.. బాధ పడకుండా వుంటుంది అనుకునేదాన్ని. ఉదయం, సాయంత్రం చల్లగాలిలో, తోటలో, గార్డెన్ ఛైర్లో కూర్చోపెడితే అమితమైన ఆనందంతో ముఖం వికసించేది. సాయంత్రాలు షికారు చెయ్యటమంటే ఇష్టపడేది. వెన్నెల, మంచు, సూర్యోదయంలాంటి ప్రకృతి దృశ్యాలు పదేపదే దానికి పరిచయం చేసేదాన్ని. ఎగిరే పక్షులు, రంగు రంగుల పువ్వులు, పచ్చని చెట్లు దాన్నెంతో ఉత్సాహపరిచేవి. ఒకసారి అది పాటలంటే ఇష్టపడుతున్న విషయం గుర్తించాను. చిన్నపిల్లలు ఇష్టపడే ఒక దేశభక్తి గీతం క్యాసెట్ ప్రతీరోజూ కాసేపు వినిపించేదాన్ని. కొంత కాలానికి అది వచ్చీరాని విధంగా పిట్టలు కూస్తున్నట్టు కీచుగా ఆ పాట గొణుక్కోవటం విన్నాను. అప్పుడు నేను పడిన ఆనందం వర్ణనాతీతం.

మనిషి జీవితంలో ఏదో ఒక దశలో, ఏదో ఒక రూపంలో దుఃఖానుభవం తప్పదు. దుఃఖంలో రెండు రకాలుంటాయి. అనివార్యమైన దుఃఖం- మనిషి తన జీవితకాలం మొత్తం గడిచిపోయినా తప్పించుకోలేనిది ఒకటైతే... కాలక్రమంలో మరుపుకు వచ్చేవి కొన్ని. మా అమ్మ చనిపోయినప్పుడు తిరిగి తనను నేను పొందలేను కదాని ఎంతో విలపించాను. కానీ ఆ దుఃఖం శాశ్వతంగా నాలో వుండిపోలేదు. అమ్మ ఒక స్మృతిగా మిగిలింది. జీవిత క్రమంలో విషాదం పోయి ఊరట చెందాను. ఆ దుఃఖం నా జీవితాన్ని తారుమారు చెయ్యలేదు. అయితే కౌముది వల్ల నేననుభవిస్తున్న దుఃఖం అనివార్యమైనది. ఉపశమనమనేది లేనిది. అమ్మ లేకపోవటమనేది విషాదమే. కాని జీవితాంతం తప్పించుకోలేని దుఃఖం కాదు. మనిషికి మరణం పరిణామక్రమంలో సహజమైంది. ముందు వెనుకలుగా ప్రతీ జీవికి తప్పని సామాన్య సంఘటన. ఆ వ్యక్తిపట్ల మనం పెంచుకున్న ప్రేమానురాగాలననుసరించి ఆ వియోగ తీవ్రత దుఃఖమై మనల్ని బాధిస్తుంది. కాని అది అనివార్యమైందీ, ఓదార్పు లేనిదీ మాత్రం కాదు. కాలం ఆ గాయాన్ని మాన్చి మెల్లగా ఎప్పటికైనా ఉపశమనాన్ని కలగజేస్తుంది. చికిత్సకు వీలులేని, ఎవరూ తొలగించలేని, జీవితాంతం వీడిపోని మానసిక రుగ్మతతో బాధపడుతున్న నా కూతురు వుందే. అది నేనెప్పటికీ తప్పించుకోలేని నిరంతర దుఃఖం. అదీ, దానితోపాటు నేనూ ఆ అవసరమే జీవలక్షణంగా గడపాలి. అది మరిచిపోయి ఊరట చెందడానికి అలవికాని దుఃఖం. బతికి

ఉన్నంతకాలం పట్టి పీడించే దుఃఖాన్ని తగ్గించి మరిపించే శక్తి దేనికుంటుంది?

ఈ దుఃఖానికి అలవాటుపడిపోక తప్పదు. ఈ రకమైన ఆలోచన నా మనో విచారాన్ని కొంతవరకూ తగ్గించింది. క్రమ క్రమంగా నేను నా స్వతఃసిద్ధమైన చురుకుతనాన్ని, సంయమనాన్ని పునర్నిర్మించుకోసాగాను.

ఇక జీవితమంతా ఇంతే.. మేమిలా బతకాల్సిందేనన్న నిరుత్సాహం నుండి బయటపడి సమాధానపడటం నేర్చుకున్నాను. ఎంతో ప్రయాసపడి ఎలాగో పూర్వపు అరవిందలా మళ్ళీ మారాలని ప్రయత్నించసాగాను.

మా కౌముది ఏమి నేర్చుకోగలదు అనే విషయం తెలుసుకోవటానికి ఎక్కువ సమయం వెచ్చించేదాన్ని. చిన్న చిన్న ఆటలు, పాటలు, అక్షరాలు, అంకెలు నేర్పటం మళ్ళీ మళ్ళీ నిర్విరామంగా చేస్తుండేదాన్ని. ఎంత ప్రయత్నించినా, ఎన్నిసార్లు చెప్పినా అది గ్రహించగలిగింది చాలా తక్కువ. ఎక్కువ శ్రమకు తట్టుకోలేకపోయేది. నన్ను సంతోషపరచాలని పాపం కాసేపు ప్రయత్నించినా కొద్దిసేపట్లోనే అలసిపోయేది. దాన్ని శ్రమపెట్టి ఏదో నేర్పాలని ప్రయత్నం చెయ్యటం వలన ప్రయోజనమేముంటుంది? ఒకటి రెండు మాటలు మాట్లాడినా, కొన్ని అక్షరాలు తేలికపాటివి గిలక గలిగినా తీవ్రమైన అభ్యాసం వల్ల చెయ్యగలిగేది కానీ తెలివి ఉపయోగించి కాదు. కానీ అభ్యాసం దాని మెదడును పనిచేయిస్తుందేమోనన్న ఆశ వదిలేది కాదు. దానితో చాలా సున్నితంగా, మృదువుగా వ్యవహరించవలసి వచ్చేది. అసహనం, కోపం ఏమాత్రం సహించేది కాదు.

మా ఇల్లు వెయ్యి గజాల విస్తీర్ణం ఉన్న స్థలంలో మధ్యగా చాలా పెద్దదిగా ఉండేది. ఇంటి చుట్టూ మంచి తోట వుండేది. జీవితం ఆనందంగా సాగిపోయే రోజుల్లో ఆ తోట సంరక్షణ భారం నేనే తీసుకునేదాన్ని. సుహాస్, నేనూ నందన వనంలాంటి తోటను వృథా చేసుకున్నాం. మా ఇల్లెప్పుడూ బంధుమిత్రుల రాకపోకలతో నిండుగా వుండేది. మేమొక ఆదర్శ ప్రాయమైన చక్కనిజంటగా పేరు పొందాము. కౌముది రాక మా జీవితాలను తల్లకిందులు చేసింది. మా జీవన విధానం మారిపోయింది. బయటి ప్రపంచం నుంచి దూరమయ్యాం.

ఇప్పుడు సుహాస్ నాకొక పెద్ద పని అప్పగించాడు. ఇంటి చుట్టూ వున్న శిథిలమైన తోటనంతా కొట్టించి స్థలమంతా బాగుచేయించమన్నాడు. దీని నిమిత్తం పదిమంది కూలీలను నియమించవలసి వచ్చింది. మెల్లమెల్లగా బయటి మనుషులతో అవసరాలు ఏర్పడసాగాయి. మా ఇంటికి పక్కన గల మరో పెద్ద స్థలాన్ని కొనుగోలు చేశాడు సుహాస్. ఆ స్థలంలో పెద్ద బిల్డింగ్ కట్టడం ప్రారంభించాం. ఇక అప్పటి నుంచి నాకు క్షణం తీరిక లేకుండా చేతినిండా పని. సుహాస్ అభ్యర్థన మేరకు అతని కొలీగ్స్ కొందరు నాకు సహాయపడే వారు. ఆరు నెలల్లో విశాలమైన, అందమైన కొత్త భవనం నిర్మించటం పూర్తయింది. అప్పుడే సుహాస్ ఆశయం ఒక వినూత్న రూపాన్ని ధరించి నా కళ్ల ముందు ఆవిష్కృతమైంది. సుహాస్ ఎంద

## కొత్తగాలి...

**గాదినిండా**
**బియ్యముంటే -ఉగాది**
**కడుపే కాలుతుంటే**
**ఇక పండగేదీ?**

– మాధవీ సనారా, అనకాపల్లి

రెందరితోనో సంప్రదించాడు. ఎవరెవరివో సలహాలు, సూచనలు తీసుకున్నాడు. తీవ్ర మైన మనోవేదన నుండి మా 'కౌముది'కి రూపకల్పన చేశాడు సుహాస్. నేను నా దుఃఖమే ప్రపంచానికి దుఃఖమనుకు న్నాను. కానీ సుహాస్ ఇతరుల దుఃఖం తనదిగా భావించాడు. తన కూతురిలో ఎందరో నిర్భాగ్యుల కష్టాన్ని చూడగలి గాడు. అతను నాకు అప్పజెప్తానన్న పెద్ద బాధ్యత ఏమిటో అర్థమై అంతులేని విస్మయం, ఆనందం నన్ను ముప్పిరిగొ న్నాయి. సుహాస్ సూచనల మేరకు పనులు చేయిస్తున్నాను. కానీ 'ఇది మా వల్ల అవుతుందా, ఇంత గొప్ప భారాన్ని మోసే శక్తి మాకుందా' అని మనసులో భయం కలిగేది. సుహాస్ ఒక కర్మ యోగిలా తను అనుకున్న పని చేసుకుపో తున్నాడు. అతడు మిత్రుల సహకారంతో చాలా త్వరగా 'కౌముది' బిల్డింగ్స్, వార్డ్స్, కౌన్సిలర్ వగైరాలన్నీ తయారు కాసా గాయి. తదుపరి కార్యాచరణకు ప్రణాళిక సిద్ధం చేశాడు సుహాస్. దాని ప్రకారం చక చక పనులు జరిగిపోసాగాయి. 'కౌముది' లో పని చెయ్యడానికి సుశిక్షితులైన ఉపా ధ్యాయులు, డాక్టర్లు, మనస్తత్వవేత్తలు, ఆయాలు, పనివారు, తదితర సిబ్బంది నియామకాలు జరిగిపోయాయి. సుహాస్ రెండు నెలలు సెలవుమీద వచ్చి క్షణం విశ్రాంతి తీసుకోకుండా అన్నీ చూసుకు న్నాడు.

'కౌముది' స్థాపనకు చాలా ముందే సుహాస్ మానసికంగా చాలా పనిచేశాడు. దేశ విదేశాలలోని అనేక సంస్థలని అధ్య యనం చేశాడు. ఆ సంస్థల నిర్వాహకుల నుండి సలహాలు, సూచనలు సేకరిం చాడు. శిక్షణ సంస్థలని సంప్రదించాడు. తన ఆశయ సిద్ధికి అవసరమైన పునాదిని ఏర్పాటు చేసుకున్నాడు. అతని ఆలోచన లోని లోతును నేను గమనించలేదు. ఇదంతా మా అమ్మాయి భవిష్యత్తును దృష్టిలో ఉంచుకుని చేస్తున్న ప్రయత్నం గానే అనుకున్నాను. కానీ సుహాస్ మా పిల్లవంటి ఎందరో పిల్లల్ని మనసులో ఉంచుకుని వాళ్ళకేదన్నా సాయపడాలను కుని 'కౌముది' మానసిక వికలాంగుల శిక్ష ణ కేంద్రాన్ని సంకల్పించాడు. ఇంతకన్నా మేమీ జీవితంలో పొందగలిగిన ఆనందమే ముంటుంది?

పేపర్లో కౌముదిని గురించిన సమా చారం చూసి చాలామంది మాకు ఉత్త రాలు రాయసాగారు. ఎక్కువమంది అటు వంటి పిల్లల పేరెంట్స్ రాసినవే. తమ పిల్లల లోపాలను వివరిస్తూ సంస్థలో చేర్పించాలంటే ఏం చెయ్యాలి, ఎంత డబ్బు కట్టాలి అని రాసేవారు. దీని గురించి కూడా మేము చాలా ఆలోచించాం. మిగతా సంస్థలు పిల్లల తల్లిదండ్రుల నుంచి వాళ్ళ సంరక్షణ కోసం ఎంత ఫీజు వసూలు చేస్తున్నారో గమనించాం. సాధా రణంగా వున్నవాళ్లయినా, లేనివాళ్ళ యినా ఫీజులో తేడా ఉండేది కాదు. ఎవ రైనా ధనవంతులు, ఉదారులు ఎక్కువ ఇస్తే ఇవ్వచ్చు కానీ అందరి దగ్గర్నుంచీ ఒకే మొత్తం వసూలు చేస్తున్నారు.

"సంస్థను పూర్తిగా ఉచితంగా నిర్వహిం చడం సాధ్యం కాదు. కొన్నేళ్ళు బాగా పనిచేస్తే కానీ సంక్షేమ శాఖనుండి సహాయం అందదు. ధనవంతులు, ఇవ్వగ లిగినవాళ్ళ నుండి ఎక్కువ తీసుకుంటే లేనివాళ్ళకు కొందరికైనా సేవ చెయ్య గలం. అలా ఇష్టపడినవాళ్ళే తమ పిల్లల్ని మన 'కౌముది'లో చేరుస్తారు" అన్నాడు సుహాస్. ఇదంతా నాకు ఒక్కోసారి చాలా భయం కలిగించేది. కానీ సుహాస్ ఇటు వంటి వ్యర్థమైన భయాలకు, ఆలోచనలకు తావిచ్చేవాడు కాదు. కార్యరంగంలోకి

# కాప్షన్ మీదే - 3




ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. శ్రీధర్ ఆటోగ్రాఫ్‌సహా చక్కని బహుమతి అందుకోండి! బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఏప్రిల్ 16

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082

e-mail : chatura@eenadu.net

---

## ఉత్తమ వ్యాఖ్య :

ఎన్నికలదాకా నిన్ను కొనుక్కున్నా..

అంత తేలిగ్గా చావనివ్వను...

–యరబోలు శ్రీనివాసరెడ్డి,
కట్టకూరు, ఖమ్మం జిల్లా



## కాప్షన్ మీదే - 2

బాగున్న మరికొన్ని కాప్షన్లు:

ఎ.సి.బి. వలలో మరో తిమింగలం అనే పేరు కోసం నన్నిలా చేయడం బాగోలేదయ్యా!

–బి.శ్రీదేవి, చెల్లూరు, తూ.గో.జిల్లా

జీవితమే వలవల
మళ్ళీ ఏల వల?

– ప్రతాపవెంకట సుబ్బారాయుడు,
సికింద్రాబాద్

మాకేనా ఓటు?
డౌటుతీరిస్తే అందిస్తా వల!

– జి.వి.ఎస్.ప్రియంవద,
అరసవిల్లి, శ్రీకాకుళం

అపాయంలో ఉపాయం

–ఎల్.ప్రఫుల్లచంద్ర,
ధర్మవరం, అనంతపురం జిల్లా

దిగాక ఇక కర్తవ్య దీక్షతో ముందుకు సాగి పోవాల్సిందే. కొద్దిపాటి వనరులతో, తగిన సిబ్బందితో ప్రయోగాత్మకంగా ప్రారంభిద్దా మనుకున్నాం. ఉద్యోగంలోంచి రిటైరై, ఆరోగ్యంగా ఉండి సేవా భావం ఉన్న కొందరిని ఆశ్రమ నిర్వాహకులుగా నియమించాం. స్కిల్స్, టాలెంట్స్, క్వాలిఫికేషన్స్‌కంటే అంకితభావం, మానవత్వం, సేవాతత్పరత గల దయార్ద్ర హృదయుల అవసరం ఇక్కడ ఎక్కువ. ప్రేమతో, సహనంతో, లాలనగా పిల్లలను ప్రేమించగల సిబ్బంది కావాలి. కేవలం జీతం తీసుకుంటున్నాం, పని చేస్తున్నామనుకునే ఉద్యోగులతో సేవా కేంద్రాలు నడవవు. కానీ ఆశయంకోసం కాక ఆర్థికావసరాల కోసమే ఎక్కువ మంది పనిచేస్తుంటారు. మామూలు ఆఫీసులు, కర్మాగారాలు, కంపెనీలు వంటి వాటిల్లో అయితే ఇటువంటి ఆలోచన వల్ల నష్టమేమీ ఉండదు. అక్కడ పని చేసేవాళ్ళకి స్కిల్స్, క్వాలిఫికేషన్స్, హార్డ్‌వర్క్ సరిపోవచ్చు. కానీ కౌముది వంటి పిల్లలతో వ్యవహరించే శిక్షణాలయాల్లో పనిచేసేవాళ్ళకు అవి మాత్రం సరిపోవు. ఒక్కోసారి వాటి అవసరం కూడా ఓ తరగతి సిబ్బందికి లేకపోవచ్చు. ఇక్కడ ఉద్యోగికి కావలసింది మానవత్వ భావననే ముఖ్య అర్హత. ఇది లేని సెంటర్స్‌లో పిల్లలను చేర్చటం కన్న ఇళ్లలో ఉంచుకోవడమే మేలు. కనీసం వాళ్ళ తల్లిదండ్రులకు బిడ్డ కళ్ళెదుట వున్నాడన్న సంతృప్తయినా ఉంటుంది.

కాలం గడిచిపోతోంది. మా జీవితాలలో ఏర్పడిన స్తబ్ధత కరిగిపోయి, చైతన్యం వెల్లివిరుస్తోంది. మా కౌముది దినదిన ప్రవర్ధమానంగా విస్తరిస్తోంది. ఎందరో తల్లిదండ్రులు తమ పిల్లల్ని తీసుకువస్తున్నారు. పిల్లల భద్రత కోసం తగిన ఏర్పాట్లు చెయ్యగల ఆర్థికస్థితి కొందరికే ఉంటుంది. మా దగ్గరికి వచ్చి కొద్దిపాటి సొమ్మే వుందని, ఇంకా పోషించవలసిన పిల్లలు వున్నారనీ చెప్పుండేవారు. ఈ ఒక్క బిడ్డకోసం వున్నదంతా ధారపొయ్యటం వాళ్లకు కుదరని పని. ఇక పిల్లల పరిస్థితి ఇంచుమించు ఒకేలా వుండేది. డబ్బు చెల్లించలేని కారణంగా ఏ పిల్లను, పిల్లవాడ్నీ మా సంస్థలో చేర్చుకోకుండా వదులుకోకూడదని మేం నిర్ణయించుకున్నాం. కొంతమంది స్థితిమంతుల పిల్లలు మా కౌముదిలో వున్నారు. వాళ్ల తల్లిదండ్రులు సంఘంలో మంచి గౌరవప్రదమైన ఉన్నత స్థాయి ఉద్యోగులు, వాళ్ళు తమ పిల్లల కోసం ఎంత సొమ్ము వెచ్చించటానికైనా వెనుదీసేవాళ్ళు కాదు. కౌముది పిల్లల పట్ల తీసుకుంటున్న శ్రద్ధ, చేస్తూన్న సేవ అనతికాలంలోనే అందరి మన్ననలు పొందాయి. కొందరు అదృష్టవంతులైన పిల్లల తల్లిదండ్రులు ఉదారంగా విరాళాలు పంపించేవారు. ఎవరూ లేని అనాథలు, ఏమీ తమ తరఫున చెల్లించేవాళ్లు లేనివాళ్లు కొందరు మా సంస్థలో వున్నారు. వాళ్లపట్ల మా సిబ్బంది మరింత మానవత్వంతో ప్రవర్తిస్తారు. చాలామందిలో మానసిక శక్తి లోపించినప్పటికీ దానికి ప్రత్యామ్నాయంగా కొన్ని మంచి లక్షణాలుంటాయి. మనోవైజ్ఞానికులు ఈ లక్షణం చాలా ముఖ్యమైందని గుర్తించారు. మానసికంగా దెబ్బతిన్న పిల్లలతో వ్యవహరించే శాస్త్రనిపుణులు ఈ అంశం యదార్థమైందని, మానసిక అంతర్గత ఎదుగుదల తక్కువగా వున్నా. విచక్షణ, మంచితనం, దయాగుణం, ఎలా ప్రవర్తించాలో గ్రహించగలగటం, ఇష్టాలు వంటి విషయాలలో ఆ బిడ్డ అందరి పిల్లల్లాగే ఉన్నతంగా వుంటుందని నిర్ణయించారు. ఎక్కువ తెలివిగలవాళ్లకంటే మానసికంగా మంచి లక్షణాలు గల సామాన్యమైన తెలివిగలవాళ్లే

# ఫిబ్రవరి-09

# చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. వి.నాగేశ్వరి - లాస్‌పేట్, పాండిచ్చేరి
2. ఎ.లక్ష్మీ సువర్చల - విద్యానగర్, హైదరాబాద్
3. జె.కృష్ణవేణి - పర్లాకిమిడి, ఒరిస్సా
4. డి.భరత్ కుమార్ - అశోక్‌నగర్, కర్నూలు
5. జి.దివ్యశ్రీ - రాజనగర్, కాకినాడ



**సరైన జవాబులు**

1. సింహం 2. కాంచన 3. డేవిడ్ 4.సెల్వీ 5. పాపోడు 6. గోవింద శంకర కురుప్ 7. తుగ్లక్ 8. ఫైవ్ వీక్స్ ఇన్ ఎ బెలూన్ 9. డాక్టర్ ప్రవీణ్ 10. ఫిబ్రవరి 21

జీవితంలో విజయాలు సాధిస్తుంటారని చెప్తారు. ఎందుకంటే విలువలతో ముడిపడని అతితెలివి ఎప్పుడూ వ్యక్తికీ, సమాజానికీ ప్రమాదమే. మనిషికి మనసూ, తెలివి మాత్రమే ముఖ్యం కాదు. వాళ్లలోని మంచి లక్షణాలు కనిపెట్టి, వాటిని తగిన శిక్షణ ద్వారి వెలికితీసి, వాళ్ళు కూడా సమాజాభివృద్ధికి ఎంతో కొంత దోహదపడగలరని తెలియజెయ్యాలని మా ప్రయత్నం. ఇందుకు ఆధునిక మనస్తత్వ శిక్షణ కేంద్రంలో శిక్షితులైన ప్రత్యేక ఉపాధ్యాయుడ్ని నియమించడం జరిగింది. ప్రత్యేకంగా రూపొందించిన పరికరాలతో, ఆధునిక పద్ధతులతో బోధన జరిగేది. అభివృద్ధి మిరాక్యులస్‌గా ఒక రోజులో జరిగేది కాదు. నిరంతర పరిశ్రమ, దీక్ష ఏదైనా కాస్తయినా ఫలితం తీసుకురావటానికి ఎంతో అవసరం.

ఒక్కోసారి కాస్త మందబుద్ధి కలిగి వున్న పిల్లల్ని కూడా మానసిక రోగులుగా భయపడి తీసుకువచ్చేవాళ్లున్నారు. కొద్దిపాటి శ్రద్ధ, సహనంగా ట్రైనింగ్ ఇవ్వటం వల్ల ఆ పిల్లల్లో మార్పు కనపడేది. తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు- సాటివాళ్ల వాళ్లతో వ్యవహరించే తీరును అనుసరించి వాళ్ల ప్రవర్తన మెరుగుపడే అవకాశం కొంతవరకూ ఉంటుంది. మామూలు పిల్లల మనసుల్లాగే వాళ్ల మనసూ వుంటుంది. పరిణితి, మానసిక వికాసగతిలో కొంత వ్యత్యాసముంటుంది. సహనంతో మళ్లీ మళ్లీ ఒకటికి పదిసార్లు అర్థమయ్యేవిధంగా వివరిస్తూ వుంటేనే ఏదన్నా గ్రహించగలుగుతారు. క్రమంగా ఎన్నో పరిశోధనల ఫలితంగా బోధనా పద్ధతులు విస్తరించాయి. కొన్ని పరిశోధనా శాఖల్లో ఉత్సాహవంతులైన యువతీయువకులు ఒక ఉన్నత లక్ష్యసాధన కోసం అంకితభావంతో కృషి చేస్తున్నారు. మా చిన్న సంస్థ వల్ల కూడా కొందరికైనా మేలు జరగాలన్నది మా కోరిక, ఆశయం కూడా.

ఒకప్పుడు నేనున్నప్పటి తొలిదశలోనే చాలామంది తల్లిదండ్రులు వుండేవారు.

తమ పిల్లలు పనికిరానివారని, వారి జీవితాలు నిరర్థకమైనవనీ వెత చెందేవారు. న్యూనతాభావంతో, దుఃఖభారంతో వాళ్లు కూడా మతి చలించినట్లు కనిపించేవారు. ఎవరికి వారు అలవరచుకోవలసినది మానసిక స్థైర్యం. ప్రతివాళ్ళు తమ సంతానం నలుగురిలాగే పెరిగి పెద్దవాళ్లై గౌరవప్రదమైన మంచి జీవితం గడపాలని కోరుకుంటారు. ఆ నలుగురికన్నా తమ పిల్లలు మిన్నగా వుండాలని కూడా ఆశపడటం సహజం. కలిగిన ఒకరిద్దరు పిల్లల మీద అలవికాని ఆశలు పేర్చుకుంటుంటారు. నేనూ మా కౌముదిని అలాగే వుండాలని కోరుకున్నాను. అది అసాధ్యమని తేలిపోయినా ఆ ఆశ మాత్రం ఎప్పటికీ నన్ను విడవదు. ఆ కష్టం, దుఃఖం మాకు అనుభవం కనుక మరింత శ్రద్ధగా కృషి చేస్తున్నాం.

తల్లి, తండ్రి, అందరూ వుండి కూడా కొందరు పిల్లలు అనాథల్లా దీనంగా వుండేవారు. చాలామంది అనలేం కాని కొందరు పిల్లల్ని టీమ్‌ల కప్పగించి చేతులు దులిపేసుకునేవారు. వాళ్ళు చాలా విసిగిపోయి, అలసిపోయి వుండవచ్చు. పిల్లవాడి ఉనికి భరించలేనంతగా నిస్పృహ చెంది వుండవచ్చు. అయినా ఆ పిల్లవాడికి తమ ప్రేమ పూరిత స్పర్శ పలకరింపు కావాలని- అవి అతనికెంతో ఉత్సాహాన్ని, బలాన్ని ఇస్తాయని గ్రహించాలి. తమ పిల్లల్ని ప్రేమించి, వాళ్ళ గురించే నిరంతరం వెత చెందేవాళ్ళు తటస్థపడుతుండేవారు. వాళ్ళ ప్రాణాలన్నీ అక్కడే వదిలి, వదల్లేక వదల్లేక వెళ్ళేవారు. ఒకటికి పదిసార్లు 'అమ్మాయిని కాస్త జాగ్రత్తగా చూసుకోండమ్మా.. ఏమీ తెలియని పిచ్చిపిల్ల' అని ఆయాలని బతిమాలి చెప్తుండేవాళ్ళు.

పిల్లల వల్ల ఆశించిన సంతోషం కలగకపోవటం అటుంచి వాళ్ళు వ్యర్థజీవులుగా తయారుకావటం సహజంగానే తల్లిదండ్రుల గుండెలను ముక్కలు చేస్తుంది. అది వాళ్ళ స్థితి వలన కొంత, పిల్లలు తమ ఆశయాలకు అనుగుణంగా ఎదగటంలేదన్న ఆశాభంగం కొంత కలిగేది. ప్రపంచంలో ప్రతివ్యక్తీ ఏదో ఇతరులు సాధించిందీ, తాము గొప్పగా భావించిందే తమ పిల్లలు కూడా చెయ్యాలనుకుంటాడు. అయితే ప్రతి మనిషికి తను బాగా చెయ్యగలిగిన పనే గొప్పగా, మంచిగా కనిపిస్తుంది. ఇతరులంతకన్నా భిన్నమైన మంచిపనులు చేస్తుండవచ్చు. కాని అది ఇంకోరికి సాధ్యం కాకపోవచ్చు. అందువల్లే ఈ పిల్లలకు నచ్చినవాళ్ళు ఇష్టపడిన పనిలోనే తర్ఫీదు ఇస్తుంటారు. సంగీతంలోనో, రిపేరు వర్క్‌లోనో, కార్పెంటరీలోనో, మెకానికల్ వర్క్‌లోనో, పెయింటింగ్‌లోనో, ఎందులోనో వాళ్ళకి వున్న కొద్దిపాటి ఇష్టాన్ని కనిపెట్టి ఆ అంశంలోనే శిక్షణ ఇస్తుంటారు. వాళ్ళు ఆ పనిలో ఎంత నిపుణత సాధించగలరని కాదు. అది చాలా తక్కువగానే వుంటుంది. అయితే ఆ పని వాళ్ళలో ఏకాగ్రతను, మానసిక ఉల్లాసాన్ని, వికాసాన్ని కలిగించటానికి ఉపయోగపడుతుంది. అలవికాని రోగాలతో ప్రజలు నిస్సహాయంగా మరణించే రోజులు మారిపోయాయి. వైద్యశాస్త్రం గొప్ప ప్రగతిని సాధించింది. చికిత్సలేని రోగమంటూ వుండకూడదని దేశ విదేశాల్లో పరిశోధనలు జరుగుతున్నాయి. అదే విధంగా ఈ పిల్లలు కూడా నిస్సహాయంగా అంతం కాకూడదు. దానికి దారితీసే కారణాలు కనిపెట్టి, మనో వికాసం లోపించడమనేది పూర్తిగా నిర్మూలించాలని పరిశోధనలు జరుగుతున్నాయి. కాలం గడిచిపోతోంది. నాతోపాటు కౌముదికి ఎంతో సందడి. ఒకప్పుడు దానిని ప్రేమించి, స్నేహాన్ని పంచే ఒకరిద్దరు మంచి

# న్యూడిస్ట్ బీచ్




జర్మనీ, పోలెండ్ దేశాల మధ్య ఓ బీచ్ ఉంది. అందులో కొంత భాగం జర్మనీ దేశంలో, మిగిలింది పోలెండ్‌లో ఉంది. జర్మనీ బీచ్ న్యూడిస్ట్ బీచ్. అక్కడికి జర్మన్లు వచ్చి నగ్నంగా సముద్రంలో ఈదడం, బీచ్‌లో పడుకోవటం చేస్తారు. పోలెండ్ బీచ్‌లోని పోలిష్ దేశస్థులు శుభ్రంగా దుస్తులు ధరించి, బైనాక్యులర్స్‌తో జర్మన్స్‌ని గమనిస్తుంటారట. ఇది జర్మన్స్‌కు చాలా ఇబ్బందిగా పరిణమించింది. ఈ విషయం మీద ఇరుదేశాల అధికారులు తలలు పట్టుకుంటున్నారట.




మిత్రులు దొరికితే చాలని ఆరాటపడే దాన్ని. ఇప్పుడు దానికి ఎందరో స్నేహితులు. వాళ్ళకు వయసుతో నిమిత్తంలేదు. అందరూ దైవస్వరూపులైన పసిపిల్లలే. ఒంటరితనమనేది లేదు. రోజు నా చెయ్యి పుచ్చుకుని అందరి దగ్గరికి వెళ్ళి పలకరిస్తుంది. దాని భాష వాళ్ళకు చక్కగా అర్థమవుతుంది. కల్మషం ఎరుగని అమాయకమైన దాని నవ్వు వెన్నెల్లా వ్యాపిస్తుంది. అది చూస్తుండగా ఎవరూ ఆ పిల్లల్ని దండించడానికి వీల్లేదు. వాళ్ళపట్ల పరుషంతో వ్యవహరించినా పెద్దగా అరుస్తూ నా దగ్గర పితూరీ చేసేది. మాటల్లో చెప్పలేకపోయినా ఎన్నో విధాలుగా తనరిస్తే భావాలను వ్యక్తపరిచేది. ఎవరన్నా ఏడుస్తున్నా, బాధపడుతున్నా సహించలేకపోయేది. నాకు చెప్పేది. వాళ్ళంతా తన ఆత్మీయులుగా భావిస్తుంది కౌముది. దుఃఖభాజనమైన అనుభవాలవల్ల మానవులంతా ఒక్కటేననీ, ఏ వ్యక్తీ కొరగానివాడని చిన్నచూపు చూడరాదని గ్రహించగలిగాను. ప్రతీ వ్యక్తికీ తగిన భద్రత, గౌరవం అవసరమని కౌముది వల్లే నేర్చుకున్నాను. మా కౌముది నాకు సహనాన్ని, మంచితనాన్ని, వినయాన్ని దీక్షను నేర్పింది. లేకుంటే నేనూ చాలామందిలా సమస్యలపట్ల నిర్లిప్తంగా- నా సుఖం, స్వార్థం చూసుకుంటూ అదే పరమార్థంగా గడిపేదాన్నేమో. అందరికీ ఈ అవకాశం లభించకపోవచ్చు. ఇదంతా సుహాస్ కృషి ఫలం.. 'కౌముది' అతని కల. మేం బతికివున్నా, మరణించినా మా కౌముది తాను జీవించి వున్నంతకాలం ఎవరిపైనో ఆధారపడి, గడపవలసిన స్థితి వుండదు. అనేకమందికి మా కౌముది ఆశ్రయమిచ్చి సేదతీర్చాలి. మేం వున్నా లేకపోయినా ఈ సేవ పరంపరగా అటువంటి పిల్లలున్నంత కాలం నిర్విఘ్నంగా కొనసాగాలి.

చిరకాల సంఘర్షణ ముగిసిపోయింది. దీర్ఘకాలం ముసురులా కమ్ముకుని మా జీవితాలను స్తంభీభూతంచేసిన నిరాశా నిస్పృహలు తొలగిపోయాయి. వెన్నెల కురిపిస్తూ అలసిన మనసులను సేదతీరుస్తోంది కౌముది Ⓒ

# పేదలకు అండగా నిలిచిన
# తారాశంకరుడు

ఇరవయ్యో శతాబ్ది ప్రథమార్ధం భారతదేశ చరిత్రలో ముఖ్యంగా వంగసీమ చరిత్రలో అత్యంత ప్రముఖమైనదశ. రెండు ప్రపంచ యుద్ధాలు, బెంగాల్ విభజన, క్షామం, పారిశ్రామిక విప్లవం, సామాజిక పునరుజ్జీవం, మార్క్స్ భావజాలం, వైష్ణవ భక్తి, గ్రామీణ జీవన పరివర్తన, జాతీయోద్యమం, గాంధీజీ నేతృత్వం, నేతాజీ మార్గం, స్వాతంత్ర్య సిద్ధి, దేశ విభజన వంటి ఎన్నో ఘట్టాలు ఈ కాలంలోనివే. సాహిత్యంలో ముఖ్యంగా బెంగాలీ సాహిత్యంలో ఇవి బహుముఖీనంగా ఆవిష్కృతమయ్యాయి. బంకించంద్ర ఛటర్జీ, రవీంద్రనాథ్ ఠాగూర్, శరత్‌చంద్రులకు సమస్కంధుడిగా నిలిచిన తారాశంకర్ బందోపాధ్యాయ నాలుగున్నర దశాబ్దాలపాటు రచనా వ్యాసంగంలో ఉత్తమ కృతులందించాడు. ఆయన రచించిన 'గణదేవత' నవలకు 1966లో జ్ఞానపీఠ్ లభించింది.

తారాశంకర్ అవిభక్త బెంగాల్ రాష్ట్రం 'వీరభూమ్' జిల్లా 'లాభ్‌పూర్‌లో 1898 జూలై 23న జన్మించాడు. వీరిది సనాతన జమీందారీ కుటుంబం. తండ్రి హరిదాస్. పాఠశాల చదువు ఎక్కువగా లేకపోయినా స్వయంకృషితో విద్యావంతుడయ్యాడు. ఇంట్లో పెద్ద గ్రంథాలయం ఉండేది. చాలా పత్రికలొచ్చేవి. తల్లి ప్రభావతీదేవి. ఆంగ్లంలో ప్రవేశమున్న విద్యావంతురాలు. పుట్టిల్లు పాట్నా. ఆమెలో దేశభక్తి మెండు. ఆమె అన్నలు స్వరాజ్యోద్యోమంలో పాల్గొన్నారు. తారాశంకర్ మేనత్త భర్తమరణం కారణంగా అన్నవద్దే ఉంటోంది. తల్లి, మేనత్త తారాశంకర్ బాల్యాన్ని సద్గుణాలతో నింపారు. 1916లో తారాశంకర్ మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు. ఆ ఏడాదే ఆయన పెళ్ళి జరిగింది. నళినీ బగ్చి అనే విప్లవకారునితో పరిచయమూ ఏర్పడింది. స్వరాజ్యోద్యమంలో దూకాడు. కలకత్తాలోని సెయింట్ జేవియర్ కళాశాల యాజమాన్యం అనుమానితుడిగా పరిగణించడంతో అశుతోష్ కళాశాలలో చేరాడాయన. అనారోగ్యంచేత మధ్యలోనే చదువు మానేశాడు. విద్యార్థి దశలోనే ఆయనలో




సాహిత్యాభిరుచి, రచనాభినివేశం వర్ధిల్లాయి. మనసును కలవర పరుస్తున్న సమస్యలకు గాంధీ సిద్ధాంతాల్లో పరిష్కారం లభించింది. లాభపూర్ తిరిగి వచ్చాడు. గ్రామస్థులు తారాశంకర్‌ను గ్రామసంఘం అధ్యక్షుడిగా ఎన్నుకున్నారు. సైకిలు మీద జిల్లా అంతటా పర్యటించి ప్రజల స్థితిగతులు తెలుసుకున్నాడు. కలరా ప్రబలితే రాత్రింబవళ్ళు ప్రజలకు

సేవచేశాడు. రచనలు చేస్తూనే ప్రజాసేవ కొనసాగించాడు. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నాడు. 1930లో జైలుకెళ్లాడు. ముద్రణశాల నెలకొల్పితే అది మూతపడింది. తారాశంకర్‌ను వ్యాపారంలోకి దించాలనుకున్న బంధువుల యత్నాలు ఫలించలేదు. రచనలనే జీవనోపాధికి, దేశ సేవకు సాధనంగా చేసుకున్నాడు. ప్రజలు ఆయన వైఖరికి ఆశ్చర్యపోయారు. క్రమంగా అర్థం చేసుకున్నారు. తను ఉన్న ఊరు 'తారాశంకర్ గ్రామం'గా గుర్తింపు పొందింది. తారాశంకర్ 1952లో పశ్చిమ బెంగాల్ శాసన సభ్యుడిగా నామనిర్దేశితుడయ్యాడు. 1956లో కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం, 1960లో పద్మశ్రీ లభించాయి. తుదిక్షణం వరకు రచనలు సాగించిన ఆయన 1971 సెప్టెంబర్ 14న కలకత్తాలో కన్ను మూశాడు.

ఇతర ప్రక్రియలు చేపట్టినా ప్రధానంగా నవలా కారుడుగా తారాశంకర్ విశిష్ట కీర్తి సాధించాడు. ఆయన కథలు పెద్దవే కాదు..గొప్పవి కూడా. 1926లో ఆయన కవితా సంపుటి 'త్రిపుత్ర' ప్రచురితమైంది. తారాశంకర్ 57 నవలలు, 50 కథా సంపుటాలు, 9 నాటకాలు, 18 ఇతర ప్రక్రియలు మొత్తం 134 ప్రచురణలతో బెంగాలీ సాహితీ క్షేత్రంలో విరాణ్మూర్తిగా భాసిల్లాడు. 1972లో వచ్చిన పిల్లల నవల 'కిష్కింధకాండ' ఆయన చివరి నవల. 'గణదేవత', 'పంచగ్రామ్', 'ధాత్రీదేవత' ఆయన మహత్తర నవలలు. కాళింది, మన్వంతర్, తమస్‌తపస్య, యోగభ్రష్ట, నిశిపద్మ, అభినేత్రి, కాళరాత్రి, మహానగరి, గురుదక్షిణ, యతిభంగ, మహాశ్వేత, ఉత్తయామణ్, రాయ్‌కమల్ మొదలైన నవలలు తారాశంకర్ రచనా పాటవానికి దర్పణాలు. జల్సాఘర్, కామధేను, మాటి, బిష్ఫోటన్, తపోభంగ, దీపార్‌ప్రేమ్, పంచకన్య, తీన్‌శూన్యొ, శ్రీపంచమి,


తారాశంకర్ బందోపాధ్యాయ

చిరంతన్‌వంటి నాటకాలు; మాస్కో తెకైక్ దిన్, అమార్ సాహిత్య జీబన్, రవీంద్రనాథ్ ఒ బంగ్లార్‌పల్లి తదితర రచనలు, ప్రక్రియలు తారాశంకర్ ప్రతిభను వెల్లడిస్తాయి.

కథావస్తువరణంలో తారాశంకర్ తనకు తనేసాటి. తనకు అవగాహనున్న ఇతివృత్తాలే ఎన్నుకున్నాడు. నవలా నిర్మాణంలో ఆయన కౌశలం అసాధారణం. సంప్రదాయాన్ని, అభ్యుదయాన్ని జోడించడం ఆయన ప్రత్యేకత. భావావేశం పాఠకుల్ని సంభ్రమపరుస్తుంది. గ్రామీణ జీవిత చిత్రణలో ఆయనదే అగ్రస్థానం.

తారాశంకర్‌కు ఖ్యాతి తెచ్చిన 'గణదేవత' 1943 నాటి నవల. గ్రామీణ జీవితాన్ని, పేదల బాధలు, సంపన్నుల దౌర్జన్యాలను కళ్ళకు కడుతుంది. ఇది ప్రజల కథ. మహాగ్రామ్, దేఖూరియా, శివకాళీపుర్, కుసుమ్‌పుర్, కన్‌కనా అనే ఐదు గ్రామాల కథ చెప్పే 'పంచగ్రామ్' దీనికొనసాగింపు. పేదరైతులు, వృత్తులవారు సమైక్యంగా నిలిచి, జమీందార్ల కపటోపాయాల్ని వమ్ము చేయడం దీని ఇతివృత్తం.

–గోవిందరాజు రామకృష్ణారావు

కాలాతీతం

(1885)



# ది అడ్వెంచర్స్ ఆఫ్ హాకల్‌బెరీఫిన్

మార్క్‌ట్వేన్

మార్క్‌ట్వేన్ నవల 'అడ్వెంచర్స్ ఆఫ్ టామ్‌సాయర్'లోనే తన గురించి చదివారని పాఠకులకు గుర్తుచేస్తాడు హక్. ఆ కథ చివర తనకు ఆరువేల డాలర్లు దొరికాయి. వాటిని జడ్జి థాచర్‌గారు ఒకచోట డిపాజిట్ చేసి రోజుకో డాలర్ వడ్డీకూడా యిస్తున్నారు. వితంతువు డగ్లస్ తనను చేరదీసి, మంచిబుద్ధులు నేర్పి 'సివిలైజ్' చెయ్యటానికి ప్రయత్నిస్తున్నది.

డగ్లస్ సోదరి మిస్‌వాట్సన్ మహా కఠినురాలు. తనకిష్టంలేని పనులన్నీ బలవంతంగా చేయిస్తుంది. స్పెల్లింగ్ నేర్పిస్తుంది. రోజూ దేవుణ్ణి ప్రార్థించమంటుంది. కనీసం చుట్టకూడా కాల్చనివ్వదు.

ఒకనాడు అనుకోకుండా సాలీడును చంపుతాడు హక్. "అది మహాపాపం. ఇక తనకు గడ్డుకాలమే" అని బుర్రపాడు చేసుకుంటున్నప్పుడు టామ్‌సాయర్ కేకేస్తాడు. తర్వాత యిద్దరూ కలసి అనేక సాహసాలు చేయటానికి ప్లాన్లు వేస్తారు.

టామ్‌కు సముద్రపు దొంగల కథలు తెలుసు. తాము కూడా కొందరు కుర్రాళ్లను పోగుచేసి, ముసుగులు కప్పుకుని, దారిదోపిడీలు చేసి ప్రయాణికుల్ని అపహరించి, వారి విడుదలకోసం డబ్బును డిమాండ్ చెయ్యవచ్చు.

ఆ రాత్రి జులాయిగా తిరుగుతున్న హక్‌ను గట్టిగా చివాట్లేసి సద్వర్తన బోధి



స్తుంది మిస్‌వాట్సన్. కాని వాడికి ఒక్క ముక్క కూడా బుర్రకెక్కదు. ఈలోగా వూరి చెరువులో ఒక శవం తేలుతుంది. అది కనిపించకుండా పోయిన హక్ తండ్రిదే కావచ్చునంటారు.

నెలరోజులు గడిచినా ఒక్క దోపిడీ కూడా నిజంగా చెయ్యలేకపోయినందుకు హక్‌తో సహా ఆ ముఠాసభ్యులంతా రాజీ నామా చేస్తారు. కాని టామ్ మాత్రం కలలు కనటం ముఖ్యమని, మాంత్రికుల గురించీ, లాంప్ రుద్దితే ప్రత్యక్షమయ్యే భూతం గురించీ చెబుతాడు. పాపం హక్ యింటికొచ్చి పాతలాంతరు నెంత రుద్దినా భూతం కనిపించదు.

డగ్లస్, వాట్సన్‌ల బలవంతంతో స్కూల్ కెళుతున్నప్పుడు హక్‌కు ఒకనాడు తండ్రి వూరికి తిరిగివచ్చినట్టు తెలుస్తుంది. అతడ సలే ముక్కోపి. డబ్బుకోసం దేనికైనా తెగి స్తాడు.

అది బాగా తెలిసిన హక్ జడ్జి థాచర్ వద్దకెళ్లి "ఆరువేల డాలర్లు నాకొద్దు. మీరే వుంచుకోండి" అంటాడు. డబ్బు లేదంటే తనకు ప్రాణభయం తగ్గినట్టే. మిస్‌వా ట్సన్ నీగ్రోబానిస 'జిమ్'కూడా తండ్రి తిరి గివచ్చిన విషయం నిజమేననటంతో హక్ తాను సాలీడును చంపిన పాపం అనుభ వించక తప్పదనుకుంటాడు.

ఒకనాడు హక్ తండ్రి వచ్చి చదువు కుంటున్నందుకు కొడుకును బండబూ తులు తిడతాడు. పైగా మంచి గుడ్డలు కూడా వేసుకున్నాడని మండిపడతాడు. కొడుకును కొట్టి జడ్జి థాచర్ యిచ్చిన డాలర్ లాక్కుని విస్కీ తెచ్చుకుంటాడు. ఆ తర్వాత జడ్జీ దగ్గరకెళ్లి కొడుకు దాచిన డబ్బు తిరిగిమ్మని బెదిరిస్తాడు. అం తేకాకుండా కోర్టుకెళ్లి హక్‌ను తన సంరక్ష ణకు బదిలీ చెయ్యమంటాడు. పెద్దలంతా సహకరిస్తే తను తాగడం మానేస్తానం టాడు. కాని ఈ మాటలు నిలవవు.




కొత్తగా కొనుక్కున్న కోటును విస్కీకోసం అమ్ముకుంటాడు. తాగి కిందపడి ఎడమ చేతిని రెండుచోట్ల విరగొట్టుకుంటాడు.

తండ్రి మీది కోపంతో హక్‌కు చదువు మీద శ్రద్ధ పెరిగింది. హక్ తండ్రి ఒక నాడు, డగ్లస్ ఇంటి నుండి కొడుకును అప హరించి నదిపక్కన ఉన్న కట్టెలతో కట్టిన గదిలో బంధిస్తాడు. హక్ మాత్రం బాధ పడడు. డగ్లస్ ఇంటి 'నాగరిక' ప్రపంచం కన్నా ఇదే బాగుందనుకుంటాడు.

కాకపోతే తండ్రి కొట్టినప్పుడు అడ్డుపడే వాళ్లే లేరిక్కడ. ఒక్కోసారి మూడువారాల పాటు కేబిన్ తాళం తియ్యడు. తాగిన ప్పుడు మరీ ఎక్కువగా కొడతాడు. చచ్చి పోతానని భయం వేసింది హక్‌కు. ఎలా గైనా తప్పించుకోవాలి.

మరునాడు తండ్రి కొట్టి తెచ్చిన దుంగ లతో ఓ తెప్ప తయారు చేసుకుంటాడు హక్. తను పారిపోయినట్టుగా తెలియ కుండా ఉండాలంటే అతడి దృష్టి మళ్లిం చాలి. రంపం తీసుకుని కేబిన్‌కు కన్నం చేస్తాడు. ఆ తర్వాత పందిని చంపి దాని నెత్తురు గోడల మీద చల్లుతాడు. తన జుత్తు పీకి కొన్ని వెంట్రుకల్ని నెత్తుట్లో తడిపి గొడ్డలికి అంటిస్తాడు. తననెవరో హత్యచేశారని అనుకునేలా చేసి ఆ తర్వాత తెప్పమీద చీకట్లో జాక్సన్స్ ఐలాండ్‌కు బయల్దేరతాడు.

# మార్క్‌ట్వేన్

**1835 - 1910**

సామ్యుయెల్ లాంగ్‌హార్న్ క్లెమెన్స్ పుట్టింది ఫ్లోరిడా, మిస్సోరీలో. తర్వాత నాలుగేళ్లకు కుటుంబం హానిబల్‌కు తరలివెళ్లింది. తండ్రి లాయర్. కొంతకాలం వ్యాపారం కూడా చేశాడు. చదువంటే శ్రద్ధలేని సామ్యుయెల్ పన్నెండేళ్లకే స్కూలు మానేశాడు. ప్రింటర్స్ అసిస్టెంట్‌గా జీవితం ప్రారంభించి అప్పుడప్పుడూ పత్రికలకు వ్యాసాలు రాశాడు.

పద్దెనిమిదో ఏట దేశాటన ప్రారంభించి, 1857లో దక్షిణ అమెరికా వెళ్లటానికి న్యూఆర్లియన్స్ చేరుకున్నాడు. కాని అదృష్టవశాత్తూ అక్కడ హారేస్ బిక్స్‌బీ సాయంతో రివర్ పైలటింగ్ నేర్చుకుని కొంతకాలం 1200 మైళ్ల మిస్సిసిపీ నదిని పరిశీలిస్తూ గడిపాడు. అతని జీవితంలో అత్యంత ఆనందంగా గడిపిన కాలమిదే. ఈ అనుభవాన్ని 'లైఫ్ ఆన్ మిస్సిసిపి' (1883)లో అద్భుతంగా వర్ణించాడు. తరువాత రాసిన అనేక కథలకూ, 'హకల్‌బెరీఫిన్'కూ వస్తువిదే. ఇక్కడే 'మార్క్‌ట్వేన్' అని కలంపేరు కూడా పెట్టుకున్నాడు. .

అమెరికాలో రోడ్లు విస్తరించి, నదీ ప్రయాణాలకు డిమాండ్ తగ్గిన తర్వాత 1861లో నెవాడాకెళ్లి మైనింగ్‌లో పాల్గొన్నాడు. అది నచ్చక వర్జినియా సిటీలో జర్నలిస్టుగా పనిచేశాడు. షేర్ మార్కెట్లో వున్నదంతా పోగొట్టుకున్నాడు. ఈ కాలంలోనే ప్రముఖ హాస్య రచయిత ఆర్టెమస్ వార్డ్ పరిచయంతో 1865లో 'జిమ్ స్మైలీ అండ్ హిజ్ జంపింగ్ ఫ్రాగ్' కథ రాశాడు. హాస్య రచయితగా గుర్తింపు వచ్చింది.

అదే సంవత్సరం హవాయ్ ద్వీపాలకు వెళ్లి వుపన్యాసాలతో ప్రాచుర్యం పెంచుకున్నాడు. 1869లో 'ది ఇన్నోసెంట్స్ అబ్రాడ్'తో రచయితగా స్థిరపడ్డాడు.

తర్వాత న్యూయార్క్‌కు చెందిన బొగ్గు వ్యాపారి కూతురు అలీవియా లాంగ్డన్‌ను పెళ్లాడి కనెక్టికట్‌లోని హార్ట్‌ఫోర్డ్‌లో స్థిరపడ్డాడు. హానిబల్, మిస్సిసిపీ నది జ్ఞాపకాలతో, అమెరికన్ సాహిత్యంలో అజరామరమైన "టామ్ సాయర్" "హకల్‌బెరీఫిన్"లు రాసిందిక్కడే.

పుస్తకాలు లక్షాధికారిని చేసినా కనీస జ్ఞానం లేని వ్యాపారంలో పెట్టుబడులు పెట్టి మరోసారి వున్నదంతా పోగొట్టుకున్నాడు. 1895లో అప్పులు తీర్చటానికి లెక్చర్ టూర్లు చేసి (ఇండియా కూడా వచ్చాడు) మళ్లీ సంపాదించాడు.

మూడురోజుల తర్వాత ద్వీపం మీద ఒంటరిగా గడపలేక విసుగొస్తుంది. ఒకనాడు అడవిలో తిరుగుతున్నప్పుడు ఎవరో వంట చేసుకున్నట్టుగా, ఆరిపోయిన నెగళ్లు కనిపిస్తాయి. ఇక్కడెవరో ఉన్నారన్నమాట. వెంటనే తెప్ప మీద ఇల్లినాయిస్ తీరం చేరుకుంటాడు. ఈలోగా మిస్ వాట్సన్ బానిస జిమ్ అక్కడికి వస్తాడు. హక్ చనిపోయే ఉంటాడనుకున్నారందరూ. అందుకే అతన్ని చూసి, 'భూతం' అని భయపడ్డాడు జిమ్. తర్వాత మిస్ వాట్సన్ తనను మరొకరికి అమ్మెయ్యాలనుకున్నదనీ అంచేత పారిపోయి వచ్చానని చెబుతాడు. తర్వాత ఇద్దరూ కలిసి దీవిపై మరో సురక్షిత ప్రదేశానికి చేరుకుంటారు.

ఒక రాత్రి, రెండంతస్తుల పడవ ఒకటి

అమెరికన్ సాహిత్యానికి, అమెరికన్ మాండలికానికి ప్రపంచ వ్యాప్తంగా ప్రాచుర్యం కలిగించిన ప్రముఖుల్లో మార్క్‌ట్వేన్ ఒకడు. ఈయన 'ది ప్రిన్స్ అండ్ ది పాపర్'- (రాజు-పేద), 'ఎ కనెక్టికట్ మాంక్ ఇన్ కింగ్ ఆర్థర్స్ కోర్ట్' అనేక కథలూ, వ్యాసాలూ, అసంఖ్యాకంగా హాస్య, వ్యంగ్యోక్తులూ సుపరిచితమే.

ఆయన చివరి దశాబ్దం సన్మానాలతో, సత్కారాలతో నిండింది. ఆక్స్‌ఫోర్డ్ యూనివర్సిటీ ఆయనకు డి.లిట్ ఇచ్చింది. ఆ దశాబ్దంలోనే వరుస విషాదాలూ తప్పలేదు. తను ప్రపంచ పర్యటనలో ఉన్నప్పుడు పెద్దకూతురు మరణించి, మరో కూతురు మూర్ఛరోగానికి గురైంది. 1904లో భార్య మరణించింది. దీంతో ఆయన దృక్పథమే మారిపోయింది.

"వ్యక్తులూ, సమాజాలూ, సంస్కృతులూ నశించక తప్పదు. ఇది మానవ జాతికి విధాత శాపం" అంటాడు 'వాటీస్ మాన్'లో. మరణానంతరం అచ్చయిన 'ది మిస్టీరియస్ స్ట్రేంజర్' (1916)- తెలుగులో 'విచిత్రవ్యక్తి'- మనిషి మంచితనం పట్ల తనకున్న అపనమ్మకాన్ని తెలియచేస్తుంది. ఇందులోని తాత్విక మీమాంస ఫ్రెంచి రచయిత వాల్టేర్‌ను తలపిస్తుంది.

## హకల్ బెరీఫిన్ గురించి

పుస్తకం ప్రారంభంలోనే రచయిత తన సహజధోరణిలో "ఇందులో ప్రయోజనం కోసం వెదికిన వాళ్లను కోర్టుకీడుస్తా. నీతికోసం చూడటానికి ప్రయత్నిస్తే బహిష్కరిస్తా. ప్లాటు ఏమిటని అడిగితే కాల్చి పారేస్తా" అంటూ పాఠకుల్ని హెచ్చరిస్తాడు.

అమెరికన్ సాహిత్యంలోని అనర్ఘ రత్నం హకల్‌బెరీఫిన్. "మన ఆధునిక సాహిత్యమంతా హక్ నుండే పుట్టింది" అన్నాడు ఎర్నెస్ట్ హెమింగ్వే. హకల్ బెరీఫిన్‌లో రచయిత కనీసం పన్నెండు మాండలికాలను సాధికారికంగా వాడడం విశేషం.

'టామ్‌సాయర్' లోని కొన్ని పాత్రలున్నప్పటికీ ఈ నవల దానికి పొడిగింపు కాదని గుర్తించాలి.

పదమూడేళ్ల 'హక్' తన కథ చెప్పుకుంటాడు. వాడి తండ్రి తాగుబోతు. మహా క్రూరుడు.

అబ్రహాం లింకన్ బానిస విధానం రద్దుచేసిన తర్వాత అమెరికాలో అంతర్యుద్ధం జరిగింది. చట్టరీత్యా నీగ్రోలకు విముక్తి లభించినా అనేకమంది తెల్లవాళ్లు నల్లవాళ్లను తమ ఆస్తిగానే చూశారు. ఇదీ ఈ నవల నేపథ్యం.

నదిలో తేలుతూ కనిపిస్తుంది. ఇద్దరూ దానిలోకి దూకుతారు. అందులో మూలగదిలో ఓ మృతదేహం బోర్లాపడి ఉంటుంది. ఎవరో వెనకనుండి కాల్చారు. జిమ్ దగ్గరకు వెళ్లి చూసి శవం మీద చింకిపాతలు కప్పి "చిన్న పిల్లలు ఇలాంటి దృశ్యాలు చూడటం మంచిది కాదు" అంటూ హక్‌ను వారిస్తాడు.

తెల్లవారి బ్రేక్‌ఫాస్ట్ తర్వాత హక్ మృతుడి గురించి మాట్లాడబోతే 'అరిష్టం' అని అడ్డు చెబుతాడు. అతని మూఢనమ్మకం నిజం చెయ్యడానికి హక్, ఒక పామును చంపి మంచం వద్దవేస్తాడు. కాని తర్వాత చచ్చిన పాముకోసం ఇతర పాములు వస్తాయని తెలియనందుకు తనను తాను నిందించుకుంటాడు. అం



దుకేనేమో జిమ్ పాముకాటుకు గురవుతాడు. అతను కోలుకోడానికి మూడురోజులు పడుతుంది.

ఐలండ్ మీద విసుగొచ్చి, ఆడపిల్ల వేషంలో సారా విలియమ్స్‌గా మారి వూళ్ళోకెడతాడు హక్. అక్కడంతా తనను జిమ్, తనతండ్రి హత్యచేశారనే అనుకుంటున్నారు.

ఒక పెద్దావిడకి సారా విలియమ్స్ ఆడది కాదేమోనని అనుమానం వస్తుంది. సందేహ నివృత్తి కోసం, ఒళ్లో ఒక సీసం గుండు పడేస్తుంది. సారా వెంటనే కాళ్ళు దగ్గిరకు తీసుకుంటుంది. ఆడపిల్లయితే



కాళ్లు తెరుచుకునేది. ఎలుకల్ని చంపమంటుంది. సూదిలోకి దారాన్ని ఎక్కించమంటుంది. తన గురించి ఆమెకు తెలిసిందని, తన కథ చెప్పకుంటాడు హక్. ఈలోగా జిమ్‌ను పట్టిచ్చిన వాళ్ళకు 300 డాలర్లు బహుమతి ప్రకటిస్తారు.

తమ రహస్యం బట్టబయలు కావటంతో, జాక్సన్‌దీవి వదిలి, తెప్పమీద అయిదురోజుల ప్రయాణంచేసి సెయింట్ లూయిస్ చేరుకుంటాడు హక్. తుపానులో అక్కడికో స్టీమ్‌బోట్ కొట్టుకొస్తుంది. అందులో వున్న యిద్దరు దోపిడీ దొంగలు జేమ్స్ పకార్డ్, బిల్ మరో దొంగ జిమ్‌టర్నర్‌ను హత్య చెయ్యాలనుకుంటారు. వాళ్ళవల్ల తమకూ ప్రమాదముందని తెలుసుకుంటారు హక్, జిమ్‌లు. అంతలోనే తుపాను ఉధృతి పెరుగుతుంది. ఆ గందరగోళంలో దొంగలను తప్పించుకుని, మరో బోట్‌లో మూడు రాత్రులు ప్రయాణంచేసి కెయిరో నగరం చేరుకుంటారు. జిమ్ తన యజమాని హక్‌కు నమ్మినబంటు లాగుంటాడు. ఆ నదిమీద కొన్నాళ్లు హాయిగా గడుపుతాడు హక్.

అప్పటికే కొందరు బానిసలు తప్పించుకుపోతున్నారని వార్తలు వ్యాపించటంతో అధికారులు ప్రతిపడవనూ గాలిస్తుంటారు. తన బోట్‌లో వున్నది తన తండ్రే అని వాళ్లను నమ్మిస్తాడు హక్.

కెయిరో దాటగానే హక్ ప్రయాణిస్తున్న పడవ ప్రమాదానికి గురవుతుంది. గ్రాంజర్ ఫోర్డ్ కుటుంబం వాడికి ఆశ్రయమిస్తుంది. గ్రాండర్ ఫోర్డులది పెద్ద కుటుంబం- భార్యా, ఇద్దరు కూతుళ్లూ, ముగ్గురు కొడుకులూ. ఒక కొడుకు 'బక్' ది హక్ వయస్సే. బాగా సంపన్నులు. వాళ్లకు పొరుగింటి షెపర్డ్ కుటుంబంతో బద్ధ వైరం. ఒకరినొకరు చంపుకోవటానికి ప్రణాళికలు వేసుకుంటూ వుంటారు. వాళ్ల వైరం ఎంత పాతదంటే, అసలెందుకు వాళ్లు శత్రువుల్లాగ వుంటున్నారో యిప్పటికి వారికి గుర్తులేదు. ఒకసారి, గ్రాంజర్‌ఫోర్డుల అమ్మాయి, షెపర్డ్‌ల అబ్బాయితో లేచిపోతుంది. తక్షణమే రెండు కుటుంబాలూ యుద్ధం ప్రకటిస్తాయి. బక్, అతడి తండ్రీ, యిద్దరు సోదరులూ హతులవుతారు. కొందరు షెపర్డ్‌సన్‌లు కూడా మరణిస్తారు. ఈ ఘోరానికి తానే కారణమని తెగ బాధపడిపోతాడు హక్. ఎందుకంటే ప్రేమికులిద్దరి మధ్యా వుత్తరాలు

## మీరీమెను చూశారా?

రోమ్‌లోని ఓ స్త్రీ తన వక్షోజాలను సిలికాన్ ఇంప్లాంట్ ద్వారా పెద్దవిగా చేయించుకుంది. తర్వాత 9,500 డాలర్లు ఆస్పత్రిబిల్లు ఎగ్గొట్టి ఆమె పారిపోయింది. దొంగపేరుతో హాస్పిటల్‌లో చేరిందని పోలీసుల పరిశోధనలో తేలింది. ఆ అమ్మాయి ఫొటో తప్ప ఇంకేం ఆధారాలు లేవు. పోలీసులు ఆ అతిపెద్ద వక్షోజాల స్త్రీ కోసం 'మీరీమెను చూశారా?' అంటూ ఫొటో పట్టుకుని వెదుకుతున్నారు.



చేరవేసింది వాడే. మంచివాళ్లు, సంస్కారవంతులు, సజ్జనులు కూడా యింత దుర్మార్గంగా ప్రవర్తించ గలరని తెలిసి మానవ జాతినే అసహ్యించుకుంటాడు హక్.

నదీ ప్రయాణం కొనసాగుతుంది. ఒక చోట ప్రాణం పోతున్నదని హాహాకారాలు చేసిన అంధులిద్దరికి పడవలో చోటిస్తాడు హక్. వాళ్లిద్దరూ నయవంచకులు. ఒకడు తనను తాను కింగ్ డాఫిన్ ఆఫ్ ఫ్రాన్స్‌గానూ, మరొకడు డ్యూక్ ఆఫ్ బ్రిడ్జివాటర్‌గానూ పరిచయం చేసుకుంటారు. ఇద్దరూ గుక్క తిప్పకుండా తమగొప్పలు చెప్పుకుంటూ వీళ్లచేత సేవలు చేయించుకుంటారు. నిజంగానే యిలాంటి కింగ్‌లూ, డ్యూక్‌లు వుంటే తమలాంటి ప్రజలేమైపోతారని దిగులుపడతాడు హక్. అతిథులిద్దరూ ఒకనాడు, షేక్స్‌పియర్ రాసిన రోమియో అండ్ జూలియెట్ నాటకం రిహార్సల్ ప్రారంభిస్తారు. డెబ్భై ఏళ్ళ వాడు జూలియెట్ పాత్ర స్వీకరిస్తాడు. పడవ ఒడ్డుకు చేరుకున్నప్పుడు నాటకం ప్రదర్శిస్తామని, వూరిజనం దగ్గర ఎనభై డాలర్ల డెబ్భై సెంట్లు వసూలు చేస్తారు. ఆ తర్వాత, తమకు ఆతిథ్యం యిచ్చి సేవ చేసిన 'జిమ్' పారిపోయిన బానిస అని కరపత్రం ముద్రిస్తాడు డ్యూక్. 'పెద్దమనుషుల' కృతఘ్నతను చూసి ఆశ్చర్యపడతాడు హక్. ప్రింటింగ్‌ప్రెస్‌వాడికి డ్యూక్ తొమ్మిది డాలర్ల బాకీ పడ్డాడని తెలుస్తుంది.

దబాయించి మరీ సేవలు చేయించుకుంటున్న అంధులతో ప్రయాణం కొనసాగించి అర్కాన్సస్ చేరుకుంటాడు హక్. అక్కడ మాయగాళ్ళు నాటకం ప్రదర్శిస్తారు. కాని, కేవలం పన్నెండుమంది ప్రేక్షకులు మాత్రమే రావటంతో 'స్త్రీలూ ఈ నాటకం చూడకూడదు' అని ప్రకటిస్తారు. ప్రేక్షకులు విరగబడి చూడాలనుకుంటే యిలాంటి సెన్సారు నిబంధనలు అవసరం అని మనకూ తెలుసు. ఆ వూళ్లో అందర్నీ నమ్మించి మరో 465 డాలర్లకు టోకరా వేస్తారు కింగ్, డ్యూక్ జంట.

మిస్సిసిపి మీద పడవ మరింత ముందుకు సాగుతుంది. ఒకచోట కింగ్‌ను చూసి అతడు ఇంగ్లండు నుండి వచ్చిన మిస్టర్ హార్వే అనుకుని పొరబడతాడో సజ్జనుడు. ఇంగ్లండులో ఒక సంపన్నుడు విక్స్ తన వీలునామాలో కొంత ఆస్తిని హార్వే, అతడి సోదరుడు విలియంపేర రాశాడని చెబుతాడు. విలియమ్స్ పుట్టుకతోనే చెవిటీ, మూగా అని కూడా తెలుస్తుంది. వెంటనే డ్యూక్‌ని తన సోదరుడిగా



నటించమంటాడు కింగ్. ఈ హార్వేవిక్స్, విలియమ్స్ విక్స్ సోదరులను చూసి మనుషులు ఇంత నీచంగా కూడా వుండగలరా అని ఆశ్చర్యపడతాడు హక్. 'జీవజాతిలో అత్యంత క్షుద్రమైనది మానవుడే.' అసలు హార్వే, విలియమ్స్ ఇంగ్లండు నుండి చేరుకునే లోపున వీళ్ళు ఆస్తి తమ చేత చిక్కించుకుకోవాలి- అదీ ప్లాను.

మొత్తంమీద ఈ నయవంచకుల పన్నాగం పారేలోపే అసలు సోదరులు ఇంగ్లండు నుండి వస్తారు. కింగ్, డ్యూక్ ప్రాణాలరచేత పట్టుకుని బోట్‌ను చేరుకుంటారు.

హక్, జిమ్ ఎంత సాయం చేసినా, ఈ దుర్మార్గుల స్వభావాలతో కించిత్తుకూడా మార్పురాదు. ఒకనాడు నలభై డాలర్లకు జిమ్‌ను అమ్మేస్తాడు కింగ్. జిమ్ పారిపోతాడు. నిజానికి అతడి యజమాని హక్‌కా విషయం కూడా తెలియదు. కొంత అన్వేషణ తర్వాత 'జిమ్' ఫెల్ప్స్ ఫాంలో ఉన్నాడని తెలుస్తుంది. హక్ హుటాహుటిన అక్కడకి బయల్దేరతాడు. తన ఆప్తమిత్రుడు లేని జీవితం వెలితిగా తోస్తుంది. ఫాంలో మొదట ఆంట్ శాలీ కనిపిస్తుంది. ఈ కుర్రాడామెకు బాగానే పరిచయం. మిస్టర్ ఫెల్ప్స్ రాగానే హక్‌ను చూపించి 'ఇదిగో వీడే మన టామ్‌సాయర్' అని పరిచయం చేస్తుంది. హక్‌కు కాస్త ధైర్యం వస్తుంది. ఇంకేం, టామ్ గురించి ఎన్ని కథలైనా కల్పించవచ్చు తన సామాను తెచ్చుకుంటాననే సాకుతో వెనక్కి వచ్చినప్పుడు అసలు టామ్‌సాయర్ కన్పిస్తాడు. 'హక్' ఎప్పుడో చచ్చిపోయాడనుకున్నాడు వాడు. ఇలా హఠాత్తుగా కనిపించటంతో 'భూతం' కాబోలునని భయపడతాడు. 'జిమ్' గురించి యిద్దరూ చర్చించుకుంటారు. అతడింకా బానిసే. ఎలాగైనా విముక్తి కల్పించాలి.

జిమ్ ఒక పాకలో బందీగా వున్నాడు. తాళంచెవి సంపాదించి వాణ్ణి విడిపించవచ్చు కాని అంత సింపుల్‌గా సమస్యను పరిష్కరించటంలో థ్రిల్ ఏముంది! సాహసం చేస్తేనే మజా. జిమ్‌కు కాపలా వున్న మరోనీగ్రోకు దయ్యాలు తిరుగుతున్నాయని చెప్పి భయపెడతారు హక్, టామ్‌లు.

పాక కింద ఒక రహస్య సొరంగం తవ్వి జిమ్‌ను తప్పించాలి. అయితే అతణ్ణి గొలుసులతో కట్టేశారు. మొదట వాటిని కోసెయ్యాలి. తరువాత కిటికీ పగలకొట్టాలి. తను చదివిన పుస్తకాలలోని సాహసగాథలన్నీ ఏకరువుపెడతాడు. టామ్. తన మిత్రుడి పాండిత్యానికి ముగ్ధుడవుతాడు హక్. చివరికి జిమ్‌కు పారిపోవటానికి అవకాశం దొరుకుతుంది. ఇరుగు పొరుగులకు ఈ విషయం తెలిసి వాడి మీద కాల్పులు జరుపుతారు. అడ్డుపడ్డ టామ్ కాలికి బులెట్ తగులుతుంది. జిమ్ పారిపోవటానికి నిరాకరిస్తాడు. హక్ డాక్టర్ కోసం పరిగెడతాడు. తన యజమాని టామ్ సేవచేసుకుంటూ అక్కడే వుంటానంటాడు జిమ్. అప్పుడు టామ్ అసలు రహస్యం బయటపెడతాడు. మిస్ వాట్సన్ తన వీలునామాలో జిమ్‌కు స్వేచ్ఛ ప్రసాదించి మరీ మరణించింది. మరి అన్నీ తెలిసి, "యింత నాటకమెందుకు నడిపించావురా" అంటే, "ఆమాత్రం థ్రిల్, సస్పెన్స్ లేకపోతే ఎలా?" అంటాడు టామ్.

జిమ్ యిప్పుడు స్వతంత్ర పౌరుడు - హక్ తండ్రి ఎప్పుడో మరణించాడు. "ఆనాడు బోటులో కనిపించిన శవం అతడిదే. అందుకే నిన్ను చూడనివ్వలేదు" అంటాడు హక్‌తో.

ఆంట్ శాలీ హక్‌ను మళ్ళీ 'సివిలైజ్' చేస్తానంటుంది.

–వసంత

# మూడో గాడిద

## చతుర కత

- మల్లాది వెంకట కృష్ణమూర్తి

ఆ రోజు స్కూల్‌ని తనిఖీ చేయడానికి జిల్లా విద్యాశాఖ కార్యాలయంనించి మోడల్ పబ్లిక్ స్కూల్‌కి ఇన్‌స్పెక్టర్ రాబోతున్నాడు. అందుకని ప్రిన్సిపాల్ ఉదయం త్వరగా వచ్చి, స్కూల్ సరిగ్గా ఊడ్చారో లేదో, శుభ్రంగా ఉందో లేదో అని తనిఖీ చేయసాగాడు. ఎందుకంటే ఈ సంవత్సరం చేరిన విద్యార్థులలో కొందరు పోకిరివాళ్లు ఉన్నారు. వాళ్లు తరచూ ప్రాక్టికల్ జోక్స్ వేస్తుంటారు.

అకస్మాత్తుగా అతనికి స్కూల్ ఆవరణలో ఓ గాడిద కనిపించింది. దాని రెండు పక్కలా 4 అన్న సంఖ్యరాసి ఉండటం గమనించాడు. దాని పక్కనే ఉన్న ఇంకో గాడిద వీపుమీద కూడా రెండు వైపులా 2 అంకె కనిపించింది.

అది ఆ పోకిరి విద్యార్థుల పనే అని గ్రహించిన ప్రిన్సిపాల్ వెంటనే ప్యూన్‌లు ఇద్దర్ని పిలిచి వాటిని ఆవరణలోంచి బయటకి తోలమని చెప్పాడు. ఆ రెండు గాదిదలే కాక, మరో రెండు గాడిదలు కూడా ఆవరణలో ఉంటాయని, వాటి మీద 1, 3 అని అంకెలు వేసి ఉంటాయని, వాటిని కూడా వెతకమని ప్యూన్లకి చెప్పాడు.

మొదట 4, 2 నంబర్లు రాసి ఉన్న గాడిదలని ప్యూన్‌లు ఇద్దరూ స్కూల్ గేట్‌లోంచి బయటకు తరిమేసారు. తర్వాత వెతికితే 1 నంబరు రాసి ఉన్న గాడిద కనిపించింది. దాన్నికూడా బయటకి తరిమేసారు. 3వ నెంబరు వేసి ఉన్న గాడిద కోసం వాళ్లు వెదక సాగారు. పావు గంట పైన వెదికినా అది వాళ్లకి కనబడ లేదు.

ఈలోగా స్కూల్ టైం అవడంతో విద్యార్థులు రాసాగారు. పిన్సిపాల్ కొద్దిగా ఆందోళనగా వాళ్లతో చెప్పాడు-

"మీరంతా మనస్కూల్ ఆవరణలో 3వ నెంబరు వేసివున్న గాడిదని వెతికి బయటకు తరిమేయండి. ఇవ్వాళ స్కూల్ ఇన్‌స్పెక్షన్ ఉంది"



విద్యార్థులు, ప్యూన్లు ప్లేగ్రౌండ్‌లో, క్లాసు రూముల్లో మూడో నెంబరు గాడిదకోసం వెతకసాగారు. ఈ లోగా డిఈవో ఆఫీస్ నించి ఇన్‌స్పెక్టర్ వచ్చాడు. పిన్సిపాల్‌లో టెన్షన్ పెరిగింది. కొద్దిక్షణాల్లో ప్రిన్సిపాల్ సెల్‌ఫోన్ మోగింది. ఆయన 'హలో' అనగానే ఓ విద్యార్థి కంఠం వినిపించింది-

"నీ ఆఫీస్ రూంలోకి వెళ్లి చూడు, మూడో గాడిద వివరం తెలుస్తుంది"

ప్రిన్సిపాల్ గబగబ తన ఆఫీస్‌రూమ్‌లోకి వెళ్లి చూస్తే, బ్లాక్ బోర్డుమీద చాక్‌పీస్‌తో రాసి ఉన్న వాక్యం కనిపించింది.

'మూడో గాడిద మీరే. మూడు గాడిదలకే 1, 2, 4 నంబర్లు వేశాను.'

ఇన్‌స్పెక్టర్ తన గదిలోకి వచ్చేలోగా ప్రిన్సిపాల్ గబగబ చేత్తో ఈ వాక్యాన్ని తుడిచేశాడు.

©

# కిడ్నాప్!

టాంక్ బండ్ 17 కథలు

ట్యాంక్ బండ్ పై పోతన విగ్రహంవద్ద కూర్చుంది లహరి. మాటిమాటికి వాచీ చూసుకుంటోందామె.

'ఏడున్నరకల్లా ట్యాంక్ బండ్ కు రా.. అర్జంటు' అంటూ మెసేజిచ్చినవాడు ఎనిమిదైనా రాడేంటి? హాస్టల్ గేటు మూసేస్తారేమో ఎలా? రాహుల్ ను తిట్టుకుంటోంది.

కాలేజి బ్యూటీగా కుర్రకారు గుండెల్లో తిష్ట వేసిన లహరి ఎమ్మెస్సీ చేస్తోంది. తమక్లాస్ మొత్తానికీ తెలివైన రాహుల్ అంటే ఆమెకు ఇష్టం. అతనూ అంతే! వారానికోసారైనా ఇద్దరూ ఎక్కడో అక్కడ బయట కలుస్తుంటారు. అతను రమ్మన్నాడనే తను ట్యాంక్ బండ్ కు వచ్చింది ఇవ్వాళ.

చెవిదగ్గర సంగీతం విన్పిస్తున్న దోమల్ని తోలుకుంటూ విసుగ్గా దిక్కులు చూస్తున్న లహరిని అల్లంత దూరంలో ఉన్న పూపొద చాటు నుంచి రెండు జతల కళ్లు నిశితంగా గమనిస్తున్నాయి.

ఆ కళ్లు రాజేశ్, రమేశ్ లవే! వారిద్దరూ లహరి క్లాస్‌మేట్సే. వాళ్లకి ఆమె అంటే విపరీతమైన ద్వేషం. ముఖ్యంగా కాలేజీలో చేరిన కొత్తలో రాజేశ్ ప్రేమంటూ ఆమె వెంటపడ్డాడు. ఆమె ప్రిన్సిపాల్ కు ఫిర్యాదు చేసింది. ఫలితం రాజేశ్ సస్పెన్షన్! అందరి ముందూ లహరికి క్షమాపణ చెప్పాకే, అతనిపై సస్పెన్షన్ ఎత్తేశాడు ప్రిన్సిపాల్. అప్పుడు తనను అల్లరిచేసి, ఇప్పుడు రాహుల్ తో ప్రేమాయణం సాగిస్తున్న లహరిని క్షమించలేకపోయాడు రాజేశ్. పైకి మామూలుగా ఉంటూనే అవకాశం కోసం చూస్తున్నాడు.. ఆ అవకాశం ఇవ్వాళ ఉదయం వచ్చింది..

క్లాసులయ్యాక ఎవరిదారిన వారు వెళ్తున్నప్పుడు మోడల్ చూసిస్తానని చెప్పి రాహుల్ సెల్ తీసుకున్నాడు రాజేశ్. అందులోనుంచి లహరికి 'సాయంత్రం ఏడున్నరకు ట్యాంక్ బండ్ కు రా.. అర్జంటు' అని మెసేజి ఇచ్చాడు. ఆ విషయం రాహుల్ కు తెలియదు.

అసలు రాజేశ్ పథకం ఏమంటే - రాహుల్ పేరుతో ట్యాంక్ బండ్ పైకి రప్పించిన లహరిని అనుకోకుండా కలిసినట్లు తమ బృందం కలుస్తారు. కబుర్లాడుతూనే క్లోరోఫారం పూసిన కర్చీఫ్ ముక్కుదగ్గర ఉంచుతారు. స్పృహతప్పగానే ఆమెకు ఆరోగ్యం బాగోలేదని, ఆస్పత్రికి తీసుకువెళ్తున్నామని, చుట్టుపక్కల వారికి ఏ మాత్రం అనుమానం రాకుండా ఆటోలో ఊరిబయటకు తీసుకుపోతారు. అక్కడ కసితీరా ఆమె శరీరంతో ఆడుకున్నాక, ముంబాయి వ్యభిచార గృహానికి తరలిస్తారు. ఇదీప్లాన్!

అయితే క్లోరోఫారం కర్చీఫ్ తీసుకురావాల్సిన సుధీర్‌గాడు, అశోక్‌గాడూ ఇంకా రాలేదు.. వాళ్లకోసం ఎదురుచూస్తూ లహరిని ఓకంట కనిపెడుతున్నారు రాజేశ్, రమేశ్ లు.

'ఛ.. బంగారంలాంటి ఛాన్స్! జనం పల్చబడ్డారు. ఈ సన్నాసులు ఎక్కడ చచ్చారో ఇంకా రాలేదు. ఇవ్వాళ లహరిని కిడ్నాప్ చేయకపోతే మనం ఆడిన నాటకం రేపు దానికీ, ఆ రాహుల్‌గాడికీ తెలిసిపోతుంది. రేపు కాలేజిలో ఏం లొల్లి చేస్తారో? ' రాజేశ్ గొణిగాడు.

అవునన్నట్లు తలాడించాడు రమేశ్. తర్వాత-




'... అన్నా పోనీ మనిద్దరమే పోయి బలవంతంగా..'

'నోనో... అంత రిస్క్ ఎప్పుడూ తీసుకోకూడదు. ఒకమనిషిని.. అదీ స్పృహలో ఉన్న దాన్ని కిడ్నాప్ చేయడం మాటలు కాదురా! ఇదేమన్నా సిన్మా అనుకున్నావా?' విసుక్కున్నాడు రాజేశ్.

'కరెక్టేన్నా..' అన్నాడు రమేశ్. పైకి అన్నాడేకానీ ఈ పొదచాటున కూర్చుని ఎవడికోసమో ఎదురుచూడ్డం అతనికి అస్సలు నచ్చడంలేదు. చక్కెరబొమ్మలా ఉన్న లహరిని ఎప్పుడు ఓ పట్టు పడదామా అని తెగ ఆరాటంగా ఉంది.

మిత్రుడేం మాట్లాడకపోవడంతో అతని వంక చూశాడు రమేశ్. పొదచాటు నుంచి లహరినే గమనిస్తున్న రాజేశ్ ఉలిక్కిపడ్డం గమనించి తనూ ఆ వైపు చూసి షాకయ్యాడు.

లహరి ఏడుస్తోంది.. కర్చీఫ్‌తో కళ్లు తుడుచుకుంటోంది..

మొరటుగా కన్పిస్తున్న ఎవరో నలుగురు ఆమెచుట్టూ నిలబడి ఏదో అంటున్నారు.. వెకిలిగా నవ్వుతున్నారు.. దారేబోయేవాళ్లు కొందరు ఆగి చోద్యం చూస్తున్నారు.

'ఎవర్రావాళ్లు?' ఆందోళనగా అడిగాడు రాజేశ్.

'నాకూ అర్థంకావడం లేదన్నా' అన్నాడు రమేశ్ సిన్సియర్‌గా.

పొదచాటు నుంచి ఇద్దరూ పోతన విగ్రహంవైపు నడిచారు. విగ్రహాన్ని సమీపిస్తుంటే వినబడుతున్నాయి వాళ్లమాటలు..

'ఏమెట్టి కన్నాడే నీ అయ్య... ఓసి నా రొయ్యా!' పాడుతున్నాడొకడు. మిగిలినవాళ్లు డ్యాన్సు చేస్తున్నారు..

'చోళీకే పీచే క్యాహై చోళీకే పీచే.. జర్కిన్‌కే



నీచే క్యాహై జర్కిన్‌కే నీచే..జీన్స్‌కా అందర్ క్యాహై..' అసహ్యంగా అందుకున్నాడు ఇంకొకడు.

'దాన్నడగడం ఎందుకురా? తీసి చూస్తే పోలా? ఎవరన్నా వద్దన్నారా నిన్ను?' రెచ్చగొట్టాడు మరొకడు.

'గుడ్ ఐడియా గురూ. డౌట్లన్నీ ఇప్పుడే క్లియర్ చేస్కుంటా..' అంటూ చోళీకే పాటని హమ్‌చేస్తూ లహరిని సమీపించాడు వాడు.

రాజేశ్ ముఖం జేవురించింది.. ఆగ్రహంతో పిడికిళ్లు బిగుసుకున్నాయి.. రమేశ్‌కీ అంతే! అతనిలో ఇందాకటి కోర్కెస్థానే కోపం రగులుతోంది.. తమ క్లాస్‌మేట్‌ని, అందునా అమ్మాయిని ఎవడో రౌడీవెధవ కారుకూతలు కూయడమా? వడివడిగా మిత్రులిద్దరూ ఆవైపు కదిలారు.

ఎవరో అమ్మాయిని నడిరోడ్డుపై నలుగురు రౌడీవెధవలు అల్లరి పెడుతుంటే దారేపోయే వాళ్లు పోగయ్యారు.. కానీ ఎవరూ జరుగుతున్న అరాచకాన్ని ఆపలేదు.. కొందరు మనకెందుకు అని వెళ్లిపోయారు. ఇంకొందరు రౌడీలతో ఎందుకు గొడవ? పోలీసులకు ఫోన్‌చేస్తే వాళ్లే చూసుకుంటారు.. అని మెల్లగా తప్పుకుంటున్నారు.

ఆ సమయంలో- లహరి గుండెలపై జర్కిన్ లాగేయబోతున్న వ్యక్తి ముఖంపై పడింది.. ఒకే ఒక్క పిడిగుద్దు!

'హా..' అంటూ వాడెళ్లి అవతలపడ్డాడు.. వాళ్లంతా తేరుకునే లోగా రాజేశ్, రమేశ్‌లు లహరికి రక్షణ కవచంలా నిలబడ్డారు.

'ఏ సెయ్యంగ్రా ఈ కుర్రనాకొడుకుల్ని' అంటూ ఇద్దరు రౌడీలు వారిపై లంఘించారు..

అంతలో క్లోరోఫారం కర్చీఫ్ జేబులో పెట్టుకుని వచ్చిన సుధీర్, అశోక్‌లకు అక్కడి దృశ్యం ఆశ్చర్యం కలిగించింది.

తమ మిత్రులతో తలపడుతున్నవారు గూండాలనీ, వాళ్లు లహరిని అల్లరిపెట్టారని తెలియడంతో వారిరక్తం కూడా మరిగింది. ఇంకేం? వాళ్లూ రంగప్రవేశం చేశారు. కుర్రవెధవలు ఇద్దరు కాస్తా నలుగరయ్యేసరికి రౌడీలు కాలికిబుద్ధి చెప్పారు. అప్పుడే అక్కడకి చేరుకున్న పోలీసులు వారి వెంటపడ్డారు.

భయంతో గజగజవణుకుతున్న లహరిని ఓదార్చుతూ స్నేహితులు ధైర్యం చెప్పారు.

'మీరు నలుగురూ రాకపోతే నేను ఏమైపోయేదాన్నో..' అంటూ బావురుమని ఏడుస్తూ నిస్సత్తువగా అక్కడే ఫుట్‌పాత్‌పై కూలబడిపోయింది లహరి.

ఆమె రోదిస్తుంటే ఆ నలుగురికీ కళ్లలోనీరు చిప్పిల్లింది. కడుపులో నరాలు మెలిపెట్టినట్లు బాధ! ఆ సమయంలో బ్యూటీక్వీన్‌లా కాక ఆమె తమ తోబుట్టువులా కన్పించింది. పువ్వులా నవ్వుతూ తిరిగే అమ్మాయికి ఎంతటి కష్టం వచ్చింది? ఆ సమయంలో తామే అక్కడలేకపోతే ఏమై ఉండేనో అన్న తలపురాగానే అందరికీ వెన్ను జలదరించింది.

రాజేశ్ ఆటో పిల్చాడు..

లహరిని మధ్యలో కూర్చోపెట్టుకుని రాజేశ్, రమేశ్‌లు వెనుక సీట్లో కూర్చుంటే డ్రైవర్‌కు చెరోవైపు చేరారు సుధీర్ అశోక్‌లు!

నిస్త్రాణగా రాజేశ్ భుజంమీద తలాన్చిన లహరి-

'రాహుల్ రమ్మని ఎందుకో రాలేదు.. ఔను ఈ వేళప్పుడు మీరు ఇటెందుకొచ్చారు రాజేశ్?' అడిగింది.

'అది.. అది.. అర్జంటు పనుండి రాహుల్ తను రాలేకపోతున్నాని నీకు చెప్పమంటే..' గొణిగాడు రాజేశ్.

'ఐదుగురు ఎక్కిన్రను.. సవారీ యాడికంటే మాట్లాడరేందన్నా?' విసుక్కున్నాడు ఆటోడ్రైవర్.

'బర్కత్‌పురా ఉమన్స్ హాస్టల్ చెలో' అన్నారు మిత్రులు నలుగురూ ఏకకంఠంతో.

—చంద్రప్రతాప్

# మనసున ఉన్నదీ...



★ వేంపల్లి గంగాధర్ 'నేలదిగిన వాన' రాయలసీమ రైతు బతుకు చిత్రాన్ని ఆవిష్కరించింది. ఒకనాడు రాయలేలిన సీమ నేడు కరువు సీమగా మిగిలిపోయింది. మొహం చాటేసిన వానలు, ఎండిన నదులు, ఆక్రమణకు గురైన చెరువులతో రాయలసీమ రైతు జీవితం మరింత దిగజారింది. ఎన్ని ఇబ్బందులెదురైనా, నేలతల్లిని నమ్ముకుని బతుకుపోరు సాగించడం రాయలసీమ రైతులకు భవిష్యత్తు జీవితంపై ఉన్న ఆశావాదాన్ని చూపిస్తుంది. రాయలసీమ మాండలికంలో సాగిన ఈ నవలను ఏకబిగిన చదివి తృప్తిననుభవించాం. నేటికీ లక్కిరెడ్డిపల్లె, రాయచోటి యువతులను పూనాకు తరలించడం, మగవాళ్లు ఎర్రచందనం నరికి తరలించడం జరుగుతున్న విషయాలే.

**– తుళ్లూరు ప్రసన్నలక్ష్మి,** పాతగుంటూరు

★ ఫిబ్రవరి సంచిక 'నేలదిగిన వాన'లో ఓ చినుకు రాలక, పైర్లు పండక, రైతన్న కుటుంబం ఆర్థిక ఇబ్బందుల్లో పడి, ఎద్దుల బండలాగుడు పోటీలోని బహుమతులతో నెట్టుకురావడం.. కడకు వాటినీ కడతేర్చి ఎర్ర కొయ్యల ఊబిలో ఇరుక్కోవడం.. గ్రామీణ సమాజంలోని నేటి పరిస్థితులను చక్కగా చిత్రించింది. అయితే ముగింపు మాత్రం అంతగా నచ్చలేదు.

**– ఎం.కొండారెడ్డి, శివునిపల్లి,** కడప(జిల్లా)

★ 'నేలదిగిన వాన' నవలలో కాంచనకు ఇష్టంలేకపోయినా ఆమె పెళ్లిని తప్పనిసరి పరిస్థితిలో వేరేవారితో జరిపిస్తారు. కానీ కాంచన మనస్సును తెలుసుకోలేకపోయారు. కాంచనకు పాపోడిపై ప్రేమ ఉందనిపిస్తుంది. పాపోడికి నిజంగా కాంచనపై ప్రేమ, ఆకర్షణ ఉంది. అందువల్ల అతడికిచ్చే పెళ్లి చేసివుంటే బాగుండేది. నవలలో ఆమె పాడే ప్రతి పాట సందేశాన్నిస్తూ ఏదో తెలియని అనుభూతి, హాయి కలుగజేస్తుంది. అక్కడక్కడా కొన్ని కొన్ని సంఘటనలు నిజంగా జరిగిన కథలా అనిపించి బాధ కలుగుతుంది. ఇలాంటి చక్కటి నవలను అందించినందుకు కృతజ్ఞతలు.

**– వాడవల్లి రమాదేవి,** ఆరుగొలను, కృష్ణా జిల్లా

★ ఫిబ్రవరి చతురలోని కొత్తగాలి కవితలు సమాజానికి సహకరిస్తాయేమోననిపిస్తుంది. వాటిలో మరిన్ని పంక్తులు పెంచితే ఇంకా బాగుంటుంది. 'కాప్షన్ మీదే' వ్యాఖ్యలు మరొక్కసారి చదివించాయి. బాగున్నాయి.

**– ఉమామహేశ్వర వేణుగోపాలరావు,** హైదరాబాద్

★ జ్ఞానపీఠ మణిపూసల్ని అందిస్తున్నందుకు అభినందనలు. ఓ. హెన్రీ కథలను కూడా కాలాతీతంలో పరిచయం చేస్తే బాగుంటుందేమో! ప్రఖ్యాత నవలాకారులను, వారి నవలలను పరిచయం చేస్తూనే చిన్నకథలకు కూడా మధ్య మధ్యలో స్థానం ఇస్తే ఈ శీర్షిక ఇంకా పరిమళిస్తుంది. వేంపల్లి గంగాధర్ నేలదిగిన వానను చివరివరకూ నేలదిగనిదిగానే నడిపించారు. పునరుక్తి లేకుండా నవల నడిపిస్తే పూర్తి న్యాయం జరిగేదని అనిపించింది.

**– మంచాళ శ్రీలక్ష్మి,** సాగర్ నగర్, విశాఖ

★ నేలదిగిన వాన చాలా కవితాత్మకంగా సాగింది. కాంచన పాపోడు ఇద్దరూ కలిస్తే బావుంటుందనిపించింది. ఏ తప్పూ చేయని కాంచన జీవితంలానే మన గ్రామీణ ప్రాంతాల్లో ఎంతోమంది మహిళలు బలయిపోతుంటారు. రచయిత దీనిని చక్కగా చిత్రించారు. వ్యవసాయం సంక్షోభంలో కూరుకుపోవడంతో దారిద్ర్యం విలయతాండవం చేసే పల్లెటూర్ల యదార్థ చిత్రణ ఇందులో ఉంది. ఇతర శీర్షికలూ చాలా బాగున్నాయి.

**– డి. పుష్ప,** అమరాపురం, అనంతపురం జిల్లా

---


చిరునామా: మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ –500 082

ఈ మెయిల్ చిరునామా: chatura@eenadu.net

# FORM IV (See Rule 8)

**Statement about ownership and other particulars of CHATURA.**

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 4. Publisher's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 5. Editor's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 6. Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | : | **RAMOJI RAO, VASUNDHARA PUBLICATIONS** 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS**
**Sd/- RAMOJI RAO**
Publisher

Date: March 1, 2009

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.






ఈనాడు
ఈనాడు పెళ్ళిపందిరి.నెట్
మూడు ముడులు - ఏడు అడుగుల అనుబంధానికి
శ్రీకారం చుట్టండి... ఒకే ఒక్క క్లిక్‌తో!
www.eenadupellipandiri.net
నేడే రిజిస్టర్ చేసుకోండి
ఎన్నో జంటలను ఏకం చేసి, ఎన్నో లోగిళ్లలో మంగళవాద్యాలు వినిపించిన ఈనాడు పెళ్లిపందిరి కొత్తశోభను సమకూర్చుకుంది. ఈనాడు పెళ్లిపందిరి.నెట్ ఇప్పుడు ఇంటర్నెట్ ద్వారా దేశవిదేశాల్లోని తెలుగువారందరికీ అందుబాటులోకి వచ్చింది. ఇక మీ ఇంట కల్యాణకాంతులు నింపుతుంది. త్వరపడండి! ఈ సదవకాశాన్ని ఉపయోగించుకోవడానికి మీకిదే మా ఆహ్వానం! మీకు నచ్చే సంబంధాల కోసం నేడే ఆన్‌లైన్ రిజిస్టర్ చేసుకోండి.
| దేశవిదేశాల్లో మీ వివరాలు చూసే అవకాశం | ఉపయోగించుకోవడం ఎంతో తేలిక
| మీ సమాచారానికి భద్రత | మొబైల్, ఈమెయిల్ ద్వారా అలర్ట్స్ | ఆకర్షణీయమైన ప్యాకేజీలు
మరిన్ని వివరాలకు సంప్రదించండి: 93942 70030 / 31 / 32 email: info@eenadupellipandiri.net
eenadu pellipandiri.net
శ్రీరస్తు శుభమస్తు కల్యాణప్రాప్తిరస్తు
R K SWAMY BBDO 00:42




CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. HD/965/2009-2011 RNI/32186/78